# చారిత్రక వ్యాసములు

## బౌద్ధయుగము

మల్లంపల్లి సోమశేఖరశర్మ

ప్రకాశకులు :

**ఆధునిక వాఙ్మయ కుటీరము,**

నెం. 22, దివాన్ రామయ్యంగారి రోడ్డు,

**పురసవాకము, మద్రాసు-7**

# పరిచయము

—:o:—

ఆధునికాంధ్ర చరిత్రకారులలో శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు సుప్రసిద్ధులు. దాదాపు ఇరువదియైదు సంవత్సరములనుండియు వీరు కావించుచున్న చారిత్రక పరిశోధన ప్రశంసనీయమై వీరికి చిరస్థాయిగైన యశస్సు నాపాదించుచున్నది. ఆంధ్రుల చారిత్రకదృష్టిని ఫలప్రదమైన మార్గములకు త్రిప్పి మన చరిత్రనిర్మాణమునకు మార్గదర్శకులైన శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరాయ మహాశయునికడ తా మభ్యసించిన ప్రాచీన పరిశోధనావిధానములను నవనవోన్మేషముగ నభివృద్ధి నందించి ఆంధ్రుల గతవైభవమును పటమునందుంబోలె మన హృదయములయందు చిత్రించి మన భావిమహోదయమునకు ఉత్సాహమొసంగుచున్నారు. బహుముఖములైన వీరి రచనలు ప్రత్యేక ప్రశంస లేకయే ప్రసిద్ధి నందియున్నవి.

ఈ చిన్న సంపుటము శ్రీ శర్మగారివ్యాసముల సారమునందగియున్నది. ఆంధ్రులచరిత్ర శాతవాహనులనాటినుండి నేటివరకును మనకు పారాయణయోగ్యము; నేర్చుకొనదగిన పాఠములు ఎన్నియో కలవు. మన సంస్కృతి భారతీయమైనను తద్భిన్నమై ఎట్లు మనకు ప్రత్యేకత నాపాదించి మన నైతిక సాంఘిక రాజకీయాది విషయములలో నాధునికావస్థకు పరిణమించినదియు ఆంధ్రు లాబాలగోపాలము గ్రహింపదగిన విషయము. ఇంతవరకును పలువురు పలువిధములుగా చరిత్ర గ్రంథములు రచించినను కేవలము జాపితాగా రాజకీయవిషయములను రాజవంశావళీ గణనావిధానమున వర్ణించుచు 'బడిపుస్తకము'లను రచించుచుండిరేగాని జనజీవనమును గురించియు ఆంధ్ర సంస్కృతిం గూర్చియు విశేషము వ్రాయరైరి. రాజులు సుప్రసిద్ధులేయైనను జనజీవనముంగూర్చి

తెలియనిచో చరిత్ర నిష్ఫలముగదా. ఇట్టి లోపమును గ్రహించిన శర్మగారు చక్కగా పూరించినారు. భారతీయధర్మమును వర్ణించుటతో నారంభించి, వైదిక బౌద్ధయుగముల మతపరిణామములను వర్ణించి నాటనుండి దేశమునం దేర్పడిన పలు తెరంగుల పరిణామములను, ఆసేతుహిమాచలమును భావిభారతీయ సంస్కృతి కేర్పడిన పునాదిని వర్ణించినారు; సకల భరతఖండమునకు భాగవతవర్షమే నాగరకతాభిక్షను ప్రసాదించినవిషయమును సువ్యక్తపరచినారు. భాగవత నాగరకతాప్రచారమునందు ఆంధ్రులకు గొప్ప పాలుకలదనియు, ఆంధ్రదేశమునుండి జావా మున్నగు దేశములకు వలసలు పోయినవిధములను తేటతెల్లము గావించినారు. ఈ గ్రంథభాగమునుగా చరిత్రపుత్రికా రచనావిధానమును చూడవచ్చును. ఆంధ్ర ద్రావిడవాసులు నేడు భిన్నమతీయులుగా నుండినను ఒకవారేయని తెలియును. ప్రాచీన విద్యలు, విద్యావిధానము, నాటి ఘటికాస్థానములు, గ్రామములు మఠములును తత్పరులైనను సాహిత్యాదికములలో ప్రవీణులై జనుల యందు గౌరవములో నుండినవిధము, గ్రామజీవనము, చాతుర్వర్ణ్యముయొక్క ప్రాశస్త్యము, ఆంధ్ర, ద్రావిడ, కర్ణాటాదిభేదము లుండియు పరస్పర వివాహసంబంధకములు, తీవ్రమత చర్చలు, శైవమతవ్యాప్తి ఇత్యాది సమకాలీనవిషయములను శాసనాదికములనుండి గ్రహించి వర్ణించియున్నారు. "సర్వశాస్త్రములలో మోక్ష"మనునట్లు తెలుగు యువకులకు ఉత్తేజకమైన గ్రంథ మిది.

శర్మగారి రచనలోని విశేష మేమనగా వ్రాతలోనే అంతర్గతముగా చరిత్ర కాధారములయిన మూలములును, వానిం గొని చరిత్రను నిర్మాణము గావించు శాస్త్రీయవిధానమును ధ్వనించుచున్నవి. శైలి మనోహరము. ప్రధానముగా నీసంపుటము భాషాభ్యాసమునకును చరిత్రపఠనమునకును కూడ ఉపయోగకారి.

డాక్టరు నేలటూరి వేంకటరమణయ్య.

# ఆధునిక వాఙ్మయ కుటీర ప్రచురణములు

—:o:—

## 1. ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము   వెల రు. 1-8-0

రచయిత : మల్లంపల్లి సోమశేఖరశర్మ,

ఇందు క్రీస్తుశకమునకు పూర్వమునుండి 1857 వరకు ఆంధ్రదేశ చరిత్రము పాఠక హృదయమును ఆకర్షించునట్లు కథవలె వ్రాయబడినది. ఎల్లరును చదువ వలసిన గ్రంథము.

## 2. "కరుణకుమార" కథలు   1-8-0

ఆంధ్రదేశ గ్రామ జీవితమును చిత్రించే రసవంతములైన కథలు, పిన్నలను పెద్దలను సమానముగా రంజింపజేసినవి.

## 3. ఆయురారోగ్య విజ్ఞాన పరిణామము   0-10-0

"కృషీవల" విరచితము. దీనిలో ప్రపంచములోని వేరువేరు జాతులు ఆయురారోగ్యభాగ్యాలు పెంపొందించుకోడానికి ఎట్టిసూత్రములు పెట్టుకొని కృషి చేసినది, ప్రజల ఆరోగ్యం కాపాడడానికి, వ్యాధులు నివారించడానికి సోవియటు రష్యా ఏమి చేస్తున్నదీ వివరింపబడినది.

## 4. "బిళ్ళల మొలత్రాడు"   1-0-0

రచయిత : కరుణకుమార

గ్రామజీవనమునకు సంబంధించిన హృదయంగమమయిన కథ. ఇందు నేటి పల్లెటూరి జీవితము చక్కగా చిత్రితమయినది.

(పై గ్రంథములకు తపాలాఖర్చులు వేరు).

తెలియనిచో చరిత్ర నిష్ఫలముగదా. ఇట్టి లోపమును చాలవరకు శర్మగారు చక్కగా పూరించినారు. భారతీయధర్మమును వర్ణించుటతో నారంభించి, వైదిక బౌద్ధయుగముల మతపరిణామములను వర్ణించి వానిచే దేశమునం దేర్పడిన పలు తెరంగుల పరిణామములను, ఆసేతుహిమాచలము భావిభారతీయ సంస్కృతి యేర్పడిన పునాదిని వర్ణించినారు; సకల భరతఖండమునకు భారతవర్షమే నాగరికతాభిక్షను ప్రసాదించినవిధమును సువ్యక్తపరచినారు. భారతి నాగరికతాప్రచారమునందు ఆంధ్రులకు గొప్ప పాలుకలదనియు, ఆంధ్రదేశమునుండి జావా మున్నగు దేశములకు వలసలు పోయినవిధములను తెల్లముగావించినారు. ఉదాహరణముగా చర్మపుత్రికా రచనావిధానమును చూడవచ్చును. ఆంధ్రా ద్వీపవాసులు నేడు భిన్నమతీయులుగా నుండినను మనవారేయని తెలియును. ప్రాచీన విద్యలు, విద్యావిధానము, నాటి ఘటికాస్థానములు, రాజులు పరమతసహనా తత్పరులైనను సాహిత్యాదికములలో ప్రవీణులై జనుల యందు ప్రీతులుగా నుండినవిధము, గ్రామజీవనము, చాతుర్వర్ణ్యముయొక్క సౌహార్ద్రము, ఆంధ్ర, ద్రావిడ, కర్ణాటాదిభేదము లుండియు పరస్పర విద్యాదానాదికములు, తీవ్రమత చర్చలు, శైవమతవ్యాప్తి ఇత్యాది పలువిషయములను శాసనాదికములనుండి గ్రహించి వర్ణించియున్నారు. 'సూక్ష్మములో మోక్ష'మనునట్లు తెలుగు యువకులకు ఉత్తేజకమైన గ్రంథ మిది.

శర్మగారి రచనలోని విశేష మేమనగా వ్రాతలోనే అంతర్గతముగా చరిత్రకాధారములయిన మూలములును, వానిం గొని చరిత్రను నిర్మాణము గావించు శాస్త్రీయవిధానమును ధ్వనించుచున్నవి. శైలి మనోహరము. ప్రధానముగా నీసంపుటము భాషాభ్యాసమునకును చరిత్రపఠనమునకును కూడ ఉపయోగకారి.

డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య.

# ఆధునిక వాఙ్మయ కుటీర ప్రచురణములు

---:0:---

## 1. ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము వెల రు. 1-8-0

రచయిత : మల్లంపల్లి సోమశేఖరశర్మ,

ఇంకా క్రీస్తుశకమునకు పూర్వమునుండి 1857 వరకు ఆంధ్రదేశ చరిత్రము పాఠక హృదయముల ఆకర్షించునట్లు కథవలె వ్రాయబడినది. ఎల్లరును చదువ వలసిన గ్రంథము.

## 2. "కరుణకుమార" కథలు 1-8-0

ఆంధ్రదేశ గ్రామ జీవితమును చిత్రించే రసవంతములైన కథలు, పిన్నలను పెద్దలను సమానముగ రంజింపజేసినవి.

## 3. ఆయురారోగ్య విజ్ఞాన పరిణామము 0-10-0

"కృషీవల" విరచితము. దీనిలో ప్రపంచములోని వేరువేరు జాతులు ఆయురారోగ్యభాగ్యాలు పెంపొందించుకోడానికి ఎట్టిసూత్రములు పెట్టుకొని కృషి చేసినది, ప్రజల ఆరోగ్యం కాపాడడానికి, వ్యాధులు నివారించడానికి సోవియట్ రష్యా ఏమి చేస్తున్నదీ వివరింపబడినది.

## 4. "బిళ్ళల మొలత్రాడు" 1-0-0

రచయిత : కరుణకుమార

గ్రామజీవనమునకు సంబంధించిన హృదయంగమమయిన కథ. ఇందు నేటి పల్లెటూరి జీవితము చక్కగా చిత్రితమయినది.

(పై గ్రంథములకు తపాలాఖర్చులు వేరు).

# నాలుగవకూర్పు

బౌద్ధయుగమునకు సంబంధించిన ఈ 'చారిత్రక వ్యాసము' అను మద్రాసు యూనివర్సిటీవారు దయతో ఇంటరు మీడియట్ పరీక్షకు పాఠ్యగ్రంథముగ నిర్ణయించినందున దీనిలో మార్పులు చేయుట కవకాశము లేకపోయినది. ఉన్న గ్రంథ మున్నది యున్నయట్లే ముద్రించితిని.

కడచిన మూడుకూర్పులను నవ్యసాహిత్యపరిషత్తు పక్షమున ముద్రింపించి, చాల సహాయము కావించిన పరిషత్తువారికిని, ముద్రణ కార్యము స్వయముగా నవరించిపెట్టిన మన్మిత్రులు శ్రీ తెలికిచెర్ల వేంకటరత్నముగారికిని ఇందుమూలమున నా కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాను.

'రాజా ప్రింటర్స్' వారు చాలజాగ్రతతో దీనిని శీఘ్రకాలములో ముద్రించి యిచ్చినందుకు వారికి నా వందనములు.

పురశవాకము, మద్రాసు,<br>
వికృతి, అధికాషాఢము.

గ్రంథకర్త

# పీఠిక

## మొదటి కూర్పు

‘చారిత్రక వ్యాసములు’ అను శీర్షికలో ‘బౌద్ధయుగ’ మను నీ తొలి సంపుటమున బౌద్ధయుగమునాటి భారతీయ సంస్కృతికి సంబంధించిన వ్యాసములు సంకలితము చేయబడినవి. వీటిలో భారతీయ ధర్మ సంస్కృతిసామ్రాజ్యము, క్రతుకలాపము, ప్రశాంతవిప్లవము, రాజగృహము అనునవి ‘ఆంధ్ర’వారపత్రిక సంచికలలోను, అమరావతీ స్తూపము, నాగార్జునకొండ, జావాద్వీపవాసుల వినోదములు—వాయంగ్ ఆటలు, మన ప్రాచీన విద్యాసంస్థలు అనునవి ‘ఆంధ్రపత్రిక’ ఉగాది సంచికలలోను, మన ప్రాచీన వృత్తివిద్యావిధానము, బౌద్ధవాఙ్మయము—పరిశోధన అనునవి ‘భారతి’పత్రికలోను, ‘చీనా హిందూదేశములు—వాని ప్రాచీనానుబంధము’ అనునది ‘ప్రజామిత్ర’ చీనా సంచికలోను ప్రకటితములైనవి. ఆదరముతో తమ పత్రికలలో నీ వ్యాసములను ప్రకటించినందుకు ఆయాయి పత్రికాధిపతులకు నా కృతజ్ఞతాపూర్వకవందనములను తెలుపుకొనుచున్నాను.

ఈ గ్రంథమునకు దయతో ‘పరిచయము’ వ్రాసి యొసంగిన శ్రీ నేలటూరి వేంకట రమణయ్య (ఎం. ఏ., పిహెచ్. డి.) గారికిని, నవ్యసాహిత్యపరిషత్తుపక్షమున దీనిని ప్రకటించినందుకు పరిషత్తువారికిని నా యభివందనము లర్పించుచున్నాను.

మల్లంపల్లి సోమశేఖరశర్మ

# అనుక్రమణిక

—: o :—



—: o :—

హస్తుఁడు భారతవర్షీయ ధానుష్కుఁడు యుద్ధభూమిని నిలిచి ప్రత్యాలీఢపాదుఁడయి ధనువు భూమిమీఁద మోపి నారి సారించి టంకారముచేసి గుఱి చూచి బాణమును వదలెనా డాలు, కవచము మొదలయిన తనుత్రాణసాధనము లెందు నకుఁ బనికిరావని విదేశీయులే వ్రాసియున్నారు. ఇంతటివిశిష్ట సంపద యున్నను భారతీయపతాక దేశాంతర దుర్గములపై నేనాఁడును రెపరెపలాడియుండలేదు. భారతవర్షీయ మహీపతి విజయప్రస్థానమునకై భారతవర్ష సీమానదులను దాఁటి వెడలి వెలిగుడారమును నిర్మింపక పోవుటకు అధర్మభయమే కారణమని క్రీస్తుశకము రెండవ శతాబ్దినాఁటి ఏరియాఁ అను చరిత్రకారుఁడు వక్కాణించియున్నాఁడు! అది ప్రాచీన కాలపు భారతనీతి. అది భారతీయుల ధర్మబుద్ధి.

ధర్మమే లక్ష్యముగను, ధర్మమే సాధనముగను బెట్టు కొని, అర్థకామములనే కాదు మోక్షమునుగూడ సాధింపఁ దలపెట్టినవారు భారతీయులు. భారతీయ నృపాలురు కొంద ఱీ ధర్మాదర్శము నందుకొనలేక పతితులై యుండవచ్చును; మఱికొందఱు దీని ననుభవమునకుఁ దెచ్చుకొనుటకు ప్రయ త్నించియు కృతార్థులు కాకపోయియుండవచ్చును. వేఱొక కొందఱు హృదయదౌర్బల్యావశమునను, విషమపరిస్థితుల వలనను ఆ యాదర్శమును కార్యరూపమున వెలయింపఁ జేయలేకయే పోవచ్చును; కాని మేటి మహీపతులయినను సరే, సామాన్య మానవులైనను సరే భారతీయులకు ధర్మమే లక్ష్యము; ధర్మమే యాదర్శము. అదియే ప్రాచీన రాజ్య తంత్రమునకు జీవగఱ్ఱ.

మన పూర్వులు రాజుల యోగ్యతను, వారి రాజ్య పరిపాలన సౌష్ఠవమును గొలుచుచు వచ్చినది వారు ప్రవేశ పెట్టిన రాజకీయసంస్కారణములననుసరించి కాదు; వారు తల పెట్టిన సాంఘిక సంస్కారణల ననుసరించి కాదు ; వారొసంగుచువచ్చిన స్వేచ్ఛాస్వాతంత్ర్య అభయప్రదానముల ననుసరించి కాదు ; వారికి ధర్మమే మానదండము. ప్రభువులు చేసిన ధర్మకార్యముల ననుసరించి, వారు పాలించిన ధర్మ నియమముల ననుసరించి, వారి ధర్మతత్పరత ననుసరించి వారి రాజకీయపు యోగ్యతను దీర్మానించుచుండిరి. కాక పోయినచో, స్వేచ్ఛాస్వాతంత్ర్యముల నొసంగుటకు రాజెవడు? అవి ప్రజల వజ్రసంకల్పమున నున్నవి : ప్రజల చేతియందు న్నవి. రాజకీయసంస్కారణములను ప్రసాదించుటకు రాజెవరు ? అతండు పట్టి పెట్టెడువాడు (Executive officer). రాజు భారతసీతి ననుసరించి, దూరదర్శులై సంఘక్షేమము సరసి నియమ నిబంధనములను గావించిన ధర్మజ్ఞుల ధర్మ నిర్ణయమునకు బద్ధుండయి రాజ్యమేలవలసిన యుద్యోగి ; పరిపాలనా కార్యనిర్వాహకవర్గమున కధిపతిమాత్రమే. సాంఘికసంస్కారణములను దలపెట్టుటలో రాజునకేమాత్రము ప్రమేయము లేదు. ఆ బాధ్యత హిందూసంఘశరీరమున వేర్వేఱు అంగముల ప్రాయముగనున్న కులములది ; కుల పెద్దలది. సంఘక్షేమంకరములును, రాజకీయములు నైన నిర్ణయములను ధర్మబుద్ధితో అమలు జరుపవలసిన యధికారి మాత్రమే రాజు. ధర్మమును లక్ష్యముగఁ బెట్టుకొని ధర్మ పరిపాలనము కావింపకపోయినచో ధర్మహానియు, దేశమున

కలిష్టమును సంభవించును ; ప్రజలు చేయు పాపము రాజునకు చెందును. అట్టి రాజునకు నరకము ధ్రువము. ధర్మపరిపాలన శీలమే రాజును విష్ణ్వంశసంభూతునిఁ గావించినది. భారతీయ సాంప్రదాయ మట్టిది గనుక ఒకానొకప్పుడు రాజు ధర్మచ్యుతుఁడయి ప్రజాకంటకుఁడయినను బిడ్డ తల్లినివలె ప్రజలు రాజును ఆశ్రయించువారు. రాజభక్తినే కాని ప్రాచీనభారతీయులు దేశభక్తి నెఱుఁగరు.

ప్రాచీన భారతవర్షము లక్ష్మీ మగు, సాహస మగు. కావుననే దేశాంతరసీమలయందు భారతీయుల రాజ్యపతాకను స్థాపనము లేకపోయినది. అయినను వారికి ధర్మమునెడఁగల నిగూఢవిశ్వాసముచేతను, భక్తితత్పరతచేతను, దేశాంతర, ద్వీపాంతరములందు భారత ధర్మపతాకకు [illegible] యుద లీలానృత్యము చేసినది. సైనికసామ్రాజ్యమును గాకపోయినను ప్రాచీన భారతీయుఁడు తన దేశపుసరిహద్దులను దాఁటి వేలకొలఁదిమైళ్ళ విస్తీర్ణముగల ధర్మసామ్రాజ్యమును నెలకొల్పినాఁడు. భారతీయ విజ్ఞానజ్యోతిని దేశాంతరములకును, ద్వీపాంతరములకును గొనిపోయి, అజ్ఞానాంధకారమును పారఁద్రోలి, భారతీయ సంస్కృతిని సభ్యతను పైఁబెట్టి, ధర్మసామ్రాజ్యాధినేతయై విరాజిల్లినాఁడు. దేశాంతరుల సౌహార్ద్రమును, ప్రేమసంపదను చూఱలాడినాఁడు.

దూరస్థములైన ద్వీపములతోను, దేశములతోను భారతీయుఁడు వర్తక వ్యాపారమును సలిపి రత్నరాసులను మాతృదేశమునకు తరలించుకొనివచ్చినను, వానియందు

వలసలు స్థాపించి భారతజాతీయతకు పాదులు కట్టినను, నక్రమెుగ నచ్చట ఒకవేళ నతని కరవాలము విజయలక్ష్మినే వరించినను ఇవి యన్నియు నొకలెక్కలోనివి కావు. కావున భారత ధర్మసంస్కృతి విజయమునకు సరిపచ్చు నధ్యాయము ప్రపంచచరిత్రమునం గానరాదు.

ఆసియాఖండమున బాహాపు సగము భాగము భారత ధర్మసంస్కృతి నాధారముచేసికొని తన సంస్కృతి సభ్యతలను నిర్మించుకొన్నది. ఆసియాఖండ ప్రాగ్దేశములందలి మతము, కళలు, అక్షరములు, వాఙ్మయము మొదలైన నన్నియు తొలుదొలుత, బ్రాహ్మణములైననేమి, బౌద్ధములైననేమి, భారతీయులనలని దానఫలములే యని ప్రాచ్య విద్వాంసు లంగీకరించిన విషయము. చీనా, తిబెత్తు, జపాను, కొరియా, బర్మా, సయాం, కాంభోజము, చంప, మలయా ద్వీపకల్పము మొదలైన దేశములును, సింహళము, జావా, బోర్నియో, పసిఫికు దీవులు మొదలగు ద్వీపములును భారత ధర్మవేదికకడ భారతీయాచార్యపాదుల ప్రమోల అధివసించి యుపదేశము పొంది ప్రవర్ధమానము లయినవి.

భారతవర్షము పాలపొంగువలె పొంగి తన యంచులను మించి విస్తరిల్లి సామ్రాజ్యమల్లి తన సంస్కృతి సభ్యతలను వెదవెట్టిన యదనులు దేశచారిత్రమున మూడను గలవు. ఈ మూడును మూడు ప్రధానఘట్టములు. ఇవి భారతధర్మసంస్కృతికి మూడు విజయప్రస్థానములు.

మొదటి ప్రస్థానము ఆంధ్రమసీాపతుల కాలమున జరిగినది. ధనకటకము రాజధానిగ ఆంధ్రభూధవులు

వింధ్యకు దక్షిణమునఁగల దక్షిణాపథ దేశములయందు ఆర్య ధర్మసంస్కృతికి, సభ్యతకు మళ్ళు కట్టి కృషి సాగించు చుండిన కాలమున హిందూ, బౌద్ధ మతాచార్యులు ఆంధ్ర సాంయాత్రికుల వెన్నంటిపోయి ప్రాగ్దిశను, ఆగ్నేయదిశను గల ద్వీపములందును, దేశములందును ప్రచారము కావించి భారతధర్మసంస్కృతికి మందిరములు మలఁచుచువచ్చిరి. బృహద్భారత ధర్మసంస్కృతి సామ్రాజ్యనిర్మాణమున ఆంధ్రులు విశేషముగ కృషి చేసినను నేఁటి ఆంధ్రుల చారిత్రక జిజ్ఞాసాభావమువలనను, భారతవర్ష చరిత్రకారుల సంకుచితదృష్టివలనను ఆంధ్రుల కీర్తికాంతులు దృగ్గోచర మగుటలేదు. ఇది శోచనీయమైన విషయము.

రెండవ ప్రస్థానము కుషాణభూవరులకాలమున జరిగినది. క్రీస్తుశకము మొదటి శతాబ్దులలో ఉత్తరహిందూ దేశము భారతధర్మసంస్కృతియెడలఁ జూపిన యభిమాన దరములు తచ్చారిత్రమున నొక విశిష్టాధ్యాయముగ రూపొంద వలసినవి. భారతధర్మసంస్కృతి ఈ కాలమున నుత్తర దిశకును, ఈశాన్యదిశకును జాలువారి యచ్చటి దేశములను ధర్మక్షేత్రములను కావించినది.

అరబ్బుల సింధు దేశవిజయము కాలక్రమమున ఇస్లాము మతచారిత్రమున నొక విజయగాథగమాత్రమే పరిణమించి నను అది భారతధర్మసంస్కృతి పశ్చిమ, వాయవ్యదిశలకు ప్రసరించుటకు దారి చూపి యొక మహాఘట్ట మయినది. ఇదియే మూఁడవ ప్రస్థానము.

వామనుడు తన పాదత్రయముచేత ముల్లోకముల నాక్రమించినట్లు భారతసంస్కృతి యీ మూడు ప్రస్థానముల యందును దిశాష్టకము నాక్రమించి యతిశయిల్లినది. అప్పటికి నిప్పటికి ప్రపంచచారిత్రమున ధర్మసామ్రాజ్యమును స్థాపింప యత్నించినవారును, స్థాపించినవారు నొక్క భారతీయులే. భారతీయుల ధర్మసంస్కృతి సామ్రాజ్యచారిత్రము అపూర్వమయిన యొక ధర్మవిజయగీతము ; ఒక అహింసా విజయగాథ. అది భారతీయుల మంజుల మనోహర ఆధ్యాత్మిక గానము.



# క్రతు కలాపము

ఏమో ఎవ్వ రెఱుంగుదురు ఎప్పుడు పుట్టి పెరిఁగి ఇంతటి పెద్దవాఁడయ్యెనో? ఎంత కాలమునుండి యచ్చట నివాసముండెనో? చరిత్రకు కొంత ప్రాజ్ఞత వచ్చునాఁటికే ఆయుష్మంతుఁడైన ఆర్యకుమారుఁడు భారతభూమిని వచ్చి పైరు చేల నడుమ, వనలక్ష్మి అందాలు దిద్దుకొను సాంద్రాటవీ సీమల మధ్య ఆశ్రమపదములు నిర్మించుకొని పర్ణకుటీరములందు కర్మపరతంత్రుఁడయి విరాజిల్లెను. ముం దగ్నిహోత్రముతో, పార్శ్వములయం దధ్యయనపరాయణులయిన ఛాత్రబృందముతో వేదఋక్కులను వల్లెవేయుచు; నెడనెడ సామగానము సేయుచు, తాను త్రొక్కినంత మేర భూతలమును కర్మక్షేత్రముగను, ఆజన్మాంతమును దన భౌతిక దేహమును కర్మనిబద్ధముగను గావించి తన చూపు ప్రాఁకినంత లెక్క తానే పెద్దనని గడ్డము సవరించుకొనుచు దర్పముతో ప్రవర్తించిన కర్మవీరుఁ డతఁడు. జగత్తింకను నిద్రాపరవశమై యుండఁగనే తొలుదొలుత మేలుకాంచి తెలివి తెచ్చుకొని పెద్దఱికము వహించిన ప్రోడ యతఁడు. ఎవ్వ రెఱుంగుదురు? ఎప్పుడు పుట్టి పెరిఁగి యింతటి పెద్దవాఁ డయ్యెనో, ఎంతకాలమునుండి యచ్చట నివాసముండెనో?

ద్యావాపృథ్వులకు, మిత్రావరుణులకు, వాయ్వర్కాగ్నేములకు తెలియును అతని పుట్టు పూర్వోత్తరములు కొంత

తంత్రులయిన బ్రాహ్మణ్యులు పురోహితులై సంఘశరీరమునఁ బ్రాధాన్యము వహించిరి. సత్యము, శమము, దమము, దానము, ధర్మము, త్యాగము మొదలగు కల్యాణగుణము లకు నిదానమయి బ్రాహ్మణుఁడు పూజ్యత గడించెను. అభ్యు దయమును, శ్రేయస్సును కాంక్షించు సాంఘికుఁడు తలపెట్టు ప్రతిస్వల్పవిషయమునకు కాలక్రమమున అగ్నికార్య మనివా ర్యమయి, క్రతుసంఖ్యయు, దానితోపాటు కర్మకాండమును కొండంతగ పెరిఁగిపోఁగు సంఘపురోహితుఁడయిన బ్రాహ్మ ణుని కెక్కుడ లేని యాధిక్యమును వచ్చినది. తన మంత్రశక్తి వలనను, క్రతుకర్మాదికములవలనను దేవతలను వశముకావించు కొన్న బ్రాహ్మణుఁడు సాంఘికులదృష్టిలో భూదేవుఁడైనాఁడు. భూదేవుని పోషించుటయు, యజ్ఞయాగాది వైదిక కర్మల యందు భూరిసంభావనలచేతను, గోదానాదికములచేతను సంప్రీతునిఁ జేయుటయు రాజన్యాది బ్రాహ్మణేతర సాంఘికుల విధికృత్య మయ్యెను.

కర్మవలన నుత్తమగతులు కలుగును. కర్మవలన జీవాత్మ జన్మాంతరములయం దుత్తరోత్తర ముత్కృష్టజన్మ మెత్తుచు నుత్తమపదమును బొందుచుండును. జీవికి తరణో పాయము కర్మతప్ప వేఱులేదు. తమకు నియతములయిన కర్మల నాచరించుచు, వర్ణాశ్రమోచితధర్మములను బరిపా లించుచుండినచో ఆయావర్ణములవా రుత్తమలోకములను బొందఁగలరు. వర్ణాశ్రమధర్మ విరుద్ధముగ బ్రవర్తించువాఁడు పతితుఁడు ; నింద్యుఁడు.

అగ్రవర్ణములయం దిట్టియభిప్రాయములు బలిసి కర్మకాండము ముదిరినది. కర్మకాండమునఁ గలుగుచున్న మార్పులతో క్రొత్త క్రొత్త యాచారములును, సంప్రదాయములును వాడుకలోనికి వచ్చినవి. వచ్చిన ప్రతి సంప్రదాయమును, ఆచారమును క్రొత్త క్రొత్త మంత్ర తంత్రము లాదుకొని, సమర్థించి, బలపఱుచుచు వచ్చినవి. యజ్ఞయాగాదుల సందర్భమున క్రమప్రాధాన్యముఁ గాంచిన బలిహరణక్రియకు ఓషధీ వర్గధాన్యాదికములకు బదులు పశువు వరిష్ఠమయి పశుహింస లక్షణమైనది. ఆర్యావర్త యాగశాల మంత్రమిశ్రితమయిన పశువిశసనశాల యయ్యెను. దినదిన మునీ కర్మకాండమునకు క్రొత్త కూర్పే కాని మార్పన్నది లేకపోయినది. తా నుత్పాదించిన కర్మయంత్రమునకు తానే దాసుఁడై భారతీయకర్మిష్ఠుఁడు ఉపజ్ఞ కోలుపోయి యాంత్రపు టుఱులలోఁ జిక్కువడిపోయెను.

కర్మకాండముతో నూపిరి సలుపక యుక్కిరిబిక్కిరగు చుండిన భారతీయసంఘమున క్రమముగా నశాంతి యతిశయించినది. ఒకవైపు యజ్ఞయాగాదుల ప్రయోజనమును, మఱియొకవైపు బ్రాహ్మణుల ప్రవర్తనాధిక్యములును తీవ్ర విమర్శలకు గుఱియగుచు వచ్చినవి.

గృహస్థాశ్రమమును, దానితోపాటు చాలవఱకు వేదవిహితకర్మాదికమును పరిత్యజించి యరణ్యవాసముచేయు వానప్రస్థులును, సర్వసంగ పరిత్యాగము గావించి జనపదము లందు పర్యటనముచేయుచు సాంఘికులకు ధర్మోపదేశము

చేయు సన్న్యాసులును క్రతుకర్మాదికముల ప్రయోజన సామర్థ్యములనుగూర్చి సంశయావిలమనస్కులై తర్క వితర్కములు చేయుచుండిరి. వేదార్థమునుగురించియు, సృష్టిఉత్పత్తి స్థితిలయములను గురించియు జిజ్ఞాస యధికమయినది. సృష్టి యెట్లు కలుగుచున్నది ; జన్మించుటకు పూర్వమునను, మరణించిన యనంతరమునను భూతకోటిస్థితి యెట్టిది ; పరమాత్మ యెవరు ; బ్రహ్మ మన నేమి – ఈ మొదలగు తర్క వితర్కములకు, జిజ్ఞాసకు ఫలముగ వేదాంతము, ఉపనిషద్విజ్ఞానము ఫలకరించినది. యజ్ఞకర్మలు నిష్ఫలమను నమ్మకము నానాటికి ప్రబలమయినది. క్రతుకార్యసంకులమయిన భారతవర్షమున వేదములను, వైదిక కర్మలను నిరసించి తిరస్కరించు సంప్రదాయములు పొడసూపినవి.

అయినను కర్మప్రవృత్తమయిన లోకము నూతనావిష్కృత సంప్రదాయ ప్రబోధములకు చెవి యొగ్గి యాలించుటకుఁగూడ క్షణమాత్రము నవకాశము లేక గిర్రున తిరిగి పోవుచుండెను. సంప్రదాయముల సంఖ్య యెక్కువగుచున్న కొలఁది బ్రాహ్మణునికిఁ దనకర్మయంత్రమున విశ్వాసమును, స్వార్థపరతయు నధికమయినవి. గోదాన, హిరణ్యదానాదికములవలన బ్రాహ్మణులు సంపన్నులయిరి. హిరణ్యాదికములు బ్రాహ్మణహృదయమున మోహలోభతృష్ణాది వికారములను రేఁపెట్టినవి. సంఘమున నూతనముగఁ గలిగిన యనన్యగౌరవాధిక్యసంపదలతో బ్రాహ్మణునికి 'స్వాతిశయము', నహంకారమును మెండయినవి ; ప్రవర్తనము వక్రతనొందినది;

ఫలము కలుగుటచే సిద్ధమగునది; శమ దమ దాన ధర్మాది గుణ ములకంటెను బ్రాహ్మణునికి భాగ్యభోగ్యములకు కారణ మగుచున్న క్రతుకర్మాచరణమే ప్రధానమగుచున్నది; పరమార్థ మును సాధించుట కుపకరణముగ నుండిన క్రతువే మహోపగ మార్గమయి శిరసావహామగునది! బ్రాహ్మణపదము నేను కటిపోతె పూజనీయమగుటకు మూలము అపవాదములకు, అప ప్రథకు కారణమయ్యెను.

క్రతుకార్యకలాపముల ప్రయోజనమును గుర్తించి మేధావులగుచు బ్రాహ్మణులలోవలెనే రాజన్యులయందును మీమాంస బయలుదేరినది. బ్రాహ్మణమతానుసారులై వేదవేదాంగాది విద్యల నభ్యసించి యజ్ఞయాగాదుల నాచ రించుచు రాజ ధర్మము ననుసరించియు, మతధర్మము ననుస రించియు ప్రాధాన్యము వహించి భారతీయసంఘమున క్షత్రి యులు బ్రాహ్మణులకు పిదప ప్రముఖులయిరి. వేదకర్మాచర ణమునకు తమకును గొంత హక్కు కలదనిపించుకొనుచు, కృషి పాశుపాల్య వర్తక వ్యాపారములయందు ప్రవృత్తు లయి వైశ్యులు వృత్తిధర్మము ననుసరించి ప్రాముఖ్యము వహించిరి. చతుర్థవర్ణమువారగు శూద్రులు పై మూడు వర్ణముల వారినుండి ధర్మోపదేశము నొందుచు ధర్మాధర్మ ములను గుర్తెఱుంగుచు, ఉత్తమలోకప్రాప్తికి అగ్రవర్ణుల యూదేశోపదేశముల ప్రకారము ప్రవర్తించుచు సేవాధర్మ మును ప్రధానముగఁ జేసికొని మహితులయిరి.

ఈ రీతిని భారతీయసంఘమున పైనుండి యొక్కొక్క మెట్టు దిగినకొలఁది వేదకర్మ తగ్గిపోవుచువచ్చినది. వేద వేదాంగాది విద్యల నభ్యసించుటకుఁగాని, యజ్ఞయాగాదు లను జేయుటకుఁ గాని ఉపవీతము లాంఛనమయి, దానిని ధరించుటకు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు మాత్రమే యధి కారులయిరి. సన్యాసము స్వీకరించుటకు సర్వ వర్ణములవారిక నధికారము లేకపోయినది. ఉన్నవారిలోనైన నది పురుషు లకు మాత్రమే నిర్ణీతమయ్యెను. వేదవిద్యల నభ్యసించి ధర్మాధర్మములను స్వయముగాఁ దెలిసికొనుటకుఁగాని వైదిక కర్మలయందు పాల్గొనుటకుఁ గాని చతుర్థవర్ణమువారు అనధి కారులయిరి. అయినను ఉత్తమలోక, ఉత్తమజన్మలాభమును ప్రాప్య, లక్ష్యములుగ నుంచి ఆలక్ష్యసిద్ధికి వేదవిహిత క్రతు కర్మాదికమును సాధనముగఁ జేసి, వాటినన్నిఁటిని దన గుప్పిటఁ బెట్టుకొని సర్వాధికారియై నెగడినవాఁడగుటచేత నెట్టివాఁ డయినను బ్రాహ్మణుని యాశ్రయమును, ప్రాపకమును తక్కిన వర్ణములవారికి తప్పనిసరి యయినది. బ్రాహ్మణుల ప్రవర్తనము నానాఁటికి మఱింత గర్వ్యముగుచు వచ్చినను, భూదేవులయినందున వారిని విమర్శింపరాదని కడవర్ణముల వారు తమ హృదయగతభావములను వెలిబుచ్చనోడిరి. సంసారదుఃఖమునుండి తరింపఁ బ్రయత్నించుట కెల్లరకు హక్కున్నప్పుడు ఆ తరణోపాయములయిన యజ్ఞయాగాది కర్మలకును, వేదాంతవిచారమునకును, సన్యాస స్వీకారము నకును అధికారము తమ కెందులకు లేకపోవలెనని కడవర్ణ ములవారియందలి యువజనులు - రహస్యముగనే యుద్యో-

సాహస ప్రశ్నలు వేసి అగ్రవర్ణుల యధికార స్వామ్యమును విమర్శించుచు వచ్చినను కులవృద్ధు లది యరిష్టప్రదమని, ధర్మాతిరిక్తవిచారమని వారిని వారించుచుండిరి.

ఈరీతిని భారతీయసంఘ మనేక విషయములందు రహస్యముగనో బహిరంగముగనో వాద ప్రతివాదములతోను, విమర్శ ప్రతివిమర్శలతోను ప్రతిధ్వనించుచు అశాంతితో పొంగులు దేలుచుండెను. అపూర్వమయిన మానసిక అశాంతి యది! భావనాతీతమయిన పరమార్థజిజ్ఞాస యది. గూఢముగనో ప్రకటముగనో ఎల్లరును బ్రాహ్మణుని విమర్శించువారే; ఎల్లరు నతని క్రతుకర్మకలాపమును నిందించువారే ; ఎల్లరు నతని చేయిదముల కుద్దేశము లారోపించువారే. బ్రాహ్మణకృతములందలి మంచికూడ చెడ్డగఁ దోఁచిన విపరీతకాలమది. సంఘసముద్రము ఘూర్ణిల్లినది. సంఘశక్తులు ప్రకోపించినవి. బుద్ధి విలయతాండవము చేసినది. వికారములు రేఁగినవి. నడుములు కట్టుఁడు. లెండు. మేల్కొనుఁడు. బ్రాహ్మణుఁడు కపటి. వేదములు పౌరుషేయములు. క్రతుకర్మ బూటకము. మోసపోకుఁడు; నిష్ఫల మీతంతు, నిరర్థక మీ ప్రయత్నము—ఇవే బరాబరులు. అంతే. అంతయు అల్లకల్లోలము! తిరుగఁబాటు! విప్లవము!

విప్లవధ్వజమును చేతఁబూని ముందున కడుగిడినవారు క్షత్రియులు. మతధర్మమునకే కాని రాజధర్మమునకు గణ్యత లేనందువలన ఈ యవకాశమును దీసికొని భారతీయ సంఘ నాయకపదమును బ్రాహ్మణుల హస్తమునుండి గుంజుకొని మత

# ప్రశాంత విప్లవము

ఆరముగ్గిన పండువంటి ముసలి ముత్తైదువు వేదమాత ధరించిన పాపటబొట్టువలె పావనమైన గంగానదీతీరమున విరాజిల్లుచున్నది వారణాసీపురము. శ్రౌతకర్మపరాయణు లయిన బ్రాహ్మణుల సంతత యాగహోమధూమపంక్తులు సుళ్లు తిరుగుచు పైకెగసి మేఘమాలికల ననుకరించుచు ఆ నగరరాజమునకు ఒక వింత చెలువమును దిద్దుచుండెను. వేదకర్మాచరణ మొకమూలనుండి యుపనిండ పొలగుచుండెను. ఋత్విజుల మంత్రపాఠములతో, ఉద్గాతల సామగానములతో దిశావలయము గగుర్పాటు నొందుచుండెను. బ్రాహ్మణుల వేదకర్మవిశ్వాస మింకను బిగువు సడలకపోయినను క్రమక్రమముగా పురాతనాచార సంప్రదాయములు బీటలువాఱుచునేయుండెను. వేదచోదితమయిన కర్మవిధిమునకు భూదేవులు కట్టిన మహాదుర్గము వారణాసి గంగ కావలియొడ్డునఁగల మృగదావముననుండి ప్రయుక్తము లగుచుండిన వాదపరంపరకు పునాదులకంట కంపించిపోవుచుండెను.

మృగదావము అంతకు పూర్వము నున్నది కాని పేరు ప్రతిష్ఠలు లేని యారామ మది. జటావల్కలధారులయిన ఋషీశ్వరులు కొందఱచట నిష్టార్థసిద్ధికి ఎన్నెన్నో విధముల ఘోరతప మాచరించుచుండిరి. అందువలన దానికి ఋషి.

పట్టణ మనియు పేరు కలిగినది ; కాని చారిత్రకప్రసిద్ధి కలిగి నదిమాత్రము కనుణాసింధువు బుద్ధుని యోగమునమునే.

బుద్ధుఁ డన్నది సమ్యక్సంబోధి నొందిన పిదప గౌత ముఁడు వహించిన పేరు. హిమవత్పర్వతోపత్యకల రోహిణీనదీ తీరమునందలి కపిలవస్తునగరము రాజధానిగ రాజ్యమేలిన శాక్యవంశజులు గౌతమసగోత్రులు. ఆకారణమున శాక్య వంశజుఁడయిన శుద్ధోదనుని కుమారుని గౌతముఁడని వ్యవహ రించుచువచ్చిరి. చిరకాలమునకు తలిదండ్రుల తపఃఫలముగ నుదయించినవాఁ డగుటచేత అతఁడు సిద్ధార్థుఁడయ్యెను.

కపిలవస్తునుండి దేవదహమునందలి తన పుట్టినింటికిఁ బోవుచు మధ్యేమార్గమున లుంబినీవనమున నించుక విశ్ర మించినతరి నొప్పులు వచ్చి మహామాయాదేవి కీకొడుకు కలి గెను. కాని కొమారుని గొప్పదనమును గుర్తెఱుంగక పూర్వమే ఏడవనాఁడే యామె కాలధర్మము నొందినది. నాఁటినుండి సవతితల్లి మహాప్రజాపతి పేరుపాత్త్రిళ్ళలోఁ బెరిఁగి యాబిడ్డఁడు పెద్దవాఁ డయ్యెను.

సిద్ధార్థుని జీవితమున ప్రధానమయిన విషయము అతని కపిలవస్తుపుర నిర్గమనము. శరీర, బుద్ధిబలములకు సంబంధిం చిన విద్య లన్నిటియందు తోడి శాక్యరాజకుమారుల నందఱ నోడించి మించి, సౌందర్యరాశియైన యశోధరను పరిణయ మాడి సమస్తభోగముల ననుభవించుచుండిన లేఁత వయసు నందే సిద్ధార్థునికి అసంతృప్తి యుదయించినది. కొమారుఁడు భోగభాగ్యములయందును, సౌఖ్యసంతోషములయందును ఓల

బోనుటకు తండ్రి శుద్ధోదనుఁడు చేయఁగలిగిన దంతయుఁ జేసెను. విలాసినీజనమూ, నృత్యగీతవాద్యాది వినోదములూ, నందనవనము నధికరించు నుద్యానవనములూ, అత్యంతమనోహరాకార శిల్పరమణీయములైన ప్రాసాదరాజములూ – ఓ. ఒక్కటేమిటి, అంతయు దేవేంద్రభోగము, వింతలు, వేడుకలు, మహానందము. కాని సిద్ధార్థునిచుట్టు నీరీతి నానంద వాహిని పొంగి పిచికలెత్తుచున్నను ఒకవంక విషాదచ్ఛాయ నలిపంపు మేఘపుఁబొరవలె అతని సుఖచంద్రమండలము నెల్లప్పుడును క్రమ్మియే యుండెడిని. వింతకదా భోగములు కాని, భాగ్యములు కాని, వినోదములు కాని; వేడుకలు కాని యాతని హృదయమునకు శాంతి నొసంగలేకపోయినవి! ప్రశాంతమయిన మహాసముద్రమున బడబానలము రేఁగినట్లు ఆనందతరంగడోలికల నుయ్యాలలూఁగు నాతని మనస్సున దీర్ఘవిచారము మొలకెత్తినది. 'కంటికి కనఁబడున దెల్ల నశించునదే, ఏదియు శాశ్వతముకాదు. లోకము దుఃఖభూయిష్ఠ' మన్న సత్యము గోచరమయినది. అట్లయిన నీమాయాన్వాళ్ళ ముచ్చట కే నురిపెమేల? దుఃఖనిరోధమున కుపాయ మరసినఁగాని జీవికి సుఖము లేదు. లోకమును దుఃఖము పీడించుచున్నంత కాలము తా నొక్కఁడు సౌఖ్యానందములు పొందిన నేమి గాక, అని దుఃఖసంతారక మార్గమును దెలిసికొన నాతఁడు కృతనిశ్చయుఁడయ్యెను. ఈ విషయమున వేదశాస్త్రార్థముల నరయునలెను; బ్రాహ్మణులతో చర్చింపవలెను; జడదారుల నాశ్రయించి యుపదిష్టమార్గమున తపశ్చర్య జరుపవలెనని అతఁడు తలిదండ్రుఁ లెఱుఁగకుండ, భార్యకుఁ దెలియకుండ

ఒకనాఁటి యర్ధరాత్రమున ఇల్లు వెడలిపోవ నిశ్చయించెను. ఇటులు దేశీపోవ నిశ్చయించుకొన్ననాఁడే యాతనికి కొమారుఁడు కలిగినట్లు వార్త తెలిసినది. 'మఱియొక బంధ మిది' అని యాతఁడు నిట్టూర్పుపుచ్చెను. అయినను భాగ్యవిముఖుఁడు కాక, పోఁబోవుతఱి, ఒకమాఱు యశోధరను, కొమారుఁడగు రాహులుని చూచిపోవుదమని యాతఁడు పురిటిగదిలోని కరిగెను. రత్నదీపకాంతిని కొమారుని ప్రక్క నిడుకొని నిదురించు యశోధర, లావణ్యసీమయగు నా కొమారుఁడును- మధుర మోహనముగఁ గనంబడిరి. ఆనందాతిశయమున ముద్దిడుకొనఁబోయినాఁ డతఁడు కుమారుని, కాని మనస్సు ముందునకు లాగుచున్నను కార్యవిఘ్నభయమున వెనుకకు తగ్గి యాతఁడు తనకోర్కెకి కళ్ళెము వైచెను. ఇఁక నచ్చట నిలువక అతఁడు రాజ్యమును, తలిదండ్రులను, భార్యాపుత్రులను, భాగ్యభోగ్యములను, సౌఖ్యానందములను తృణప్రాయముగ పరిత్యజించి లోకకల్యాణముకొఱకు సత్యాన్వేషియై. అంతఃపురమును గడచి, రాజప్రాసాదములను దాఁటి, కపిలవస్తు నగరద్వారము నతిక్రమించి యర్ధరాత్రమున నంతర్హితుఁ డయ్యెను.

తన రాజ్యసీమావధులను దాఁటినపిదప సిద్ధార్థుఁడు రాజకుమారోచితములయిన వేషభూషాదులను విసర్జించెను. రాగకారణమని తుదకు శిరోజములనుగూడ ఛేదించివైచెను. ఐచ్ఛికముగ దారిద్ర్యమును స్వీకరించెను. భిక్షాటనమున జీవితమును గడపుచు మునివృత్తి నవలంబించెను. సత్యాన్వే

మనస్తత్త్వజ్ఞులగు బ్రాహ్మణులతో శాస్త్రార్థ విచారము చేసెను; సన్యాసులకు శుశ్రూష చేసెను; యోగ మభ్యసించెను. అన్ని సంప్రదాయముల ధర్మములను అవబోధము చేసికొనెను. కాని యతని కభిలషితార్థము లభింపలేదు; పరమార్థము గోచరింపలేదు.

పిదప కాశీనగరమునకు సమీపమునందలి మహారణ్యమున ప్రవేశించెను. అచ్చట నైదుగురు తాపసులు ఇంద్రియములను నిగ్రహించి, రాగద్వేషాదుల నణచిపెట్టి తీవ్రమగుచున్న తపము చేయుచుండిరి. వారి పద్ధతినే యవలంబించి సిద్ధార్థుడు మానవుడై జననమరణాదుఃఖమునుండి తరించుటకును ముక్తిని బడయుటకును ధ్యాన ధారణ సమాధులను కుదురుపరచి, ఆ జ్యేష్ఠపాటుగా ఆ యేవురు తాపసులకంటెను అతి దుష్కరమగు ఘోరతపము నాచరించెను. శాక్యముని ఘోరతపము నవలోకించి యా తాపసు లేవురు నాతనిని దమ గురువుగ స్వీకరించిరి. ఇట్లు లెన్నేండ్లు తపము చేసినను సిద్ధార్థునికి అభిలషితార్థము లభింపలేదు. పరమార్థము గోచరింపలేదు! "శరీరశోషణమునఁ గోర్కెలు చావవు; చిత్తమునకు స్థైర్యము కలుగదు; బుద్ధికి నిలుకడయుండదు. ఆహారవిసర్జనమున శరీరము కృశించుట తప్ప వేఱు ప్రయోజనము కానరాదు. కృశీభూతశరీరము కృశీభూత భావములనే యుత్పాదించును. చక్కని భావసంపదకు చక్కని శరీరసంపదకూడ నావశ్యకము. సమ్యక్ శరీరమునఁగాని సమ్యగ్దృష్టి యలవడదు" అని సిద్ధార్థుడు వితర్కించెను; తానంతవఱకవలంబించు

చుండినది సరియైన మార్గము కాదని దానిని పరిత్యజించెను ; మఱల నాహారమును స్వీకరించెను.

తాపసు లేవురు నాతనిలో కలిగిన మార్పునకు ఆశ్చర్యపడిరి. తపోపవాసాయాస క్లేశమును సహింపలేక తమ గురువు పతితుఁడయ్యెనని నిశ్చయించిరి. సిద్ధార్థునియందు కలిగిన యీ మార్పుతో వారి కాతనియందు విశ్వాసము చలించినది. వారు అతనిని వదలివైచి మృగదావమున కరిగి యచ్చట తపము సేయుచుండిరి.

సిద్ధార్థుఁడు తుదిమాఱు సుజాత యను సుశీల భక్తితో నొసఁగిన యాహారము నారగించి యొక యశ్వత్థవృక్షచ్ఛాయ నధివసించి ధ్యానసమాధి నుండఁగా స్ఫుటముగ నతని మనో నేత్రమునకు సత్యము గోచరించెను. అతఁ డంతట సమ్యక్సం బుద్ధుఁడయ్యెను. జగద్వ్యాధికి నిదానమును, చికిత్సయు గోచరించినవి. ధర్మ మవగతమయినది. కీలకమంతయు చతు రార్యసత్యములలోఁ గలదని యా శాక్యముని కనిపెట్టెను.

౧. జగత్తంతయు దుఃఖము, జన్మము దుఃఖము, జర దుఃఖము, అనారోగ్యము దుఃఖము, మృతి దుఃఖము, అప్రియసంయోగము దుఃఖము, ప్రియవియోగము దుఃఖము, వాంఛితార్థానవాప్తి దుఃఖము.

౨. దుఃఖమూలకము తృష్ణ. ఇంద్రియజన్యములు వాంఛలు. వాంఛలు తృష్ణాభివర్ధకములు. వాంఛితార్థసిద్ధికి చేయు ప్రయత్నములు దుఃఖకర సంఘటనలను కలిగించు చున్నవి.

3. తృష్ణ యుడఁగిన దుఃఖ మంతరించును. దుఃఖాంతమే నిర్వాణము.

4. నిర్వాణప్రాప్తికి అష్టాంగమార్గము చక్కనిబాట. ఈ మార్గమునందలి యష్టాంగము లివి: 1. సమ్యగ్దృష్టి; 2. సమ్యక్సంకల్పము; 3. సమ్యక్స్మృతి; 4. సమ్యగ్వాక్కు; 5. సమ్యగాజీవము; 6. సమ్యక్కరణము; 7. సమ్యగ్వ్యాయామము; 8. సమ్యక్సమాధి.

'కేవలము శరీరమును శుష్కింపఁజేసి బాధించుట వలన కార్యములేదు; కేవలము నిరంతర భోగలాలసులై కాలము గడపినను ప్రయోజనములేదు. మధ్యేమార్గ మిదియే యవలంబనీయము: అష్టాంగమార్గమే సంసారతరణోపాయము' అని సంబోధి కలిగెను; సిద్ధార్థుఁడు బుద్ధుఁ డయ్యెను; అరణ్యావాసమును వదలెను; తన ధర్మమును ప్రవర్తింపఁజేయ నతఁడు పర్యటనమున కారంభించెను.

అతని మూర్తియందు దివ్యతేజస్సు గోచరించినది. రాజదండము చేతఁబూని పరిపాలనము నెఱపవలసిన రాజకుమారుఁడు భిక్షాపాత్రము చేతఁగొని లోకహితార్థము ధర్మరాజ్యమును స్థాపింప ఆచార్యపాదులయ్యెను. అతివిచిత్రము గదా విధివిలాసము! పరిపక్వము చెందిన మనస్సుగలవారని గ్రహించి ఇదివఱకుఁ దనశిష్యులుగ నుండిన యేవురు తాపసులకును మున్ముందు తన ధర్మమును బోధింప బుద్ధుఁడు మొట్టమొదట మృగదావమునకు వచ్చెను.

ప్రకృతి యంతయు నూతనశోభతో వెలుఁగొందు చున్న కాలమది. అది వైశాఖ శుద్ధ పూర్ణిమ. ఆనాఁడు బుద్ధుఁడు 'ధర్మచక్రప్రవర్తనము' కావించి ధర్మరాజ్య సౌధ నిర్మాణమునకు పునాదిరాయి వేసెను. వాదప్రతివాదము లును, యుక్తిప్రయుక్తులు నైనతరువాత ఆ యేవురు తాపసులు బుద్ధవచనము నంగీకరించి, భక్తితో ఆచార్యపాదులకు ప్రణామిల్లి శిష్యులైరి. వారిలో కౌండిన్యుఁడు ప్రధానశిష్యుఁ డయ్యెను.

నాఁడు మొదలు దినదినము ధర్మబోధయు, వాద ప్రతి వాదములును జరగుచునేయుండెను. బుద్ధుని వాదశక్తియు, సత్యానురక్తియు, ధర్మాసక్తియు గ్రామములయందు, నగరములయందు పరికీర్తితములయినవి. బుద్ధుని యీ వాదప్రతి వాదములతో వేదమతమునకు ఆఘాతము తగిలినది. ఎట్లయినను వాదమున బుద్ధుని ఓడించి తమ ప్రతిష్ఠ నిలుపుకొనవలెనని ప్రయత్నించియు బ్రాహ్మణులు విఫలమనోరథు లగుచుండిరి.

ఒకనాఁటికంటె ఒకనాఁడు మృగదావమునకు గుంపులు కట్టిపోవు జనసమూహము హెచ్చిపోవుచుండెను. ఏమి ధార, ఏమి హృదయము, ఎంతటి దయ, వాదమున నెంతటి చతురత, ఏమి మహనీయమూర్తి యని ఆశ్చర్యపడువారే, బుద్ధుని ప్రశంసించువారే ఎల్లరును. దర్శనము దొరకినఁ జాలు నా మహాత్మునిది; ఆ మహాత్ముని పాదరేణువు శిరసా వహించి తరించెద మని జనసామాన్యము ఆలుబిడ్డలతోను, తల్లిదండ్రులతోను దూర మనక, భార మనక పట్టణముల

నుండి, పల్లెలనుండి తండోపతండములుగ వచ్చుచుండిరి. వారు పడుచులకు సైతము తెలియు తేటతెల్లమయిన దేశభాషను చేయుచుండుటచేత బుద్ధుని యుపన్యాసములు పండితపామ రంజకమై పామరుల నత్యంత మాకర్షించినవి.

ఈ యుపన్యాసములవలనను, వాదప్రతివాదములవలనను బ్రాహ్మణ సంరక్షితమయిన వేదకర్మము గుట్టుమట్టులు బయటపడి బ్రాహ్మణ ప్రతిష్ఠ పలుచనగుచుండెను. వారాణాసీపురమునందే యజ్ఞయాగాదుల ప్రయోజన సానుకూల్యములను గురించి చర్చలు సాగినవి. బౌద్ధమత సిద్ధాంతములను సామాన్యజనము దృష్టిలో వేద క్రతుకర్మలును, బ్రాహ్మణాచార పద్ధతులును పరిహాసభాజనము లయినవి. కడవర్ణముల వారే కాక అగ్రవర్ణములయందలి విద్వాంసులునయినను బుద్ధుని ధర్మబోధమునందు విశ్వాసము కుదిరి బౌద్ధము నవలంబించుచుండిరి. నూతనమతావలంబకులకు స్వమతాభిమానతియు, పరధర్మనిందాభిరతియు నధికమై బ్రాహ్మణాచార సంప్రదాయదుర్గమగు వారణాసి కాఘాతములు మెండయినవి. నూతన మతావలంబులకు పీతాంబరధారణము, శిరోముండనము లక్షణములయినవి. తండ్రులకుఁ దెలియకుండ కొడుకులు, అన్న లెఱుఁగకుండ తమ్ములు బౌద్ధము నవలంబించి సంఘమునఁ జేరిపోవుచుండిరి. బౌద్ధధర్మము నవలంబించువారికి త్రిరత్నములు – ధర్మము, బుద్ధుఁడు, సంఘము – శరణ్యము లయినవి. తెల్లవారి లేచిన మృగదావము 'ధర్మం శరణం గచ్ఛామి, బుద్ధం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి'

అను మంత్రములతో మాఱుమ్రోఁగుచుండెను. బౌద్ధభిక్షువులు వారణాసివీథులందు సంచరించుచుండి రనఁగనే 'ఎవరివంతో, ఎవరిని లాగుకొనిపోవనున్నారో'' యని బ్రాహ్మణులు మొదలైన త్రైవర్ణికులు తల్లడిల్లుచుండిరి. ఎట్లయిననేమి, బౌద్ధము దేశమున గూడుకట్టుకొని నిలఁబడిపోయినది. బ్రాహ్మణు లేక దానిని రూపుమాపుట వట్టి కలలోనివార్త అని జనులలో విశ్వాస మతిశయించెను. ఆనాఁటి కానాఁడు బౌద్ధమతావలంబుల సంఖ్య యధికమగుచుండెను. కంటికి కానరాని మార్పది. మార్పు జరగుచున్నదని తెలియని మార్పది. భారతీయసంఘమును, బ్రాహ్మణ సంప్రదాయములును క్రమముగా పరివర్తనశీలము లయినవి. అద్భుతమైన ప్రశాంత విప్లవమే యది.



# రాజగృహము

గిరివ్రజపురము!—ఎంత ముచ్చటయిన పేరు! పేరుకు తగిన పట్టణ మది. చుట్టనున్న వైహారగిరి, వరాహగిరి, వృష గిరి, ఋషిగిరి, చైత్యకగిరి అను నైదుపర్వతములు ఆ నగర మునకు పెట్టని కోటగోడలవలె నొప్పారుచు, దానిని సంగ ర్షించుచుండెను. ఈ కారణముననే కాంబోలు నా నగర మునకు గిరివ్రజమని పేరు కలిగినది. పూర్వోక్తము లయిన యిదుపర్వతములు నేడు వైభార, విపుల, రత్న, ఉదయ, శోణగిరి నామాంచితములయి చూపఱకు ప్రాచీనగాథలను స్మరణకుఁ దెచ్చుచుండెను. రాగరంజితములయిన సంజవేళల పుష్పసుగంధభారాలసములయిన పిల్లతెమ్మెరలతో సమాన ముగ నాటలాడుచు, గిరికుమారుల యుపలాలనములకుఁ జొక్కుచు తపోదాస్రవంతి ఆ నగరోపాంతభూమిని తన చిన్నినడల కొయ్యారము దిద్దుకొనుచు మందమందముగ నడయాడుచుండును. మహాభారతకాలమునుండి ప్రసిద్ధివహిం చిన పట్టణ మది. జరాసంధుడు శత్రుభయంకరముగ రాజ్య మేలినది ఇచ్చటనేనఁట. పాండుకుమారులయిన భీమార్జునులు కృష్ణునితో నేతెంచి జరాసంధునిఁ బొలివుచ్చినదియు నిచ్చటే నఁట. తూర్పుద్వారముననుండి గిరివ్రజమునఁ బ్రవేశించుటకు ముందు వారు మార్గాయాసము సహనయించుకొనుటకు ఇంచుక విశ్రమించిన గిరికే పాండవగిరియని పేరు కలిగినదని

చెప్పెదను నా ప్రాంతీయము లిప్పటికి దానిని పఠింపలేకుఁ జూపు చుందును.

భారతవర్ష చారిత్రమున మహాభారత కాలము నుండియు ఆ నగరరాజము తన ప్రాముఖ్యమును గోలుపోక ముఖ్య స్థానమును వహించి యశోమహిత మగుచుండెను. గిరి వ్రజమే కాలాంతరమున రాజగృహమను నూతన నామ మును ధరించి, శైశునాగవంశజుల కాలమున మగధ రాజ్య మునకు రాజధానియై, ఆ రాజ్యమునందలి నగరము లన్నిట మణిపూసయై ప్రకాశించినది.

జైన, బౌద్ధమతములు రెంటికిని రాజగృహము పుణ్య క్షేత్రము. మహాక్షేత్రమని మహావీరశిష్యులయిన ఏకాదశ గణధరులు నిచటనే భౌతిక కాయమును పరిత్యజించి నిర్వాణ పదమును బడసిరి. రాజగృహమును వశపఱచుకొనుటకు జైన బౌద్ధములు రెండును హింసావిరహితములయిన ద్వంద్వ యుద్ధము నాచరించినవి. శైశునాగవంశజుఁడయిన బింబి సారుఁడు జైనమతము నవలంబించి తన్మతమునెడల నే విశే షముగ అభిమానాదరములు చూపినను అతని కొమారుఁడు అజాతశత్రువు చల్లని యమృతవర్షోవృష్టిఁ గురిసి పితృ హత్యాసంజనితమయిన తన హృదయసంతాపమును బోఁగొట్టి తనకు నిర్వాణమార్గమును బోధించినవాఁడగుటచేత బుద్ధ భగవానునియెడ భక్తితాత్పర్యము లెక్కువగ కుదిరి ఆ మహాపురుషుని సేవించుటయేకాక, ఆ మహానీయమూర్తి నిర్వాణానంతరమునను ఆయన శారీరకధాతుసంపదఁ గొంత

ముతో వివిధకార్యనియుక్తులై పనిచేయుచుండిరి. వింతవింతల చవికెలతోను, చలిపందిరులతోను, తోరణములతోను రాజగృహము కలకలలాడుచుండెను. అజాతశత్రు మహారాజ నియోగమున రాజగృహమునందలి గుహావనారామము లన్నిఁటిని దూరదేశాగతులయిన బౌద్ధభిక్షువుల విడిదుల కొఱకు చక్కఁజేయుచుండిరి. బుద్ధుని నిర్వాణానంతరము బౌద్ధసంఘ మంతయు నొక్కచోట సమావేశమగుట కిదియే మొదటి తడవ.

వివిధరాజ్యములనుండి వచ్చు బౌద్ధభిక్షువుల సంఖ్య ఆదినమున కాదినము అధికమగుచుండెను. మట్టమధ్యాహ్న మగుసరికి రాజగృహ వీథులయందెచ్చటఁ జూచినను భిక్షాటనమునకై వచ్చిన ముండితశిరస్కులవారే! ఎచ్చట తిలకించినను భిక్షాపాత్రములవారే! రాజగృహ నగరమునకు వెలుపలనున్న గిరికందరములును, వనారామములును, తపోదాతరంగిణీతీరమును బౌద్ధ స్త్రీ, పురుష భిక్షుకులతో కిటకిట లాడుచుండెను. మూర్తిని గైకొన్న బౌద్ధధర్మమునలె కాన్పించిన దా బౌద్ధ పరివ్రాజకప్రజ.

ఎవరనుకొన్నారు బౌద్ధధర్మ మింత స్వల్పకాలములో జనహితమయి సంఘమున కింతమంది భిక్షువుల నాకర్షించునని ? సమ్యక్సంబోధి నొందిన యా బుద్ధుఁడే యెఱుఁగఁడు తనధర్మ మింత జనహితముగ నుండునని; ప్రజలు దాని నింతయాదరింతురని. దుఃఖమయమయిన ప్రపంచమున దుఃఖ సంతాపశమమార్గము నుపదేశించి బుద్ధుఁడు ప్రజల నుద్ధరిం

చుటకు పూనుకొనెను. కాని తా నొక ప్రత్యేకమతమును గనిపెట్టవలయునని యాతఁ డెన్నఁడు నాశించియుండలేదు. అతఁడు బ్రాహ్మణుల వేదమతమును సంపూర్తిగ ఖండింపవలెననికూడ ప్రయత్నింపలేదు. బ్రాహ్మణుల యవినీతిప్రవర్తనమును గర్హించెను; వారి దుర్గుణములను మాత్రమే ఖండించెను; యజ్ఞయాగాదులయందు మితిమీఱిపోయిన జంతుహింసను మాత్రమే నిరసించెను. బ్రాహ్మణుల వేదమతమునందలి కర్మవాదమును తిరస్కరింపలేదు; జన్మాంతరములను కాదనలేదు. అత్యంత ప్రాముఖ్యము నొసంగి బ్రాహ్మణులు తమ సత్కృత్యములకు, అసత్కృత్యములకుఁ గూడ వేదమును ప్రమాణముగఁ జూపుటచేత తత్ప్రామాణ్యమును నిరసించి వేదములు పౌరుషేయములని వాదించెను. దేవతలు కాని, స్వర్గాదిలోకములు కాని దబ్బరయని వక్కాణింపలేదు; కాని వాని విషయమున నిదమిత్థమని నిర్ణయింపక తూష్ణీంభావమును వహించెను. ప్రజలలోని మూఢవిశ్వాసములను, మూఢాచారములను తెగడుచు వచ్చినను వాటిని బోఁగొట్టుటకు ఎక్కువగఁ బ్రయత్నింపలేదు. అన్నిటికన్న మిన్నగ బుద్ధుఁడు లోకులకు తన ధర్మమునే యుద్బోధించెను. అతఁడు తానుకూడ వర్ణాశ్రమవిభక్తమయిన భారతీయసంఘమునందలి వ్యక్తినని గుర్తించికొనియే ప్రవర్తించెను. వేదమత మను పేరుతో జరగుచుండిన యత్యాచారములనుమాత్రమే ఖండించెను. వేదమతమును సంస్కరింపవలెననియే కాని యాతనికి ఆమతమునకు

విరుద్ధముగ నొక నూతనమతమును నెలకొల్పవలెనను సంకల్ప మేమాత్రము లేదు.

సత్య మరసినచో బుద్ధునివలెనే మతసంస్థాపనము నపేక్షించి ప్రజాప్రబోధము సేయుచువచ్చిన పరివ్రాజకు లానాఁడు అనేకు లుండిరి. ఒక్కొక్క పరివ్రాజకుఁడు తన ధర్మమును బోధించి, కొందఱు కొందఱు శిష్యులను జేర్చుచు వచ్చెను. ఇట్లే వేఱు వేఱు సంప్రదాయము లాకాలమునఁ బొడసూపినవి. ఇట్టి పరివ్రాజక పంథలు గణము లనుపేరఁ బరగుచుండెను. ఆకాలమున మొలకెత్తిన గణముల కన్నిటికిని గృహస్థాశ్రమ పరిత్యాగమును, సన్న్యాసస్వీకారమును ప్రధానలక్షణములు. ఏగణములయందలివారయినను సన్న్యాసులకు యతులని, పరివ్రాజకులని, శ్రమణులని వ్యవహార ముండెను. ఒక్కయాచార్యుని శిష్యులే వేఱు వేఱు గణములుగ నేర్పడుచుండిరి. ఏగణమున కాగణమే యేకీభావవిరహితముగు ప్రవర్తించుచు వచ్చెను. బుద్ధుఁడుమాత్ర మిట్టి ప్రత్యేకతను నిరసించి తనసంఘమున కైకమత్యమును బోధించెను. ఎవరు దీక్షాస్వీకారము చేయఁదలఁచినను అన్ని గణములయందు వలెనే బౌద్ధసంఘమునందును బ్రహ్మచర్య నిర్వహణము ఆవశ్యకధర్మ మయినది.

మృగదావమున నాయేవురు తాపసులును దనధర్మము నంగీకరించి శిష్యులయిననాఁడుకూడ తన శిష్యమండలి యింతగ వృద్ధిచెందునని బుద్ధుఁ డూహసేయలేదు ; కాని తన ధర్మమే తారకమంత్రమని, యదియే పరమ సత్యమని

గాఢముగ విశ్వసించినవాఁడగుటచేత ఆ కరుణామయుఁడు లోకులకు దానిని బోధించి దుఃఖపంకిలమునుండి వారి నుద్ధరింప దీక్షఁగొని పట్టణములయందును పల్లెలయందును బర్యటనము సేయ మొదలిడెను. మొదటిదినములలో బౌద్ధదీక్ష గ్రహించి సంఘమునఁ జేరిన భిక్షుకు లంత యెక్కుడుమంది లేక పోయినను వర్ణాశ్రమ పరిపాలనము సేయుచు బౌద్ధధర్మము నుపాసించు నుపాసకు లధికసంఖ్యాకులయిరి.

శిశిరఋతువునందు రాజగృహమున సారిపుత్ర, మహామౌద్గల్యాయనులకు దీక్ష నిచ్చి బుద్ధుఁడు ధర్మబోధ సేయుచు రాజగృహమునందలి వేణువనారామమున నివసించుచుండిన తరి శుద్ధోదనునియొద్దనుండి కపిలవస్తునగరమున కొక్కమాఱు రావలసినదని వర్తమానము వచ్చెను. బుద్ధుఁడు కతిపయప్రయాణముల కపిలవస్తునగరమున కరిగి బోధచేసిన పిదప శుద్ధోదనుఁడును, తక్కుంగల రాజబంధువు లనేకులును ఉపాసకులుగఁ గొందఱును, దీక్షఁ గైకొని కొందఱును బౌద్ధధర్మము నాశ్రయించిరి. మహాప్రజాపతి గౌతమియు ఉపాసికయై త్రిరత్నములను శరణు వేఁడినది. స్త్రీ లుపాసికలుగఁ జేరుటకు మృగదావనము బుద్ధుఁడు మొదటిమాఱు ధర్మచక్రప్రవర్తనము చేసినప్పటినుండియే మొదలు. కాని భిక్షుకులగుటకు మాత్ర మింకను కొంతకాలము పట్టెను.

బుద్ధుఁడు సమ్యక్సంబోధి నొంది యైదు సంవత్సరములు గడచిన మీఁదట, ఆ మహాత్ముఁడు న్యగ్రోధవనారామమున నుండినకాలమున దుఃఖనివృత్తి చేసికొని సంసారము

తరింప పూన్కి వహించి మహాప్రజాపతి గౌతమి శుద్ధోదన మరణానంతరమున దీక్షాసూచకముగ శిరోజములను ఛేదించి వైచి త్రిచీవరములను ధరించి తన మార్గమునే యవలంబించిన తన బంధువురాండ్రగు శాక్యస్త్రీలు కొందఱను వెంట నిడికొని, దూర మనక, భార మనక ప్రయాణకష్టముల కోర్చి వెళ్ళి ఆ పుణ్యపురుషుని దర్శనముచేసి పరివ్రాజక జీవితఫలములను రుచిచూడ నభిలషించియున్న తమకు దీక్ష ననుగ్రహించి సంఘమునఁ జేరుట కనుజ్ఞ నొసంగవలసినదని వేఁడుకొనెను. ఇట్లొక్కమాఱుకాక ముమ్మాఱు అర్థించినను ప్రయోజనముఁ గానక ప్రజాపతి గౌతమి శోకవిహ్వలచిత్తయై మఱలిపోయెను. అంతమాత్రమున పట్టుదల విడువక మఱల నామె తన యనుచరులతో బుద్ధుఁడు వైశాలియం దుండ నాతని సందర్శనార్థ మరుదెంచెను. వచ్చినపిదప ముందుగఁ గలసికొన్న యానందస్థవిరునికి ఆమె తన యుదంతమును విన్నవించెను. ఆనందుఁడు ఆమెయొక్కయు, తక్కటివారియొక్కయు అభినివేశమునకును, ధర్మాభిరతికిని సంతసించి, బుద్ధునికడ కరిగి వారి రాకయు, కోర్కెయు నెఱింగించెను. ఎప్పటి వలెనే బుద్ధుఁడు వారి కోర్కె నిరాకరించెను. కాని ఆనందుఁడు వారి హృదయావేదనను, దుఃఖాతిశయము నెఱిఁగినవాఁడగుటచేత వారిపక్షమున వాదించి తుద కెట్లయిననేమి బుద్ధుఁడు వారి కోర్కె కంగీకరించునట్లు చేసెను. ఈ రీతిని మహాప్రజాపతి గౌతమి బౌద్ధసంఘమున స్త్రీలు భిక్షుకులుగఁ జేరుటకు కారణభూతురాలయి స్త్రీజనవంద్య యయినది. కాని యువజనుల విషయమున నెట్లో యట్లే అవివాహిత

లయిన కన్యల విషయమున తలిదండ్రుల యనుమతియు, వివాహితలవిషయమున భర్తల యనుమతియు నావశ్యక మని బుద్ధుఁ డనుశాసించెను. మహాప్రజాపతి సంఘమునఁ జేరిననాఁటినుండి స్త్రీలుకూడ పరివ్రాజకలయి దీక్ష గైకొని ధర్మప్రచారము కావించుచువచ్చిరి.

తన నిర్వాణమునకు పూర్వమే బౌద్ధసంఘ మీవిధమున స్త్రీ, పురుష భిక్షుకులతో పొంగుచున్నను నియమ, నిబంధనముల నేర్పఱిచి దానిని సరిదిద్దవలెనని బుద్ధుఁ డెన్నఁడు తలంపఁడయ్యెను. నూతనసంఘనిర్మాణము కాని, నూతనమతసంస్థాపనము కాని యాతని లక్ష్యమున నుండలేదు. ప్రజలను తరింపఁజేయు ధర్మబోధకుఁడుగ నుండనే యభిలషించెను కాని యాతఁ డాచార్యపదమునకుఁగూడ నాశింపలేదు. ఈ కారణముననే యతఁడు నిర్వాణసమయమునను ధర్మబోధయందే ప్రవృత్తుఁడయియుండెను కాని బౌద్ధధర్మపీఠమునకుఁ దనయనంతరమాచార్యస్వామినిగూడనిర్ణయించి యుండలేదు.

అప్పటికి బుద్ధుఁడు నిర్వాణమునొంది ఏఁడుమాసము లయినది. బౌద్ధసంఘ మనాయకముగను, అసమయప్రతిపాలితముగను నుండెను. పెరిఁగిపోవుచుండిన బౌద్ధసంఘమును సరియైన పద్ధతులయందు నడపుటకు ఆచార సమయముల నేర్పఱచుటయు, బుద్ధప్రోక్తమయిన ధర్మవచనమును గ్రంథస్థము కావించి భద్రపఱచుటయు బౌద్ధసంఘమునందలి థేరుల (వృద్ధుల)పైఁ బడినది. ఏతత్కార్యాచరణమునిమిత్తము వారు అజాతశత్రుని యానగరమున ప్రథమసంగీతి (బౌద్ధాచార

సమయ, ధర్మనిర్ణయసభ) జరపుటకు నిశ్చయించిరి. ఈకారణముననే బౌద్ధభిక్షువు లనేకులు రాజగృహమున కరుదెంచుచుండిరి. రాజర్షియయిన బుద్ధుని ధర్మము నవలంబించిన పరివ్రాజకుల నెల్లరను ఒక్క సామాన్యాచార నియమములచేత నిబంధించి, వారిని బలీయమయిన యొక మతసంఘముగ తీర్చి దిద్దవలసినపని రాజగృహముననే జరుగుట విచిత్రము కదా! *



* ఈ ప్రకరణములు ఇంకను పూర్తి కావలసియున్న బౌద్ధమత వ్యాపన కథాకల్లోలినిలోనివి. రాజగృహమున జరిగినది ప్రథమ సంగీతి. ద్వితీయ సంగీతి వైశాలియందు జరిగినది. ఈ రెండు సంగీతుల యనంతరము బౌద్ధసంఘమున అనేకవిభేదములు కలిగినవి. ఈ కారణమున నది ప్రధానముగ థేరులు, మహాసాంఘికులు అని రెండుపక్షము లయినది. థేరులు వృద్ధులు, పూర్వాచారపరాయణులు ; మహాసాంఘికులు ఆచార నియమముల నంత కఠినముగఁ బాలించువారు కారు. కాలక్రమమున బౌద్ధమతమున ఎన్నియో మార్పులు వచ్చినవి—బౌద్ధమతాచారతత్త్వములను గూర్చిన వాదములు కారణముగాఁ గలిగిన మార్పులు. ఆచార, తత్త్వ విభేదములకతన నాగార్జునాచార్యులవారికిఁ బిదప బౌద్ధ మెన్నో రూపాంతరములను పొందినది.

# అమరావతీ స్తూపము

స్తూపమను సంస్కృతపదమును, దిబ్బయని యర్థ మిచ్చు 'థూపో' యను పాలీపదమును సమానార్థకములు. కాని బౌద్ధనిర్మాణవాస్తువున (Buddhist architecture) ఇటికెలతోనో, రాతితోనో కట్టిన అర్ధగోళాకారముగనుండు సమాధి వంటి ఘననిర్మాణమునకే స్తూపమను పేరు రూఢియగుట వలన, దిబ్బయైన దెల్ల స్తూపము కాజాలదు. ఈ నిర్మాణము బౌద్ధమతము వాస్తువునకుఁ బ్రసాదించిన విశేషము. స్తూప ప్రాముఖ్యమును దెలిసికొనుటకు బుద్ధుని జీవితము కొంత తోడ్పడఁగలదు.

శాక్యవంశజుఁడయిన శుద్ధోదనుఁడు కపిలవస్తునగరము రాజధానిగ శాక్యరాజ్యమును పాలించుచుండెను. అతని పట్ట మహిషియైన మాయాదేవి యొకప్పుడు, బోధిసత్వుఁడు తుషితస్వర్గమునుండి తెల్ల యేనుఁగు రూపమున భూలోక మున కవతరించి తనగర్భమునఁ బ్రవేశించినట్లు స్వప్నముఁ గాంచెను. అనతికాలముననే ఆమె గర్భవతియై, కపిలవస్తు నగరమునకు చేరువనున్న దేవదహగ్రామమునందలి తన పుట్టినింటి కరుగుచు, మార్గమధ్యమునఁగల లుంబినీవనమున నొప్పులు వచ్చి మగపిల్లవానిం గని, పురుడు వెళ్ళకమునుపే కాలధర్మము నొందెను. సిద్ధార్థుఁడని నామకరణముచేసి శుద్ధోదనుఁ డా బాలుని అఱచేతి చందమామవలె నల్లారు

ముద్దుగఁ బెంచి యుక్తవయస్సున యశోధర యను సౌందర్య రాశి నొసంగి పరిణయముఁ గావించెను. ఈ యువదంపతుల ప్రేమఫలముగ రాహులుఁడను కుమారుఁ డుదయించెను. కాని దుఃఖమయమయిన యీ ప్రపంచమును జూచి కోమల హృదయముగల సిద్ధార్థుఁడు తీవ్రవేదన నొంది శాంతిఁ గానక తుదకు దుఃఖనివర్తనమార్గము నన్వేషింప ఆలుబిడ్డలను, కన్నతండ్రిని, కడకు రాజ్యసర్వస్వమును—సర్వమును పరిత్యజించి కపిలవస్తు నగరమునుండి యెరు లెఱుంగకుండ నర్ధ రాత్రమున బయలుదేఱిపోయెను. బౌద్ధులు దీనిని మహాభినిష్క్రమణ మందురు. నగరవినిర్గతుఁడయి యాతఁడు మహారణ్యముల కరిగి యేడేండ్లపాటు ధ్యానసమాధినిష్ఠనుండి ఏకాగ్రతతో తపస్సుచేసెను. ఈ కాలమున బౌద్ధులకు శనివంటి వాఁడయిన మారుఁడు సిద్ధార్థుని ఏకాగ్రబుద్ధిని చలింపఁజేసి యాతని తపస్సు భగ్నముచేయ ననేకవిధములఁ బ్రయత్నించెను. కాని విఫలమనోరథుఁడయ్యెను. తుదకు సిద్ధార్థుఁడు బుద్ధగయ సమీపమునందలి యురువెలాపరిసరారణ్యమునఁ నొక యశ్వత్థవృక్షముక్రింద తీవ్రధ్యానసమాధినుండి పరమసత్య ప్రబోధమును గాంచెను. అంతటినుండి యాతఁడు బుద్ధుఁడనియు, నా వృక్షము బోధివృక్షమనియు ప్రసిద్ధికెక్కెను. బుద్ధుఁడు మున్ముందుగ సారనాథని నేఁడు వ్యవహరింపఁబడు మృగదావమున కరిగి మొట్టమొదటిమాఱు తాను కనిపెట్టిన ధర్మమును లోకమునఁ బ్రవర్తింపఁజేసెను. బుద్ధుని యీ మొదటి ధర్మబోధకు ధర్మచక్రప్రవర్తనమని పేరు. బుద్ధుని ధర్మబోధల ననుసరించువారు రెండు తెఱఁగులు: (౧) సన్యా

సులు – వీరిని భిక్షువు లందురు. స్త్రీలకుకూడ భిక్షుకులై బౌద్ధధర్మావలంబనము చేయుట కధికార మొసఁగఁబడుటవలన బౌద్ధభిక్షు సంఘమున పురుషులతోపాటు స్త్రీలుకూడ నుండిరి; (౨) గృహస్థులయి బౌద్ధధర్మ మవలంబించువారి కుపాసకు లని పేరు. బుద్ధుఁడు చాలకాలము తన ధర్మమును లోకమునఁ బ్రవర్తింపఁజేసి యెనుబదివత్సరముల ప్రాయమున మల్లరాజ్యమునకు రాజధానియయిన కుశనగరమున (పాలి : కుసినార) వ్యాధిగ్రస్తుఁడయి యచ్చటి సాలవనమున నిర్వాణము నందెను. బౌద్ధులు దీనిని మహాపరినిర్వాణ మందురు. కుశనగరమునకు వెలుపలనున్న మకుటచందన మనుచోట బుద్ధుని శరీరమునకు దహనసంస్కారము కావింపఁబడెను. దహనానంతరమున బుద్ధభగవానుని మిగిలిన శరీరావశేషముల కొఱకరుగు పొరుగు ప్రభువులకును మల్లులకును వివాదము కలిగెను; కాని ద్రోణుఁడను బ్రాహ్మణుఁడీ కలహ ముడిపి దగ్ధావశేషముల నందఱికి సమానముగఁ బంచి యిచ్చి వారికి సమాధానముఁ గావించెను. ఆయవశేషముల నాయా ప్రభువులు తమ దేశములకుఁ గొనిపోయి వానిని దగిన స్థలముల భద్రపఱిచి వానిమీఁద స్తూపములను నిర్మించిరి. ఇట్టి శారీరక స్తూపములు మొదట నెనిమిది వెలసినవి.

సంగీతులు :

బుద్ధుని నిర్వాణము ననంతరము అతని ధర్మోపదేశములను (ధర్మసూత్రములను) గ్రంథస్థముచేయుటకు మొదటి మాఱు రాజగృహ మను నగరమున బౌద్ధసంఘ సమా

వేశము జరిగెను. బుద్ధధర్మాచార నిర్ణయమునకయిన యీ సమావేశమునకు 'సంగీతి' యని పేరు. ఈ 'సంగీతి' యనంతరము బౌద్ధసంఘమున వివాదములు కలిగినవి. కొందఱు 'వజ్జి' దేశీయులైన బౌద్ధులు భిక్షాభోజనాదులకు సంబంధించిన కొన్ని నియమముల విషయమున పూర్వాచారమును పాటింపక తద్విరుద్ధముగ నడచుచుండినందున ఏతదాచారోల్లంఘనమును గుఱించి విచారించుటకును, బౌద్ధసంఘ ఆచారనిర్ణయము చేయుటకును వైశాలియందు మఱల బౌద్ధసంగీతి జరిగినది. ఆచారకాండకు బౌద్ధుల పరిభాషను 'వినయ' మని పేరు. పైనిచెప్పిన ఈ రెండు సంగీతులందును బౌద్ధధర్మసూత్రములును (ధమ్మసుత్తము), బౌద్ధసంఘాచారవిధులును (వినయము) గ్రంథస్థములైనవి. ద్వితీయ సంగీతియందు పూర్వాచారము నించుకయుఁ దప్పకుండ నడచుకొను థేరులు (స్థవిరుల - వృద్ధుల)కంటె ఇతర సాంఘికులే అధికసంఖ్యాకులుగ నుండిరి; అయినను ఆచారనిర్ణయవిషయమునఁ దమ యభిప్రాయమును దెలుపు నధికారము ఇతర సాంఘికులకుఁ దొలఁగింపఁబడినందున 'వజ్జి' దేశ బౌద్ధులు ఆచార నియమోల్లంఘనముఁ గావించిరని థేరులు స్థిరపఱిచి విజయశంఖము నూఁదిరి. కాని యధికసంఖ్యాకులుగ నుండిన యితర సాంఘికులు ఆ నిర్ణయమునకు కట్టువడక తమ పద్ధతియే సరియైనదని వాదించి, థేరకక్షనుండి విడివడి, వేఱొక తెగగా నేర్పడిరి. ఈ తెగవారి కప్పటినుండి మహాసాంఘికులని పేరు.

బౌద్ధసంఘమున నిట్లు చీలిక కలుగుటకు కారణము 'దశవస్తువు'లని కొన్ని బౌద్ధగ్రంథములును, మహాదేవబౌద్ధాచార్యుఁడు 'అర్హతుని లక్షణము'లనుగూర్చి ప్రతిపాదించిన 'పంచసిద్ధాంతము'లని మఱికొన్నియు నుడువుచున్నవి. విడిపోయిన మహాసాంఘికులు 'ధర్మము'ను 'వినయ'మును (బౌద్ధవేదములగు త్రిపిటకములందలి మొదటి రెండు పిటకములు) స్వవాదానుసార మందందు సంస్కరించి 'థేరవాదము'నకు ప్రతిగా తమ వాదమునకు 'ఆచార్యవాద' మని పేరిడిరి.

ఈ చీలిక నతికించి సంఘమును కట్టుదిట్టపఱుచుట కొఱకు అశోకచక్రవర్తి పాటలీపుత్రమున మఱియొక సంగీతిని సమావేశపఱిచెను. దీనికి మౌద్గల్యపుత్రుఁడయిన తిష్యుఁడధ్యక్షుఁడు. బౌద్ధధర్మ ప్రవచనానంతరమున శిక్షాసూత్రార్థ సమన్వయమున థేరవాదులకును, మహాసాంఘికులకును ఏకీభావము కుదరలేదు. థేరవాదులు సభనుండి వెడలిపోవుట యే కాక తమకు మహాసాంఘికులతో సరిపడక మగధ దేశమును గూడ విడిచిపెట్టి కాశ్మీరాద్యుత్తర దేశముల కరిగి యచ్చటఁ దమ మతమును వ్యాపింపఁజేసిరి.

## బౌద్ధమతవ్యాప్తి :

తృతీయసంగీతి జరిగిన నాఁటినుండి పాటలీపుత్రము నందలి కుక్కుటారామము బౌద్ధధర్మపీఠమయి పేరుకెక్కినది. మగధయందు స్థానికముగ వర్ధిల్లుచుండిన బౌద్ధమతమును విశ్వపరివ్యాప్తము కావించి బుద్ధబోధామృతమును సంసారార్తులయిన ప్రజల కంధఱికి నందించి లోకమునందలి దుఃఖ

మును నివర్తింపఁజేయుట కశోకుఁడు పూనిక వహించెను. ఈ యుదారసంకల్పముతో అశోకచక్రవర్తి దేశదేశములకు బౌద్ధమత బోధకుల నంపెను.

చక్రవర్తియాజ్ఞ శిరసావహించి, దేశాంతరముల కరిగిన మతబోధకులు మాగధులకుఁ దెలియవచ్చినవారు వీరు: ౧. కాశ్మీర, గాంధారములకు 'మజ్ఝంతిక' భిక్షువు; ౨. మహిషమండలమునకు (ఆంధ్ర, మైసూరు దేశములకు) 'మహాదేవ' భిక్షువు (ఇతఁడు పాటలీపుత్రమునందలి మహాసాంఘికులకు నాయకుఁడు); ౩. 'వనవాసి'కి 'రక్షిత' భిక్షువు; ౪. 'అపరాంతక'మునకు 'ధర్మరక్షిత' భిక్షువు; ౫. 'మహారట్ఠము'నకు 'మహాధర్మ రక్షిత' భిక్షువు; ౬. 'యవనలోకము'నకు 'మహారక్షిత' భిక్షువు; ౭. 'హిమవంత పాదము'నకు 'మజ్ఝిమ' 'కస్సపులు'; ౮. 'సువణ్ణభూమి'కి 'సోణక', 'ఉత్తరులు'; ౯. 'తాంబపణ్ణి'కి 'మహింద' భిక్షువు.

బౌద్ధమతవ్యాపనమున కశోకచక్రవర్తి ప్రేమితుఁడై యాంధ్రదేశమున కరుదెంచిన మగధ మహాసాంఘికనాయకుఁడగు మహాదేవభిక్షువు కృష్ణానదీతీరస్థమయిన ధాన్యకటకమును నివాసభూమిగఁ జేసికొని చైత్యకవాద మనునొక సంప్రదాయమును స్థాపించెను. ఈ పంథకుఁ జైత్యకనికాయమనియు, దీనికిఁ జెందిన భిక్షువులకు చైత్యకులనియుఁ బేరు. ఈరీతిని మహాసాంఘికవాదమునకు సంబంధించిన బౌద్ధమత మశోకచక్రవర్తి యాదరణమున నంధ్రదేశమునందు వ్యాపించెను.

క్రీస్త్వబ్దమునకు పూర్వము ఆంధ్రదేశమునందలి యీ ధాన్యకటక ప్రాంతము బౌద్ధమతమునకు పంటపొలమయి, బౌద్ధులకుఁ బట్టుగొమ్మగనుండె ననుటకు సింహళద్వీపచరిత్రమే యాధారము. బౌద్ధవాఙ్మయమున 'తాంబపణ్ణి' యనఁబరగిన సింహళద్వీపమును క్రీస్త్వబ్దమునకు రెండువందల సంవత్సరములకుఁ బూర్వమున పాలించుచుండిన 'దుట్టగామణి' యను ప్రభువు అనూరాధపురమున 'మహాథూపము' (ర్వాన్ వెల్లి మహాస్తూపము)ను నిర్మించుచుండిన సందర్భమున హిందూదేశమునందలి వేఱువేఱు ప్రాంతములనుండి అర్హతులు, ఆచార్యులు వేలకొలఁది బౌద్ధసాంఘికులతో నచ్చటి కరిగిరఁట. ఇట్లు వెళ్ళినవారిలో అర్హతుఁడయిన మహాదేవుఁడొక్కఁడు. ఇతఁడు 'పల్లవభొగ్గ'మున*(పలనాడు)నుండి నాలుగులక్షల యిఱువది వేల బౌద్ధభిక్షువులను వెంటనిడుకొని వెళ్ళెనఁట. భిక్షువుల సంఖ్య యతిశయోక్తియని త్రోసివేసినను, 'పల్లవభొగ్గ'మున బౌద్ధమత మత్యంతాభివృద్ధినొందుచుండెనని యూహించుట సమంజసము కాకపోదు.

---

* 'భోగ' ('భొగ్గ') పదము 'మహేంద్రభోగము', 'కవచకారభోగము', 'హామనిభోగము' అని ప్రాచీనశాసనములందు దేశవిభాగపరముగ వాడుక చేయఁబడినందున, 'పల్లవభొగ్గ' (పల్లవభోగ) మనునది పల్లవనాడనవచ్చును. దేశవిభాగ మనునర్థమున 'భోగ' పదమునకు బదులు దేశ, విషయ, నాడు పదములు ప్రాచీనశాసనములందుఁ బ్రయుక్తములగుటవలన 'పల్లవభొగ్గ'ము ఇప్పటి పలనాడు, ('పల్లవవిషయము', 'పల్లవనాడు') అని నిర్ణయింపఁదగును. పల్లవనాడును, ధాన్యకటక ప్రాంతమును ప్రాచీనకాలమున పల్లవులు పాలించిరని శాసనములవలనను, గాథలవలననుగూడఁ దెలియుచున్నది. త్రిలోచనపల్ల

అశోక చక్రవర్తి యనంతరము మగధను పరిపాలిం చిన 'కునాల', 'దశరథు'ల వెనుక 'సంప్రతి' రాజ్యమునకు వచ్చి క్రీ. పూ. ౨౨౦ మొదలు ౨౧౧ వఱకు పరిపాలించెను. అశోకచక్రవర్తికి బౌద్ధమత మనిన నెంతటి యభినివేశ ముండెనో యీతనికి జైనమత మనిన నంతటి యభిమాన ముండెను. అశోకునివలెనే యీతఁడును ఆంధ్ర, ద్రమిళ దేశ ములకు మత బోధకుల నంపి, జైనమతమును వ్యాపింపఁజేసె నని హేమచంద్రుని 'పరిశిష్ట పర్వము' ననుసరించి తెలియు చున్నది. సంప్రతిప్రయత్నములవలన జైనమత మంధ్రదేశ మున బాగుగ వ్యాపించినను వ్యాపింపకపోయినను మహా దేవాచార్యుఁడు తలపెట్టిన బౌద్ధమత వ్యాపనప్రయత్నము లకుఁ గొంత యాటంకము కలిగినఁ గలిగియుండును. అయినను

---

వునికి ధాన్యకటక మెంకప్పుడు రాజధానిగ నుండినట్లు గాథలు కలవు. కాంచీపురము రాజధానిగ పరిపాలనము నెఱపిన పల్లవులు ధాన్యకటక మునఁ దమ ప్రతినిధులను నిలిపి ఆంధ్రాపథమును పాలించినట్లు శాసన ములు తెలుపుచున్నవి. క్రీస్తుశక మాఱవశతాబ్దిని విష్ణుకుండి వంశజుల విజృంభణము ననంతరమునఁ గాని పల్లవులు కృష్ణానదీతీరమును విడిచి ఇంకను దక్షిణదిశకు సాగియుండలేదు. స్వతంత్రరాజ్యమును స్థాపించు టకు పూర్వముకూడ ఆంధ్రరాజు లయిన సాతవాహనులకు సామంతు లును, సైన్యాధిపతులు నయి, పల్లవులు ప్రాముఖ్యము గడించి బౌద్ధ గ్రంథములందు నాగదేశమని ప్రసిద్ధమయిన యీ ప్రాంతమునందలి వారితో సంబంధబాంధవ్యములు నెఱపి వర్ధిల్లుచుండిరి. పల్లవులకు జన్మ స్థలముగఁ గాకపోయినను వారికిఁ గల యితర సంబంధాధిక్యమువలన 'పల్లవభోగ్గము' (పలనాడు) అను పేరఁ బరగిన యీ కృష్ణా దక్షిణ తీర ప్రాంతము క్రీస్త్వబ్దమునకుఁ బూర్వమునఁగూడ బౌద్ధమతమునకు 'చేవ పట్టు'గ నుండెనని నిరూఢ మగుచున్నది.

శాతవాహనకాలమున తెలుగు దేశమున బౌద్ధము సర్వ జనాదరణీయమయిన మతమయి వర్ధిల్లెననుటకు ఆంధ్ర దేశమునందు, ముఖ్యముగ కృష్ణా గుంటూరు మండలములందుఁ గానవచ్చిన, కానవచ్చుచున్న బౌద్ధస్తూపాదికములే తార్కాణము.

## స్తూ ప ము :

శారీరక స్తూపములకు ధాతుచైత్యములనియుఁ బేరు. ధాతువు లనఁబడు నవశేషము లుండుభాగమునకు ధాతుగర్భమని పేరు. ధాతుగర్భపదమునకు భ్రష్టరూపము డాగబ (డాగోబా). 'ధాతుగర్భము' మీఁది దిబ్బకు స్తూపమని పేరయినను కాలక్రమమున నీ రెండుభాగములు కలిసిన సంపూర్ణ నిర్మాణమునకే స్తూపమను పేరు రూఢియయినది. బుద్ధులు, ప్రత్యేక బుద్ధులు, అర్హతులు, చక్రవర్తులు మాత్రమే స్తూపగౌరవమున కర్హులని బౌద్ధుల మహాపరినిర్వాణసూత్రమునఁ దెలుపఁబడినను విఖ్యాతులయిన బౌద్ధాచార్యులకును స్తూపములు వెలసినవి. శారీరకధాతువులను మాత్రమే కాక పరిభోగికధాతువులను, అనఁగా బుద్ధుఁడు కాని, అర్హతులు కాని, చక్రవర్తులు కాని, ఆచార్యులు కాని యుపయోగించిన భిక్షాపాత్రములు, చేతికఱ్ఱలు, పానపాత్రములు—ఇట్టివానినిగూడ పదిలపఱచి స్తూపములు నిర్మించుట వాడుకయయినది. కాలక్రమమున బుద్ధునితో సంబంధముగల పవిత్రక్షేత్రములందు ధాతురహితముగనే, వట్టి స్మారకచిహ్నములుగఁగూడ స్తూపములు వెలయుచువచ్చినవి. స్తూపములకు సింహళమున 'డాగబ'

(దాగోబా) లనియు, నేపాళదేశమున 'చైత్యము' లనియు, బర్మాదేశమున 'పెగోడా'లనియు వ్యావహారికనామము చెల్లు చున్నది. బౌద్ధయుగమున స్తూపమున కీ రీతిని ప్రాముఖ్యము కలిగెను.

బౌద్ధకళయందు బుద్ధుని మహాపరినిర్వాణమునకు స్తూపమును, జననమునకు పద్మమును, మహాబోధికి (పర్యాయసత్య ప్రబోధమునకు) బోధివృక్షమును, మృగదావమునందలి బుద్ధుని మొదటి ధర్మబోధమునకు ధర్మచక్రమును సంకేతములయి బౌద్ధశిల్పమునం జిత్రితములయినవి. బౌద్ధయుగమున స్తూపము బుద్ధభగవత్ప్రీత్యర్థముగ సమర్పించు నొక కానుకయై, తన్నిర్మాణము బౌద్ధధర్మావలంబకులకు పుణ్యప్రదమయిన ధర్మకార్యమయినది.

అలంకారపరిశోభితములయి కనులు కోరగించునట్టి దివ్యసుందర విగ్రహములు, చూడ ముచ్చటయయిన కట్టపని, హృదయరంజకముగం జేతితో వ్రాసిన చిత్రములు మొదలయిన కళావిదగ్ధములగు కృతు లున్న చోటికి పోరాదని బౌద్ధులకు బుద్ధుని యాదేశ మున్నను వారి నిష్కళంక హృదయములు సంసారదుఃఖము నంతరింపంజేయు నవతరించిన ప్రేమావధి బుద్ధభగవానుని యెడల భక్తిరస ప్రపూర్ణములయి, వారి నారాధకులుగ దిద్దినవి. ఈరీతిని కాలక్రమమున భక్తిరహితమయిన మతమున భక్తియు, ఆరాధనరహితమయిన మతమున ఆరాధనమును మొలకెత్తి, అట్టి యాదేశము నొసంగిన బుద్ధభగవానునిచుట్టునే కళా

నిధానములయిన మనోహర శిల్పకావ్యము లెన్నియో విసిచితములై ఆదిమబౌద్ధము స్వరూప, స్వభావములనే సంపూర్ణముగ మార్చివై చెను.

భక్తులయిన బౌద్ధశిల్పుల సిద్ధహస్తముల స్తూపనిర్మాణ మొకకళమై క్రమపరిణామము నొంది వన్నెయు, వాసియుఁ గాంచెను. ఇందువలన స్తూపములలో అతిపురాతనములైన వానికిని, అటుతరువాత వెలసినవానికిని రూపకల్పనము నందును, నిర్మాణశిల్పమునందును గొంత పరిణామముండుట చేత కొన్నికొన్ని వ్యత్యాసములు కాన్పించును. ప్రజలకు బుద్ధభగవానునియెడల భక్తిగౌరవములును, మతవిషయక మగు ప్రబోధమును కలిగించుటకు బౌద్ధశిల్పులు బుద్ధజీవిత కథలను, బౌద్ధగాథలను స్తూపపుటాల మీఁద చిత్రించు చుండిరి.

బౌద్ధగాథలు మొదట చాల పరిమితముగ నేయుండినను క్రమముగ నవి యసంఖ్యముగఁ బెరిఁగినవి. వీనిలో ఈ జన్మమున బుద్ధుఁడయి నిర్వాణపదవి నొందిన బోధిసత్త్వుఁడు దయ, అహింస, ప్రేమలకు లక్ష్యముగఁ గడపిన పూర్వ జన్మములకు సంబంధించిన వృత్తాంతములగు జాతక కథలు ప్రజారంజకములయినవి. ప్రపంచ కథావాఙ్మయమునందెల్ల ఈ జాతకకథావళి కడుంగడు ప్రాచీనమయినదనియే కాక, యూరోపీయ ప్రాచీన కథావాఙ్మయమునందలి చాలకథల కాకరము లిందే కలవని భారతీయులే కాక, ప్రాచ్యపరిశోధక పండితులగు విదేశీయులుకూడ అంగీకరించియున్నారు.

మొట్టమొదట, బౌద్ధకళయారంభదశలో శిల్పములు బుద్ధుని చిత్రింపవలసివచ్చినప్పుడు భౌతికమానవిధేయము లయిన నామరూపములను విడిచి యాసాధువతంసము నిర్వాణము నొందెనని తెలుపుటకు గుర్తుగ నచ్చటి స్థలమును శూన్యముగ నుంచువారు. చిత్రాభావమే బుద్ధభావమునకు చిహ్నముగ నుండెను. కాలము గడచినకొలఁది, మొదట నీ స్థలమున బుద్ధుని (శ్రీ) పాదములును, పిదప రూపమును చిత్రితములయినవి. బౌద్ధస్తూప మీ విధమయిన శిల్పసంపదతో పరిఢవిల్లుచు, కళానిధానమయి కనులకు విందొనరించుచుండెడిది. సిద్ధహస్తులయిన శిల్పులు తమ బుద్ధిని ప్రజ్ఞను సమస్తము భగవదర్పితముఁ గావించి కళారూపముననే భగవానుని ఉపాసించుచుండిరి.

## అమరావతీ స్తూపము :

భక్తులయిన యంధ్రదేశకళోపాసకులు బుద్ధభగవానుని పాదపీఠిని కానుకగా సమర్పించిన పూజాకుసుమములలో అమరావతీస్తూప మొకటి. ఇది కృష్ణానదీతీరమున, ఆనది ముఖద్వారమునకు రమారమి యఱువదిమైళ్ళ - కెగువను, ప్రాచీనాంధ్ర రాజధానీనగరమయిన ధాన్యకటకమను నిప్పటి ధరణికోటకు తూర్పున నఱమైలుదూరమున నున్నది. ఇది యిప్పటి అమరావతి గ్రామమునకు చెంతనుండుటచే అమరావతీస్తూపమని దీనికిఁ బేరు కలిగినది. క్రీస్త్వారంభశతాబ్దులలో ధనకటకమని, ధాన్యాకరమని నామాంతరములుగల ధాన్యకటకనగరము దక్షిణాపథమునందలి నగరములలోనెల్ల సుప్ర

తంసమై ప్రఖ్యాతిఁ గాంచుటవలన నిది ధాన్యకటక చైత్య మనియు, బౌద్ధసంఘము నివసించుట కనువయినవిహారములు మొదలగున వనేకము లిచట నుండుటచేత ధాన్యకటక సంఘారామ మనియు బౌద్ధవాఙ్మయమున నిది ప్రసిద్ధమైనది.

ఈ స్తూప మెప్పుడు నిర్మితమయినదో స్పష్టముగఁ దెలిసికొనుట కాధారములు లేవు. శారీరకస్తూపము లెనిమి దింటిలో అశోకుఁ డేడింటిని తెఱపించి యందలి ధాతువులను చిన్న చిన్నవిగ పెక్కు విభాగములు గావించి, యం నొక్కొక్క దానిమీఁద నొక్కొకటిగ దేశమునందలి వేర్వేఱు భాగములందు మొత్తముమీఁద నెనుబదినాలుగు వేల స్తూపములను గట్టించినట్లు తరువాతికాలపు బౌద్ధగాథలు తెలుపుచున్నవి. అట్టివానిలో అమరావతీ స్తూప మొకటి కాఁదగును. ఈ గాథలు విశ్వసనీయములనుటకు ప్రమాణాం తరములు లేకపోయినను ఈ స్తూపపు జాలమీఁద మౌర్య లిపిలో శాసనము లుండుటవలన మౌర్యవంశమువారి పరిపా లనమునఁగాని, అంత కించుక పూర్వమునఁగాని, యిది నిర్మింపఁ బడియుండుననుట నిస్సంశయము. స్తూపశిల్పమునందలి యపరిణతములయిన ప్రాచీనరీతులను, పరిణతములుగఁ గాన వచ్చు నర్వాచీన రీతులను వేఱుపఱిచి చూచిన యెడల ప్రాచీనరీతుల ననుసరించికూడ ఇచ్చటి ప్రాథమికస్తూపము క్రీ. పూ. రెండువందల ప్రాంతమున వెలసినదిగనే కన్ప ట్టును. అశోకప్రేషితుఁడయి యంధ్రదేశమున కరుదెంచిన మహాదేవ బౌద్ధాచార్యుఁడు స్థాపించిన చైత్యకసంప్రదాయ

మయిన కిది. ప్రధానపీఠమగుటచేతను, అటుతరువాతికాలపు శాసనములం దిది మహాచైత్యమని పేర్కొనఁబడుటచేతను ఒకవేళ నిది యశోకచక్రవర్తి యాదరణముననే వెలసియుండ వచ్చును. ప్రారంభమున వెలసిన చైత్యము (స్తూపము) చుట్టును కాలక్రమమున పెక్కు చైత్యములు వెలసి, యిది ప్రాకార, బహువిధచిత్రాలంకార పరిశోభితమయి, చూచు వారలకు నేత్రపర్వ మొనరించుచు వార్తకెక్కినది.

మహాదేవునినాఁటినుండి యీ ధాన్యకటక మహా చైత్యక్షేత్రము ఆంధ్రమహాసాంఘికులకు ప్రధానమయిన పవిత్రపీఠముగ నుండెను. ధాన్యకటకము రాజధానిగ ఆంధ్ర దేశమును బరిపాలించిన ఆంధ్రవంశ్యులగు సాతవాహనులు బౌద్ధమతము నాదరించి యీ చైత్యమును బెక్కువిధములఁ బెంపొందించిరి. ఈ విధమున నిది క్రీ. పూ. ౨౦౦ లు మొదలు క్రీ. శ. మూఁడవ శతాబ్దివఱకు, అనఁగా ఆంధ్ర రాజుల పరిపాలనము నంతమువఱకు విభవాభిరామమయి క్రమాభివృద్ధి నందుచుండెను.

### పూర్వశైల, అపరశైలములు :

మౌర్యవంశానంతరకాలపు స్తూపశాసనములను పరిశీలించినచో నం దిది చైత్యకనికాయమునకు చెందిన మహాచైత్యము ('చేతికియానం నికాయస మహాచేతియ') అని పేర్కొనఁబడినది. మహాసాంఘికులలో చైత్యకవాదు లొకరు. ఈ బౌద్ధసంఘమును దాక్షిణాత్యబౌద్ధులు చైత్యవాద సంఘమని, ఉత్తరాదిబౌద్ధులు చైత్యశైలసంఘమని వ్యవహరించు,

చుండిరి. నాగార్జునుని కొండశాసనములందు ఈ సంఘముకాక పూర్వశైల (పువసేలియ), అపరశైల (అవరసేలియ) నికాయములుకూడఁ బేర్కొనఁబడినవి. పూర్వశైల, అపరశైలము లనుపేరఁ బరగిన యిచ్చటి బౌద్ధసంఘారామములు బౌద్ధవాఙ్మయమునందు కడుంగడు ప్రసిద్ధికెక్కినవి. రమ్యహర్మ్య కళాసౌందర్యమును, ప్రకృతిదృశ్యసౌందర్యమును గూడ నీ సంఘారామములకుఁ గలవని యేడవశతాబ్ది నిచ్చటి కరుదెంచిన యువాన్‌చాంగ్ అను చీనాయాత్రికుఁడు వీనిని కీర్తించియున్నాఁడు. ఇవి పూర్వోక్త శాసనములందుఁ గొన్నిట పూర్వమహావనశైల(పువమహావనసేలియ), అపరమహావనశైల (అవరమహావనసేలియ)నామములఁ బరికీర్తితములైనవి. క్రీస్తుశకము రెండవ, మూఁడవ శతాబ్దులనాఁటి 'గండవ్యూహ' మను నొక బౌద్ధగ్రంథము * ధాన్యాకరము (ధాన్యకటకము) నకుఁ బూర్వదిశయందు 'విచిత్రమాలాధ్వజవ్యూహ' మను పేరఁ బ్రసిద్ధమయిన యొక మహారణ్యము కలదని చెప్పును. దీని ననుసరించి చూడ ధాన్యకటకసమీపమున పూర్వపశ్చిమదిశలందు మహావనావృత శైలము లుండియుండు

* మహాయానబౌద్ధు లత్యంతపవిత్రములుగ భావించి పూజించు 'నవధర్మము' లను బౌద్ధగ్రంథములు తొమ్మిదింటిలో 'గండవ్యూహ' మొకటి. మిగిలినవి 'అష్టసాహస్రిక', 'ప్రజ్ఞాపారమిత', 'దశభూమీశ్వర', 'సమాధిరాజ' 'లంకావతార', 'సద్ధర్మపుండరీక', 'తథాగతగుహ్యక', 'లలితవిస్తర', 'సువర్ణప్రభాస'ములు. వీనిలో 'లలితవిస్తరము' బుద్ధుని జీవితచరిత్రమును దెల్పు గ్రంథము. ఇది బౌద్ధాంధ్రులలో నెక్కువ జనాదరణము నొందినది.

ననియు, దానంజేసియే యా శైలములందలి సంఘారామము లకు పూర్వ, అపరమహావనశైలములని పేర్లు కలిగియుండు ననియుఁ గొంద ఱూహించుచున్నారు.

పూర్వ, అపరశైలము లేవి యనువిషయమున పరి శోధక పండితులలో భేదాభిప్రాయములు కలవు. పూర్వ శైలము విజయవాడయని కొందఱి యభిప్రాయము; ధాన్య కటకమే యని మఱికొందఱి మతము. ఇటీవల త్రవ్వఁగా నాగార్జునునికొండయొద్ద బయలుపడిన స్తూప, సంఘారామ ప్రాకృతశాసనాదుల ననుసరించిచూడ ధాన్యకటకమునకుఁ దూర్పుననున్న సంఘారామము పూర్వశైల మను పేరను, పశ్చిమముననున్న సంఘారామము అపరశైల మను పేరను ప్రసిద్ధములయ్యెనని యూహింపఁదగియున్నది. ఇదికాక కృష్ణా నదీతీరమున కంటకశైలమని మఱియొక సంఘారామ ముండి నట్లు శాసనములవలన విదితమగుచున్నది. ఈ కంటకశైలమే నేఁటి గంటసాల. నాగార్జునునికొండ, అమరావతులందలి స్తూప ములవలెనే ఇచ్చటిదికూడ మహాచైత్యనామాంకితమయి తన రారుచుండుటచేత, నాఁడు కృష్ణానదీతీరమున వెలసిన సంఘా రామాదు లన్నియు మహాచైత్యకసంప్రదాయమునకు సంబం ధించినవిగఁ గన్పట్టును. ఈ కారణమున చైత్యకనికాయమే పూర్వశైల, అపరశైల సంఘములుగ విడిపోయెనని కొంద ఱందురు. దీని నంగీకరింపక మఱికొందఱు పూర్వాపరశైల సంఘములవలెనే చైత్యకసంఘముకూడ ఆంధ్రదేశ మహా సాంఘికులందలి ప్రత్యేకమయిన మూఁడవ విభాగమని చెప్పు

మరు. ఆచార వ్యవహారములయందును, శిక్షానియమముల యందును పరస్పరము వీరికి నెట్టిభేదములు కలవో తెలియదు కాని వీరలెల్లరు నొక్కసంప్రదాయమునకే చెందినవారని శాసనములవలన స్పష్టమగుచున్నది.

**అంధకులు :**

ఎట్లయిననేమి, ఆంధ్రదేశమున కరుదెంచిన చాల కాలమునకుఁ బిదప మహాసాంఘికులలో పెక్కు తెగలేర్పడి నవి. పైని పేర్కొనినవికాక శాసనాధారమున 'రాజగిరికులు' (రాజగిరి–రాచకొండనివాసకులు), 'సిద్ధత్థ'కులు అని మఱి రెండు తెగల పేర్లు తెలియుచున్నవి. ఇవి యన్నియు బౌద్ధ గ్రంథములందును పేర్కొనఁబడినవి. బహుశ్రుతీయ, ప్రజ్ఞప్తి వాద, పూర్వశైల, అపరశైల, లోకోత్తరవాద, ఏకవ్యావ హారిక, చైత్యకసంఘములు మహాసాంఘిక సంప్రదాయములు. చైత్యక, పూర్వశైల, అపరశైలములు చైత్యకనికాయములు. ఈ తెగల పేరెట్టివైనను చైత్యక, పూర్వశైల, అపరశైల, రాజగిరిక, సిద్ధార్థక నికాయములు తెలుఁగుదేశపు ప్రాకృత శాసనములందుదాహృతము లగుటవలన అవి కేవలము తెలుఁగుదేశపు తెగలని నిశ్చయింపవచ్చును. ఇవి యన్నియు 'అంధక బౌద్ధ' సంప్రదాయములు. బౌద్ధగ్రంథములందు ఆంధ్రులు 'అంధకు'లను పేరఁ బేర్కొనఁబడిరి.

ఆంధ్రదేశమున బౌద్ధము కడుప్రాచీనకాలమునుండి ప్రబలుచుండినను అమరావతీస్తూపమునఁ గడు ప్రాచీన చిత్రము లరుదుగను, అర్వాచీనము లయినవి, అనఁగా

మొదలిస్తూపము నిర్మితమయిన రెండువందల సంవత్సరి ములకుఁ దరువాతివి అధికముగను గాన్పించుటచే మొదటి నాళ్ళలో కంటె తరువాతనే యిచ్చటి స్తూపము పెంపుచెంది గొప్ప బౌద్ధ క్షేత్రముగ ప్రఖ్యాతమైన ట్లూహింపవలసి యున్నది. ఆదిమ బౌద్ధమునం దద్భుతపరివర్తనము జరగిన కాల మునసే ఈ స్తూప మత్యంతము పెంపుచెందుటచేత దీని పేరుపెంపులకుఁ దోడుపడిన యీ పరివర్తనమును గుఱించి యించుక తెలిసికొనుట యావశ్యకము.

## హీనయాన, మహాయానములు :

వైశాలీనగరమున బౌద్ధసంగీతి జరగిననాఁటినుండి బౌద్ధ సంఘమున కక్షలేర్పడినవి. ఇవి పెరుఁగుచురాఁగా మూలమత సిద్ధాంతములను గూర్చిన యభిప్రాయములు కూడ మాఱుచు వచ్చినవి. బౌద్ధసిద్ధాంతములందలి యీమార్పువలన బౌద్ధము రెండు విధము లయినది. బౌద్ధసంఘమునందలి యొకకక్ష వారు మార్పుచెందుచుండిన బౌద్ధమును, వేఱొకకక్షవారు మార్పును ద్వేషించి మూలసిద్ధాంతబద్ధమయిన ఆదిమ బౌద్ధ మును అభిమానించిరి. రాఁగా రాఁగా, మార్పునొందిన బౌద్ధమునకు 'మహాయాన' బౌద్ధమని, ఆదిమబౌద్ధమునకు 'హీనయాన' బౌద్ధమని పేర్లు కలిగినవి.

'హీనయాన'మున సర్వసంగపరిత్యాగముఁ గావించి భిక్షువుగాఁ జేరి, 'వినయ, సుత్త, అభిధమ్మ'ములను త్రిపిటక ములను జదివి సర్వపరిజ్ఞాతయై అష్టాంగమార్గము నవలంబించి సర్వజ్ఞుఁడై అర్హతపదము నొందినవానికే నిర్వాణోపలబ్ధి కలు

గును. ఈ కారణమున 'హీనయాన'మునకు 'అగ్రావత్రయాన' మని కూడ పేరు కలదు. శీలప్రధానమయినది హీనయానము. 'మహాయాన'మున వెంటనే యట్టి సర్వసంగ పరిత్యాగముం గావించుట యనావశ్యకము. బంధువులనుండి విడిపోవనక్కఱ లేదు. ఇల్లు వాకిలి విడనాడనక్కఱలేదు. ప్రేమబంధములను త్రెంపనక్కఱలేదు. ఎచ్చట నున్నను, ఏ వృత్తి నవలంబించుచుండినను, గృహస్థధర్మము నే నడపుచు, సర్వభూతముల యెడల ప్రేమయు, దయయుం జూపుచు లోక కల్యాణమును గోరి సత్కార్యములు చేయుచు బౌద్ధధర్మపరాయణుండై ప్రవర్తించుచుండినచో నెట్టివాఁడైనను నిర్వాణము నొందం గలఁడు. ప్రధాన భేద మీరెండు మతశాఖలకు నిదియే. ఈ విధమున 'హీనయాన'మున భిక్షుసంఘము అంచులవఱకు మాత్రమే నిండిన బౌద్ధము తోణికి, పొంగి పొరలి తుదకు ప్రపంచజీవితములోనికి జాలువాఱినది.

మహాయానమున నిర్వాణోపలబ్ధి సర్వజనసులభమగుట చేత బౌద్ధమున నెంతయో గొప్ప పరివర్తనము సంభవించెను. ఆదర్శములు మాఱినవి ; ఆచారములు మాఱినవి ; తత్త్వము భేదించినది ; భక్తి హెచ్చినది ; కర్మకాండము పెరిఁగినది ; మూర్తిసృష్టి యెంతయో కలిగినది. తుదకు బుద్ధుఁడు మొదట బోధించిన బౌద్ధమునకును, ఈ విధమున పరివర్తనమునొందిన బౌద్ధమునకును పెక్కు విషయముల సాదృశ్యమే లేకపోయి నది. రాగ ద్వేష మోహాదిజ్వాల లంతరించి స్వకీయ వ్యక్తిత్వము రూపఱుటయును, దుఃఖసముదయమునసుండి

ప్రాణి మోక్షము నొందుటయునే నిర్వాణమని ప్రథమమున
బుద్ధుఁడు బోధించెను. అంతకన్న 'తత్త్వ'పరముగ నతఁ
డేదియుఁ జెప్పియుండకపోవుటయే కాక, అట్టిదానిని గూర్చిన
కల్పనాలోచనములు కూడదనియు నిషేధించెను. అట్టిది మహా
యానమున ప్రపంచసత్యత్వాసత్యత్వములను గూర్చియు,
పరమజ్ఞానమును గూర్చియు తర్కవితర్కములు ప్రబలి బౌద్ధ
దర్శనము (Buddhist Philosophy) అంకురించి యది క్రమ
ముగా విస్తరిల్లినది. ఇట్లగుటలో ధర్మకాయ, సంభోగ
కాయ, నిర్మాణకాయములని బుద్ధకాయత్రయ సిద్ధాంత మేర్ప
డినది. 'హీనయానము'న బౌద్ధులకు ధర్మము, బుద్ధుఁడు,
సంఘము అనునవి ధర్మప్రాముఖ్యముతో శరణ్యములు
కాఁగా, మహాయానమున బుద్ధుఁడు, ధర్మము, సంఘము అని
బుద్ధప్రాముఖ్యముతో శరణ్యములయినవి. బౌద్ధము సర్వ
జనసులభమగుటచేత నీ మార్పున కనుగుణమయిన లక్ష్య
మావశ్యకమయి, మహాయానమున బోధిసత్త్వాదర్శము ప్రాధా
న్యము వహించెను. సంపూర్ణ వికసితచిత్తులయి, ప్రపంచ
దుఃఖమునకుఁ దాము పరితాపము ననుభవించుచుఁ దయ
ప్రేమము కారణముగ అలసులుగ నుండక అలౌకికౌదార్య
ముతో. ఈ జన్మమునను, భవిష్యజ్జన్మములందును ప్రపంచ
సేవ చేయఁ గృతనిశ్చయులై సర్వభూతనిర్వాణోపలబ్ధికిఁ
బాటుపడుచు, ఈ జన్మమునందుఁగాని, భవిష్యజ్జన్మమునందుఁ
గాని విధాయకముగ బుద్ధపదమును బడయువారు బోధి
సత్త్వులు. దరిదాపుగ బుద్ధపదము నందుకొనఁగలిగిన యిట్టి
బోధిసత్త్వుల తోడ్పాటు కాని, బుద్ధుల తోడ్పాటు కాని

లేనిదే మహాయానమున బౌద్ధమతావలంబి బుద్ధపదము నొంద నేరఁడు. భక్తిసాధనముననే బోధి సత్త్వులు పసులై బౌద్ధ ధర్మావలంబికి తోడ్పడుచుందురు. ఈ కారణమున బౌద్ధులకు హీనయానమున స్తూపమునకు పూవులు సమర్పించుట, దానికి ప్రదక్షిణము చేయుట, బౌద్ధక్షేత్రములను సందర్శించుట, బౌద్ధ భిక్షువులకు భోజనమిడుట యాచారములు కాఁగా, మహా యానమున బుద్ధునికి భిన్నులయిన బోధిసత్త్వులు మొదలగు దేవతలను పూజించుట ప్రధానకార్యమయ్యెను. బోధిసత్త్వుల కీర్తిని గలిగిన ప్రాధాన్యమువలన మహాయానము 'బోధి సత్త్వయాన' మనియు పేరుఁగాంచినది.

కృతనిశ్చయత్వమున ('ప్రణిధానము') కట్టి బోధిసత్త్వు లలో పేరొందినవాఁడు అవలోకితేశ్వరుఁడు. ఇతఁడు ప్రపంచమునందలి ధూళిరేణువుకూడ బుద్ధపదము నొందిననే కాని తాను నిర్వాణము నొందనని 'ప్రణిధానముఁ' గావించిన వాఁడు. బోధిసత్త్వులు భార్యాసహితులు; సంపత్సమేతులు. మహాయానమున వీరు అసంఖ్యముగ నెలసిరి. వీరినిగుఱించి యపూర్వములయిన గాథ లనేకములు వెలసి మహాయాన మునకు గొప్ప పురాణ వాఙ్మయమును (Mythology) ప్రసాదించినవి. ఇట్టి బోధిసత్త్వులలో నొకఁడును, బౌద్ధమున విద్యాసంస్కృతుల కధిదైవతమును అయిన 'మంజుశ్రీ' కి 'మాలాధ్వజవ్యూహచైత్యము' (ధాన్యకటకచైత్యము) చెంతి నున్న మహారణ్య మావాస మనియు, నతఁడు ఆ ప్రాంత మున నివసించుచుండిన నాగవంశ్యు లనేకులను, ఇంక నితరు

లను బౌద్ధులను గావించె ననియు 'గండవ్యూహ'మను గ్రంథమునఁ దెలుపఁబడినది.

మహాయానము విస్తరిల్లిన కాలముననే అమరావతీ స్తూపము పేరుపెంపులు గాంచి విఖ్యాత బౌద్ధక్షేత్రమయి విలసిల్లినది. ఈ నూతన బౌద్ధసంప్రదాయ మావిష్కరణము చెందిన స్థలము అమరావతీ ప్రాంతమని కొందఱును, కాశ్మీర గాంధారములని కొందఱును వచింతురు. ఇం దేది సత్యమయినను మహాయానమునకు నమరావతికి నెక్కువ సంబంధము కలదనిమాత్ర మంగీకరింపక తీరదు.

## ఆర్యనాగార్జునుఁడు :

మహాయాన బౌద్ధమునందలి గొప్ప పరిణతినొందిన బౌద్ధదర్శనము మాధ్యమికవాద మను పేర విఖ్యాతిఁగాంచినది. ఈ వాదమును బ్రతిపాదించినవాఁడు బౌద్ధపవిత్రుఁడయిన యార్యనాగార్జునుఁడు. మహాయాన మతస్థాపకుఁడే యితఁడని కొంద ఱందురు. కాని యితనికిపూర్వమే మహాయాన బౌద్ధమునకుఁ జెందిన యభిప్రాయములు బౌద్ధసంఘమున సిద్ధాంతములుగ బీజరూపమున నుండెననియు, ఇట్టి యభిప్రాయముల నదివఱకే వెలువఱుచుచువచ్చిన యాచార్యులు కొందఱు కలరనియు కొంద ఱందురు; కాని మహాయానము ఆర్య నాగార్జునునివలననే ప్రఖ్యాతమయి వర్ధిల్లినదని యెల్లరు నంగీకరింతురు.

జన్మచేత బ్రాహ్మణుఁడయి, మతావలంబనమున బౌద్ధుఁడయిన ఈ యార్య నాగార్జునుని కాలమునుగుఱించి

కాని, జన్మస్థలమునుగుఱించి కాని మనకు నిశ్చయముగఁ దెలియదు. కొందఱీ యాచార్యసత్తముఁడు క్రీస్త్వబ్దమునకు పూర్వము మొదటిశతాబ్ది యుత్తరార్ధమునం దుండెననియు, మఱికొందఱు క్రీస్తుశకము రెండవ శతాబ్ది యుత్తరార్ధమునను, మూఁడవ శతాబ్ది యారంభమునందు నుండెననియు వాదింతురు. క్రీస్తుశకము రెండవశతాబ్దినాఁటివాఁ డను నభిప్రాయమే యిప్పుడు ప్రబలముగ నున్నది. విదర్భయందలి యమరావతిలో జన్మించెనని కొందఱు, దక్షిణ కోసలదేశము వాఁడని కొందఱు. ఆంధ్రదేశీయుఁడని మఱికొందఱు, కాంచీపుర ప్రాంతమున జనియించినవాఁడని వేఱొక కొందఱు — ఇట్లీతని జన్మస్థలమునుగుఱించియు వేఱువేఱు వాదములు కలవు. నాగార్జునాచార్యుఁ డొక్కఁడు కాఁ డనియు, ఆ పేరు కలవారు వేఱువేఱు కాలములందుఁ బుట్టి ప్రఖ్యాతులయిన వారు ముప్వురు కలరనియు నొకవాదము కలదు. ఎచ్చట జన్మించినను మాధ్యమికవాదకర్తయయిన నాగార్జునుఁడు తన జీవితపుఁ బ్రొద్దు పడుమటిదెసకు వ్రాలిన కడపటి కాలమును కృష్ణానదీతీర ప్రాంతమునందుఁ గడపెనని బౌద్ధగ్రంథములవలనఁ దెలియుచున్నది. ఆ కాలమున దక్షిణాపథము నేకచ్ఛత్రముగఁ బాలించుచుండిన యంధ్రభూపతి 'సాతవాహనుఁ' డీ యార్య నాగార్జును నాదరించి యత్యంతము గౌరవించెను ఆర్య నాగార్జునుఁడు శ్రీధాన్యకటక చైత్యము చుట్టు నానా చిత్రచిత్రితమయిన ప్రాకారము నేకాక మహాదానపతి 'సాతవాహనుని' వితరణౌదార్యములవలన 'శ్రీపర్వతము'న శైలమంటపాలయములనుగూడఁ గట్టించెను.

శ్రీపర్వతమును, ధాన్యకటకమును ఆనాఁటి ప్రముఖములయిన బౌద్ధపీఠములని 'మంజుశ్రీమూలకల్ప' మను బౌద్ధగ్రంథమునఁ గలదు. జీవితావసానదశయందు నాగార్జునాచార్యుని కావాసమయిన శ్రీపర్వతమును, పూర్వోక్త గ్రంథమునఁ బేర్కొనఁబడిన శ్రీపర్వతము నొక్కటియే కానోపును. ఈ శ్రీపర్వతము కృష్ణానదీతీరస్థమయి నేఁడు శైవక్షేత్రముగఁ బేరెన్నికఁగన్న శ్రీశైలమే యని కొందఱభిప్రాయపడుచువచ్చిరి; కాని యిటీవల పలనాటిసీమయందలి నాగార్జునుని కొండదగ్గఱ త్రవ్వఁగా బయలుపడిన స్థూపశాసనముల ననుసరించి శ్రీపర్వత మనునది 'మహాచైత్య' సంశోభితమయిన నాగార్జునుని కొండయని తేలినది. ఆ శాసనములందు 'శ్రీపర్వతము' కాశ్మీరము, గాంధారము, చీనా, అపరాంతము, వంగము, వనవాసి, 'తాంబపణ్ణి' ద్వీపము మొదలగు దూరస్థదేశములందు బౌద్ధమతమును వ్యాపింపఁజేసిన బౌద్ధుల కత్యంత పవిత్రక్షేత్రమని చెప్పఁబడినది. ఈ ప్రాంతమునుండియే, అనఁగా కృష్ణానదీతీరస్థమయిన గూడూరు (కొడ్డూర) నుండియే బౌద్ధులు బర్మా, సయాము మొదలగు దేశములకు ఓడనెక్కి బౌద్ధమత బోధకై అరుగుచుండువారు. బుద్ధునికి పిదప బుద్ధునియంతటివాఁడయిన నాగార్జునాచార్యుల కావాసమయిన స్థలమగుటచేత పూజ్యార్థమున నా పర్వత ప్రదేశమునకు (శ్రీవారు, శ్రీపాదములు అనునట్లు) శ్రీపర్వత మను నభిధానము కలిగియుండును. బౌద్ధమతము క్షీణించి, దానిమీఁది గౌరవాదరణములు నశించినమీఁదట

నా పర్వతనిలయము జనవ్యవహారమున వచ్చి 'నాగార్జునుని కొండ' యైనది.

తన్నాదరించిన 'సాతవాహన' భూపతికొఱకు ఆర్య నాగార్జునుడు బుద్ధభగవానుని సుగుణసంపద కంటికిఁ గట్టినట్లు అభివర్ణించుచు ఛందోబద్ధముగ రచించిన 'సుహృల్లేఖ' పంపినట్లు బౌద్ధగ్రంథములు నుడువుచున్నవి. ఈ 'సుహృల్లేఖ' చీనా, టిబెత్తు భాషలలోని కనూదితమైనది. చీనాభాషలోనికి దీనిని గుణవర్మ యను బౌద్ధాచార్యుడు క్రీ. శ. ४३० ప్రాంతమున పరివర్తనము చేసెను. టిబెత్తుభాషలోనికి ఆ ప్రాంతముననే దీనిని 'సింఘవర్మ' యనువదించెను. దీనికి మూఁడవ యనువాదముకూడఁ గలదు. క్రీ. శ. ६८३ ప్రాంతమున 'ఇట్సింగ్' అను ప్రసిద్ధచీనా బౌద్ధయాత్రికుడు హిందూదేశమును సందర్శింప నేతెంచి తామ్రలిప్తినగరమున కరిగినప్పుడు స్వయముగ పఠించుచట దానిని తన మాతృభాషలోని కనువాదము గావించెనఁట. ఇంతటి ప్రసిద్ధమయిన యీ లేఖ మూలముమాత్రము హిందుదేశమున అంతరించిపోయినది. 'సుహృల్లేఖ' యను పేర టిబెత్తు భాషనుండి యాంగ్లమున కనూదితమైన యొక పద్యగ్రంథము కలదు. ఇది నాగార్జునాచార్యుని 'సుహృల్లేఖ' కనువాద మగునో కాదో తెలియరాదు.

## అమరావతీ చైత్యము ; పేరు పెంపులు :

అంధ్రవంశ్యులయిన సాతవాహనులలోఁ గొందఱు బౌద్ధభిక్షువుల నిమిత్తము నాసిక, కార్లి మొదలగుచోట్ల గుహాలు

తొలిపించి యొసంగి, వారి కనేక దానములు చేసియుండుట వలన వారి బౌద్ధమతాభిమానము వెల్లడియగుచున్నది; కాని శిరిలో నాగార్జునాచార్యునికి సమకాలికుడయి, యా మహా బోధిసత్వునాదరించిన సాతవాహనభూపతి యెవరో యెఱుంగ రాకయున్నది. గౌతమీపుత్ర, వాసిష్ఠీపుత్రులు, యజ్ఞ (శ్రీ) మున్నగు ప్రసిద్ధాంధ్ర భూనాథులు తాము స్వయముగ బౌద్ధులు కాకపోయినను, బుద్ధభగవానుని యెడలఁగల భక్తి తాత్పర్యములవలనను, ఆర్యనాగార్జునుని దివ్యప్రభావము వలనను బౌద్ధము నాదరించి, బౌద్ధులను బోషించి, మహా చైత్యములకు భక్తిమై కానుకలను సమర్పించినారు.

ఆర్యనాగార్జునుని కాలముననే ధాన్యకటక మహా చైత్యము అత్యంత వైభవము ననుభవించినది. ఆ కాలమున ధాన్యకటక సంఘారామము గొప్ప బౌద్ధ విద్యాపీఠముని వాసి కెక్కినది. దేశాంతరములందును, ద్వీపాంతరములందును దాని పేరు మాఱుమ్రోగినది. దీని యొరవడిమీఁదనే టిబెట్టు దేశమునందలి లాసానగరము సమీపమునందుఁ గల 'దాపంగ్' విద్యాపీఠము వినిర్మితమయినదని టిబెట్టు దేశ గ్రంథములందుఁ గలదు. ఈ పవిత్ర బౌద్ధక్షేత్రము మెల్లప్పుడు దేశాంతరాగతులయిన బౌద్ధబృందముతోఁ గిటకిటలాడుచు కనులకు విందొనర్చుచుండెడిది.

మహాయానమున పౌరాణిక బౌద్ధదేవతలసంఖ్య యధి కమయి, యా దేవతలకు పూజావిధియు, స్తోత్రాదికములును అతిశయిల్లుటతో మంత్ర తంత్రాదికములుకూడ తావు

కల్పించుకొనినవి. వీనికి మూలమయిన తాంత్రికాభిప్రాయములు మహాయానమున ఆరంభముననుండియు అవ్యక్తముగ నుండి కాలక్రమమున సువ్యక్తములయి, దాని తరువాతి పరిణామమగు 'వజ్రయానము'న విధివిహితముగ పరిద్యోతితములయినవి. వజ్రయాన తాంత్రికపద్ధతి ప్రబలిన యీ కాలమునఁ గూడ ధాన్యకటకము ప్రాధాన్యము వహించుటచేతఁ గానోపు, నిది దక్షిణాపథమున తంత్రప్రతిష్ఠాపనములకు చాల ప్రసిద్ధి కెక్కినదని టిబెత్తుదేశ బౌద్ధగ్రంథములు నుడువుచున్నవి. 'దశవలుఁ' డను బౌద్ధసాధుపుంగవుఁ డొకఁడు శ్రీధాన్యకటక చైత్యముకడ తంత్రముల నన్నిటిని జేర్చెనఁట. 'మూల తంత్రకాలచక్ర' మీ ధాన్యకటక చైత్యమున నిక్షిప్తమైయుండెననియు, నిచట బుద్ధుఁడు కాలచక్రమను ధ్యానసమాధిని గూర్చుండినచోట 'వజ్రపాణి' యను బోధిసత్త్వుఁడు దివ్యమయిన రమ్యహర్మ్యమును ఆశ్చర్యకరముగఁ దన మహిమచేత నిర్మించె ననియు టిబెత్తు బౌద్ధగ్రంథములందుఁ గలదు. ఈ గ్రంథముల యాధారముననే నాగార్జునుని కిచట 'మహా కాలతంత్రము' లభించినదని తెలియుచున్నది. పూర్వోక్త గాథల యాథార్థ్య మెట్టు లున్నను ధాన్యకటకమునకు తాంత్రిక బౌద్ధముతో సంబంధము కలదను విషయము నవి స్థిరపఱుపఁగలవు. వజ్రయాన బౌద్ధమునకు సంబంధించిన రత్న సంభవబుద్ధ, పద్మపాణి, సింహనాద విగ్రహములు అమరావతిలో దొరికినవి. ఈ యంశముకూడ ధాన్యకటకమునకును, తాంత్రిక బౌద్ధమునకును గల సంబంధమును రూఢిపఱుచుచున్నది.

**అంతిమదశ :**

కాలక్రమమున ధాన్యకటకమునకు మహాదశ తొలంగి పోయినది. మహాచైత్యము ప్రభ క్రీస్తుశకము నాలుగైదు శతాబ్దులవఱకు వెలిఁగినది. దాని క్షీణదశ కంతటినుండి గో మొదలు. ఇందులకుఁ గల కారణము లనేకములు. ముఖ్య కారణము అది ప్రజల కేవగఁ దోఁచిన వజ్రయాన తాంత్రి కాచారముల కిరవగుట. ఈ యాచారములవలన సంఘారామ ములు ప్రజాదృష్టిలో నింద్యములై దుర్యశము నాపాదించు కొన్నవి. ప్రజలు వజ్రయాన బౌద్ధాచార్యులను సంఘున్య మునకుఁ బట్టిన చీడపుర్వులుగ భావించిరి. ఈ కారణమున బౌద్ధమునకు ప్రాపక పోషణములు కఱవయి కాలక్రమమున అది యంతరించిపోయినది. ఈ యదనున దీనికి గొడ్డలిపెట్ట యినది వైదికమయిన పౌరాణిక మతవిజృంభణము. ఈ కాలమున వైదిక మతాభిమానము గల రాజ్యము లనేక ములు వెలసినవి. పల్లవులు, విష్ణుకుండులు, చాళుక్యులు, గుప్తులు, వాకాటకులు మొదలగు వంశములవారు వైదిక సంస్కృతి, మతాభిమానులయి యజ్ఞయాగాది సవనదీక్షాప్ర వృత్తిఁ గలిగి వైదికమతమున కాశ్రయ మొసంగిరి. రాజ పోషణము, ప్రజాపోషణము కూడ లేక దక్షిణాపథమున బౌద్ధము క్షీణించినది.

క్రీస్తుశక మేడవశతాబ్దియందు చీనాయాత్రికుఁడయిన యువాన్‌చాంగ్ ఆంధ్రదేశమున కరుదెంచి ధాన్యకటకనగర మును సందర్శించునాఁటికే బౌద్ధముదుర్దశ ప్రస్ఫుటముగ

నేత్రగోచర మయినది. ధాన్యకటకనగరమున నసంఖ్యాములుగ విలసిల్లిన బౌద్ధవిహారరాజము లనేకములు భిక్షుక సంఘ పరిత్యక్తములయి, జనశూన్యములయి పాడువారియుండినవి. ఇరువది విహారములందుమాత్రము బౌద్ధసాంఘికులు నివసించు చుండిరి. వా రయినను వేయిమంది కెక్కువగ లేరు. వీరిలో ననేకులు మహాసాంఘిక బౌద్ధులు. ఒకప్పుడు బౌద్ధమున కాయువుపట్టుగ నుండిన ధాన్యకటకనగరముననే యువాన్ చాంగ్ సందర్శించునాఁటికి సుప్రతిష్ఠితములైన వంద హిందూ దేవాలయము లుండెనఁట. బౌద్ధేతరులయిన పెక్కు మతముల వారుకూడ నచటఁ గానవచ్చుచుండిరి. అప్పటికిని ఆ మహా నగరమునకు విద్యాపీఠమను యశస్సు కుంచితము కాలేదు. ఆ నగరమునం దుండిన కాలమున యువాన్ చాంగ్ అచ్చటి బౌద్ధభిక్షువు లిరువురితో కలిసి మహాసాంఘికుల 'అభిధర్మ గ్రంథము' లను అధ్యయనముగావించి, వారికి మహాయాన ధర్మగ్రంథముల నుపదేశించెను.

## నేఁటిస్థితి :

బౌద్ధమతమునవసానదశలో తాంత్రికపద్ధతి ప్రబల మయినది. అది నామమాత్రావశిష్టమై తాంత్రిక శైవకల్ప మయి, తన విశిష్టలక్షణమును గోలుపోయి క్రమముగ నంత రించినది. నాఁటినుండి ధాన్యకటక 'మహాచైత్యము' నకు పూజావేదికపయి స్థానము లుప్తమైనది. క్రీస్తుశకము పదు నొకండవ శతాబ్దివఱకు పరిశుద్ధాంతఃకరణముగల జానపదులు భక్తిప్రేరితులై దానికి ఎడనెడపుష్పాంజలులను సమర్పించుచు

నచ్చినను మత మను మబ్బు తెర దిగజారినమీఁదట నది యుత్కృష్టశిల్పకళాభిజ్ఞత కపూర్వోదాహరణముగమాత్రమే ఘోలుపారి, కాలవిపర్యయమున శతాబ్దులు గడచిపోవ శిథిలమయి భూగర్భస్థమయినది.

ఈ మహాచైత్యము క్రీస్తుశకము పదునెనిమిదవశతాబ్ది యందు తుదకు సౌందర్యకళాభిజ్ఞులయిన పాశ్చాత్యులవలనఁ దన యస్తిత్వమును బయలుపఱుచుకొని, విశీర్ణములయిన చైత్యశిల్ప చిత్రములరూపమున ప్రాచీనాంధ్ర శిల్పకళాకుశలుర కళావిజ్ఞానమునకు నేఁడు స్మారకచిహ్నమయి యలరాఱుచున్నది.

ఆంధ్రదేశమున కృష్ణానదీ తీరమందలి చైత్యాలయ, విహారాది బౌద్ధప్రతిష్ఠాపనములుకూడ కాలక్రమమునఁ బాడువడి భూగర్భమునఁ బడి పూడిపోయి దిబ్బలయి, బౌద్ధావసానదశయందు వర్ధిల్లిన తాంత్రికపద్ధతియందు నింద్యముగ సంభావింపఁబడిన కర్మకాండమునవలననేమో, యవి తరువాతి తరములవారి స్మృతిచంద్రికాధవళిమయందు 'లంజదిబ్బ' లనుపేర కళంకాంకములుగనే నిలిచిపోయినవి. పూడిపోయిన స్తూపము లొకప్పుడు విహారాంతికమున వెలసిన వేయుగుట వలన నాస్తూపపు దిబ్బలనుగూడ ప్రాంతీయులయిన జానపదులా పేరనే వ్యవహరింతురు. దీపసహస్రాలంకృతమయి, బుద్ధదేవుని జయంత్యుత్సవములకును, ఇతర బౌద్ధపర్వంతులకును దేశాంతరములనుండియు, ద్వీపాంతరములనుండియు వేలకొలఁది బౌద్ధ భక్తబృందము నాకర్షించుచు, నయనపర్వముఁ

గావించుచుండిన యీ మహాచైత్యము విలసిల్లినక్షేత్రము ఆ మహావిభూతియెల్ల హరించిపోవ 'దీపాలదిన్నె' యను నామమును మాత్రమే పరిశిష్టముగ నిలుపుకొని 'బ్రతికి చెడ్డ యాంధ్రుల పూర్వవైభవంబు' ననేక శతాబ్దులనుండి కన్నీరు మున్నీరుగ వర్ణించు మహావాహిని కృష్ణవేణీస్రవంతితో శ్రుతి కలిపి నేఁటికిని హృదయవిదారకముగ విషాదగీతి నాలపించుచునే యున్నది.

## ఆకృతి, శిల్పములు :

ఆధునికకాలమున అమరావతీస్తూపము పేరు ప్రతిష్ఠలు అందలి శిల్పచిత్రముల యోగ్యతవలననే దిగంతవిశ్రాంతము లయినవి. ఆంధ్రులకు కీర్తి సముపార్జించిపెట్టిన యీస్తూపము నాకృతినిగుఱించియు, స్తూపశిల్పమునఁ జూపఁబడిన యితివృత్తములనుగుఱించియు నించుక తెలిసికొనుట యుక్తము.

ఇంచుమించుగ వృత్తాకారముగల పెద్ద వేదిక (Basement), తదుపరితలమున అర్ధగోళాకారముగల యండము (Dome), దానిమీఁద హర్మిక (Pavilion), దానిపయిని కేతనవిరాజితమయిన దండాంచితచ్ఛత్రము – ఈ యంగములతోఁ గూడిన సంపూర్ణనిర్మాణమే ధాన్యకటక చైత్యమని, అమరావతీస్తూపమని విఖ్యాతమయినది.

వేదికమీఁద అండనిర్మాణమునకు నాలుగువైపుల యందును 'ఆయక' స్తంభము లనుపేర అయిదేసి స్తంభము లుండును. ఈ స్తంభములమీఁద వెలుపటివైపు దిగువ భాగమున పద్మ, అశ్వ, బోధివృక్ష, ధర్మచక్ర, స్తూప

చిత్రము లుండును. అమరావతి, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, గంటసాల స్తూపములందుమాత్రమే కాని యుత్తరహిందూస్థానములందలి యేస్తూపములందును ఇవి కానరాకపోవుట చేత 'ఆయక' స్తంభప్రతిష్ఠాపనము ఆంధ్రదేశమునందలి బౌద్ధస్తూపముల విశిష్టలక్షణమని సిద్ధాంతమయినది.

వేదికకు చుట్టును భక్తులు ప్రదక్షిణము చేయుటకు 'శ్రీవీధి' యను పేర ప్రదక్షిణవీథి యుండును. ఈ వీథి నానరించి నిలువు తాటికంబములతోను, వీనిలోని కెడనెడ నడ్డముగఁ జొనిపిన తాటికమ్ములతోను నిర్మించిన కట్టవవంటి శిలాప్రాకారము కలదు. ఆర్యనాగార్జున నిర్మితమని పరికీర్తితమయిన ప్రాకారరేఖ యిదియే. స్తంభములోనికి సూచీవిధమునఁ జొరుచుకొనిపోయినవగుటచేత అడ్డుకమ్ములు సూచీనామాంకితము లయినవి. ప్రాకారరేఖయందలి శిలా స్తంభోపరితలమున తాటిదూలములతో మదురువలె నేర్పడిన భాగమునకు 'ఉష్ణీష' మని పేరు. సూచీస్తంభోష్ణీషములు అతిమనోహరమయిన దివ్యచిత్రసంపదతో నొప్పారినవి. ప్రాకారరేఖయందు నాలుగుదిశల నాలుగుద్వారములు కలవు.

మాయాదేవి స్వప్నము, బుద్ధుని జననము, మహాభినిష్క్రమణము, మృగదావమునందలి బుద్ధుని మొదటి ధర్మబోధ, మారప్రలోభము, బుద్ధధాత్వారాధనము అనెడి బుద్ధవృత్తములు బౌద్ధులకు ప్రియతమములగుటచేనేమో యవి యమరావతీచైత్యశిలాఫలకములఁ బలుమాఱులు చిత్రితము లయినవి. స్తూపముమీఁదఁ జిత్రితములైన జాతకకథలతో

మిగుల హృదయాకర్షకములయినవి 'ఛద్దంత', 'వెస్సంతర' కథలు.

చలువఱాతిమీఁదఁ జిత్రితమయిన యీ శిల్పసంపదను సూక్ష్మముగఁ బరిశీలించినచో బౌద్ధయుగమునాఁటి చతురు లయిన యాంధ్రశిల్పకళావిశారదులచేతిలో ఆ చలువఱాయి తన కాఠిన్యమంతయు వీడి యెట్లు తీర్చిన నట్లు చక్కనగు మయినపుముద్దగ మాఱినదని తోఁపకమానదు. క్రీస్తుశకము ప్రాథమికశతాబ్దులందు బౌద్ధమత మంధ్రదేశమున బాగుగ ప్రబలిననాఁటి ఆంధ్రుల యాచారవ్యవహారములు, దుస్తులు, ఆభరణములు మొదలగువానిని గుఱించి సవిస్తరముగఁ దెలిసి కొనుటకు అమరావతీస్తూపము పెన్నిధివంటిది. భారతీయ శిల్పకళావిన్యాసమున నేఁడు 'అమరావతీరీతి' యను పేరఁ బరగు నొకవిశిష్టకళావిభూతికి సూత్రములు పన్నిన ప్రాచీ నాంధ్ర శిల్పాచార్యులు రచియించిన కృతుల గొప్పదనము నకు అమరావతి, జగ్గయ్యపేట, నాగార్జునునికొండ మొదలగుచోట్ల బయలుపడిన స్తూపములందలి భగ్నశిలాశిల్పశకల ములే నేఁడు నిదర్శనములుగ నున్నవి.



# నాగార్జునికొండ

ఇప్పటికి దాదాపుగ ఏడునందల సంవత్సరములయినది బౌద్ధమతము జన్మభూమియయిన హిందూదేశమును అంతరించి. కాని యది దేశీయుల గౌరవాదరములకు పాత్రమై, వారి యభిమాన, విశ్వాసములను చూఱగొని యడ్డమాఁకలు లేక విజృంభించిననాఁడు దేశమును ఆ మతము నెలయింపఁజేసిన నిర్మాణములలో చాలభాగము నామమాత్రావశిష్టములయి నను కొన్నిమాత్రము కాలపురుషుని ధార్ష్ట్యమున కెదురొడ్డి కొనయూపిరితో నిలిచియున్నవి ; మఱికొన్ని ఇండియా ప్రభుత్వపు పురాతత్త్వశాఖవారు చేయుచున్నకృషికి ఫలముగ ఏ శిథిలరూపముననో, భగ్నాకృతులతోనో బహిర్గతములగుచున్నవి. ఈ జీర్ణ బౌద్ధ నిర్మాణావశేషములను, శిథిలబౌద్ధ శిల్పకృతులను చూచినప్పటికిని బౌద్ధము జీవన్మతమై విలసిల్లిననాఁటి యీ కళానిధానముల నిండారు ప్రశస్తి వైభవ శోభలను మన మూహింపనైన సాధ్యము కాదు. బుద్ధజయంతుల నాక్షేత్రము లెట్టి యపూర్వసౌందర్య విలాసశోభతో మెఱసిపోయెడివో, ద్వీపాంతరములనుండి దేశాంతరములనుండి యెంతటి ప్రజ నాకర్షించుచుండెడివో యెవ్వరికిఁ దెలియును ? గాలిలో పెట్టిన కర్పూరఖండమువలె హారించిపోయిన ధాన్యకటకసంఘారామ బౌద్ధపుణ్యక్షేత్రపు (దీపాలదిన్నె) పూర్వవైభవము హృదయసీమ నెవఁడు నేత్రగోచరము కావించుకొనఁగలఁడు? అయినను నేఁడు ఈ విశీర్ణ భగ్న

బౌద్ధనిర్మాణావశేషములవలననే హిందూదేశమున బౌద్ధను స్మరముగ వ్యాపించిననాడు కళ యెంతటి యుచ్ఛదశ యందుండెనో, అది యెంత యుత్తమశ్రేణికి చెందినదో, ఎంత సుందరమైనదో తెలిసికొన వీలగుచున్నది.

హిందూదేశమున బౌద్ధము ప్రబలిననాటి యీ కళ వర్ణికాచిత్రముల రూపమునను, శిల్పచిత్రముల రూపమునను, హార్మ్యనిర్మాణముల రూపముననురూపుకట్టుకొని వికసించినది. నేడు మన మీ మూడువిధములగు బౌద్ధకళనుగూడ ఈ దేశమున జూడగాంచవచ్చును. పైనుడివిన మూటిలోను వర్ణికాచిత్రములకు అజంతా, బాఘ్‌విహారములు అసదృశము లయిన చిత్రశాలలు. బౌద్ధస్తూప, సంఘారామ, గుహాలయ ములు బౌద్ధహార్మ్యనిర్మాణాదుల కుదాహరణములు. బౌద్ధ మంతరించిపోవుటచేత సంఘారామములు నామమాత్రావశిష్ట ములయియు, గుహాలయములు 'ఖండస్ఫుటిత నవకర్మాది' సంస్కారములు లేక జీర్ణములయియు అందందు చూపట్టు చున్నవి. పురాతత్త్వశాఖవారి నిరంతరకృషివలన స్తూపము లనేకములు చాలచోటుల బయలుపడినవి. బౌద్ధస్తూప, హార్మ్య నిర్మాణాదికముల ననుసరించి విలసిల్లినదే బౌద్ధశిల్ప చిత్రకళ. ఆంధ్రదేశమున బౌద్ధవర్ణికా చిత్రకళ కుదాహరణ ములు మృగ్యములయినను స్తూప, గుహాలయముల భగ్నావ శేషములకుమాత్రము కొంతవఱకు కొఱత లేదు.

బుద్ధుని సిద్ధాంతోపదేశములకును బౌద్ధకళకునుగల సంబంధ మెంతవఱకున్నది ఇంకను విమర్శనీయమేయైనను

బుద్ధుని అహింసాతత్త్వమే, బుద్ధుని జీవకారుణ్యమే, బుద్ధుని పరమాశయమే బౌద్ధకళాస్రష్టలకు జీవగఱ్ఱయై వారి హృదయములను ద్రవింపఁజేసినది. ఆ నాఁటి బౌద్ధశిల్పుల రసహృదయమే తరఁగెత్తి బౌద్ధకళగా జాలువారినది. బౌద్ధకళయందలి ప్రతి అంశమును ఉదాత్తవస్తుసమంచితము; ప్రసన్నకథాలలితము ; కరుణారసాత్మకము ; త్యాగధనవిశిష్టము. బుద్ధుఁడు మూర్తీభవించిన కరుణారసస్వరూపము. బుద్ధుని పురాతన అధునాతనచరితము, బుద్ధునియుపదేశము, బుద్ధునిబోధ దివ్యసందేశగర్భితములు. దుఃఖానలసంతప్తమయిన లోకమునకు బుద్ధసందేశము చల్లని యమృతసేచనమయి, దానికి సౌఖ్యసంప్రదమైన చందనశైత్యము నొడఁగూర్చి, దానిని సాకినది. దానంజేసియే చంద్రునిచుట్టు పరివేషమువలె బుద్ధుని చుట్టు బౌద్ధకళ పరిఢవిల్లినది.

చారిత్రక పురుషు లందఱివలెనే బుద్ధుఁడును ఒక చారిత్రక వ్యక్తియేయైనను బుద్ధసందేశముగ్ధమును, భక్తిభావ వినమ్రమము నయిన భక్తలోకము ఆ పరమకారుణిక మూర్తికి అతిమానుషశక్తులను ప్రసాదించి యాతనికి స్వర్గ సింహాసనము నొసంగి దివ్యరాజ్యమున కాతనికి పట్టము గట్టినది. బుద్ధుని జన్మము, బుద్ధుని విద్యాభ్యాసనము, బుద్ధుని వివాహము, బుద్ధుని భోగము, బుద్ధుని త్యాగము—అన్నియు నీ లోకముదృష్టిలో అత్యద్భుతగాథలై, పౌరాణికశోభ సేకరించుకొని, దివ్యత్వముతో మెఱసిపోయినవి. బుద్ధుని గాథలు—పూర్వజన్మములకు సంబంధించినవియు, ఈ జన్మము

నకు సంబంధించినవియు-అనంతములు. చీకటిలో తడవులాడు కొనుచు యాత్రసాగించు అంధలోకము హృదయమును బుద్ధుఁడు తేజపఱచినట్లు ఎవ్వరును చేయలేదన్న అది సత్యదూరము కానేరదు.

కాని బౌద్ధము దేశమున బాగుగ వ్యాపించినది బుద్ధుఁడు నిర్వాణము నొందిన వెనుకనే. మౌర్యవంశజుఁడయిన అశోకవర్ధనుఁడు దశదిశలకు బుద్ధసందేశమును వినిపింప మత బోధకులను బంపినాఁడు. అశోకవర్ధనుని ఆదరాభిమానముల వలన అంతవరకు మగధహద్దులు దాఁటకుండ ఒక స్థానిక ధర్మసంప్రదాయముగనే యుండిపోయిన బౌద్ధము అంతటి నుండి ప్రపంచమతమయినది. బౌద్ధము ఆంధ్రదేశమునఁ బ్రవే శించినదికూడ అశోకవర్ధనుని కాలముననే.

మౌర్య అశోకవర్ధనుని మరణానంతరమున బౌద్ధము నకు మగధరాజ్యమున ఆదర, ప్రాపకములు సన్నగిల్లినవి. అందువలన నది అన్యరాజ్యములను వెదకికొనవలసివచ్చినది. ఇటువంటిస్థితిలోనే దాని కాశ్రయమిచ్చి ఆదరించినవారు ఆంధ్రులు.

క్రీస్తుశకము మొదటి శతాబ్దులలో ఆంధ్రరాజులు రాజ్యము చేయుచుండిన కాలమున బౌద్ధమతము ఆంధ్రదేశ మున విరివిగా వ్యాపించెను. దానంజేసి నాఁడు తెలుఁగుదేశ మున బౌద్ధుల సంఘారామములును, గుహాలయములును, స్తూపములును చాల వెలసినవి. నేఁడు దేశమున బౌద్ధ మంతరించిపోవుటచేత దానికి సంబంధించిన సంస్థలు నామ

మాత్రావశిష్టములయినవి. అప్పటి నిర్మాణములు జనుల యనాదరమునకు పాలయి జీర్ణములై శిథిలత్వము నొందినవి. దానంజేసి నాఁడు బౌద్ధసంఘమునకు పుణ్యప్రదములయిన క్షేత్రము లేవో, మనికిపట్టు లేవో నేఁటి కింకను పూర్తిగఁ దెలియరాకయున్నది. బౌద్ధము పూర్తిగా నశించిన పిదపఁ గూడ కాలము రాటుపోటుల కాగి కొంతకాలము నిలిచిన బౌద్ధ స్తూపనిర్మాణములు కాలక్రమమున భూగర్భమునఁబడి పూడిపోయి పెద్ద దిబ్బలయినవి. అట్లు పూడిపోక యే నిర్మాణములైన నిలిచియుండినచో వాటి ప్రాముఖ్యము తెలియని, కళాభిరుచి లేని మనుష్యులే ఇటికలు మొదలయినవాటి నిమిత్తము వాటిని పాడుచేసినారు. ప్రాచీన బౌద్ధనిర్మాణముల కొఱకు పునః అన్వేషణము జరగవలసివచ్చినది.

గవర్నమెంటు పురాతత్వ శాఖవారు కృష్ణా, గుంటూరు మండలములలో అచ్చటచ్చట భూమిని త్రవ్వి చేసిన యన్వేషణములవలన ఆంధ్రదేశమునందలి ప్రాచీన బౌద్ధక్షేత్రములు కొన్ని కొన్ని తెలియవచ్చినవి. ప్రాచీన బౌద్ధస్తూపాదులు కొన్ని బయలుపడినవి. పురాతత్వశాఖవారి కృషివలననే కృష్ణానదీతీర ప్రదేశమునందలి అమరావతి, జగ్గయ్యపేఁట, గంటసాల, గుమ్మడిదుఱ్ఱు, భట్టిప్రోలు మొదలైనవి పూర్వము ప్రసిద్ధములయిన బౌద్ధపుణ్యక్షేత్రములనియు, ఈ స్థలము లన్నిటను బౌద్ధమునకు సంబంధించిన నిర్మాణ, శిలాశిల్పావశేషము లుండెననియుఁ దెలియుచున్నది. పైని చెప్పిన స్థలము లన్నిటిలో ఒక్క అమరావతిలో

మాత్రమే గొప్ప బౌద్ధస్తూపనిర్మాణావశేషసంపద దొరికినది. దానినిబట్టియే బౌద్ధము వ్యాపించిననాడు ఆంధ్రులు శిల్ప కళారచనమున అసమానులని తెలియవచ్చినది.

భారతీయబౌద్ధకళాచరిత్రమున అమరావతిది ఒక గొప్ప ప్రకరణము. బౌద్ధయుగమునాటి యాంధ్రులు భక్తితత్పరులై బుద్ధభగవానుని కర్పించిన శిల్పనీరాజనము అమరావతీ స్తూపము. బౌద్ధాంధ్రులు శిల్పచిత్రరచనమున కొంత విశిష్టత చూపి అమరావతీస్తూపమునకు అపరిమితఖ్యాతి తెచ్చిరి. బౌద్ధయుగమునాటి ఆంధ్రసంస్కృతికి అమరావతి యపూర్వ మణిదర్పణము ; చిత్రవ్యాఖ్యానము. నాటి యాంధ్రుల శిల్ప కళాకౌశలమునను సరించి భారతీయ బౌద్ధకళాసంప్రదాయము లలో అమరావతీ సంప్రదాయ మొకటి యేర్పడి ప్రసిద్ధి గాంచినది ; అంతియ కాదు. అది నాడు వర్ధిల్లిన బౌద్ధకళా సంప్రదాయము లన్నిటిలో నుత్తమమయినదని, ఉత్కృష్ట మయినదని పేరుగాంచినది. వస్తు వేది చిత్రింపవలసివచ్చినను అందు బౌద్ధయుగమునాటి యాంధ్రశిల్పి అద్భుత ప్రతిభ, అసమానప్రజ్ఞ చూపినాడన్న ఖ్యాతి గడించినాడు.

బౌద్ధయుగమున కృష్ణానదీ తీరమున పరివ్యాప్త మయిన కళాసంప్రదాయము అమరావతిదే. బౌద్ధ ఆంధ్ర శిల్పులందఱు అమరావతీశిల్పరీతినే వరవడిగా బెట్టికొని తమ కళారచనమును సాగించుచువచ్చిరి. మొన్న మొన్నటివఱకు బౌద్ధకళకు ఆంధ్రులు చెప్పుకొని గర్వింపదగిన యుదాహర ణము ఆ యొక్క అమరావతియే. కాని గవర్నమెంటు పురా

తత్వశాఖవారిటీవల జరిపిన కృషివలన మఱియొక శిల్పకళానిధానము – నాగార్జునుని కొండ – బయలుపడినది.

గుంటూరుజిల్లా పల్నాడుతాలూకాలో కృష్ణానదీ దక్షిణతీరముననున్నది నాగార్జునునికొండ. పల్నాడుతాలూకాలోని మాచెర్లవఱకు రైలుకలదు. మాచెర్లకు నాగార్జునుని కొండకు ౧౫ మైళ్ళదూరము. మాచెర్లనుండి పదిమైళ్ళదూరముననున్న నాగులవరమువఱకు బండ్లు పోవును. అచ్చటినుండి కడపటి యైదుమైళ్ళదూరమును నడచిపోవలసినదే.

నాగార్జునునికొండకు దగ్గఱనున్నగ్రామము పుల్లారెడ్డిగూడెము. అది చారిత్రక ప్రసిద్ధిగల ప్రాంతమున నున్నను ఆగ్రామమున చారిత్రకప్రాముఖ్యముగల వస్తువిశేషములు ఏవియు లేవు. నిజాంరాజ్యమును, చెన్నరాజధానిని విడదీయుచు కృష్ణానది నాగార్జునునికొండ ప్రక్కనుండియే ప్రవహించును. ఇది యంతయు కొండలమయమయిన ఎఱ్ఱనేల. ఇక్కడి కొండలు ౮౦౦ ల అడుగుల ఎత్తుండును. ఈ కొండల పార్శ్వము లడవితో నిండియుండును. కొండలతోపాటు పెద్ద పెద్ద దిబ్బలుగూడ ఇక్కడ చూడనగును. వీటిమీఁదకూడ అడవి బలిసినది. ఈ దిబ్బలన్నియు ప్రాచీన బౌద్ధనిర్మాణముల అవశేషములు. నాగార్జునునికొండ యున్నది ఈ ప్రాంతమున వాయవ్యదిశనున్న ౨౦౦ ల ఎకరముల పై వైశాల్యముగల యొక గుట్ట. చిత్రవిచిత్రాకృతులుగల శిఖరములతోడి ఈ కొండలను జూచినచో అవి స్వాభావికముగ ఏర్పడిన కోటగోడలవలెఁ దోఁచును. వీనికిఁదోడు రక్షణనిమిత్తము మానవ

ప్పుడు ఇటికతోను, జాతితోను కట్టిన గోడలు మొదలయినవి కూడ ఉన్నవి. వీటి నన్నిటినిబట్టి చూడఁగా ఈ ప్రాంతపు పీఠ భూమి ఒకప్పుడు ఒక దుర్గముగా నుండియుండవలెనని తోఁపక పోదు. ఈప్రదేశమున పాడుపడిపోయిన మధ్యయుగమునాఁటి శివాలయముతక్క ప్రాచీననిర్మాణములు కాని తత్ చిహ్నములుకాని కనిపింపవు. విడివిడిగా చెదరిపడియున్న శిలా సమూహమును జూచినయెడల ప్రాచీనకాలమున ఇచట ఏవో వెట్టి మొట్టిగా కట్టిన కొంప లుండవలెనని తోఁచును. కోట గోడలు మొదలగువాటిని కట్టుటలో నుపయోగించిన ఇటికలు ఈ లోయలోని బౌద్ధనిర్మాణములలో నుపయోగించిన వాటితో సమపరిమాణము గలిగియున్నవి. మిక్కిలి పెద్ద యిటిక ౨౦" × ౧౦" × ౩", అనఁగా పాటలీపుత్రములోని అశోకవర్ధన చక్రవర్తి రాజధానీస్థలమయిన బులందిబాఘ్‌లోఁ గానవచ్చినవానియంత పరిమాణముగలవే సరిగా. ఈ యిటిక గోడలు, ప్రాకారములు మొదలైనవి బౌద్ధు లీ ప్రదేశము నాక్రమించి యుండినప్పుడు కట్టినవే కావచ్చును. ఈ కొండ దిగువ ఉపత్యకలందు శిలాప్రాకారములును, బురుజులును గలవు. ఇవి బౌద్ధయుగమునకు చాల తరువాతివి. విజయ నగరాధీశుల కాలమునాఁటివి కావచ్చును.

బౌద్ధ అవశేషములు లోయలోమాత్రమే కాన వచ్చును. పీఠభూమిమీఁద కొన్నిమైళ్ళవఱకు త్రవ్వి చూచి నారు కాని గృహనిర్మాణము లుండినజాడ లేవియుఁ గాన రాలేదు. ఇప్పు డిదంతయు వట్టి జాతిభూమి. చెట్టుచేమ

లేవియు పెరుఁగవు; నీరుకూడ దొరకదు. అందువలన మానవ నివాసమునకు యోగ్యమయినది కాదు. గ్రామమునకు పడుమట నదివైపున ఒకకొండ ఉన్నది. నాగార్జునునికొండమీఁద వలెనే అక్కడకూడ ఇటికగోడలు మొదలయినవి కలవు; కాని గృహనిర్మాణాదుల చిహ్నము లక్కడకూడ కనిపింపలేదు.

ఇక్కడ నుండు పెద్దదిబ్బలన్నియు బౌద్ధావశేషములే; వీటిలో కొన్ని సమప్రదేశపు మైదానమునను, మఱికొన్ని కొండలమీఁదను నున్నవి. అక్కడక్కడ మొన్న మొన్నటి వఱకు నిలిచియున్న శిలాస్తంభమో, శిల్పాలంకృత శిలాఫలకమో అది ప్రాచీన చారిత్రకస్థలమని సూచించుచువచ్చినవి. ఇక్కడి శిథిలావశేషములున్న ప్రదేశము అమరావతీ బౌద్ధసంఘారామప్రదేశముకంటెను పెద్దది. ఈ లోయమధ్య నుండిన నగరము ఒకతట్టున నదిచేతను, వేఱొకతట్టున దుర్గ ప్రాకారాదులచేతను, పశ్చిమోత్తరముల ఎత్తయిన ప్రాకారములతోఁ గూడిన కొండలచేతను పరిరక్షితమైనదగుటవలన ప్రాచీనకాలమున అది శత్రుజనదుస్సాధముగా నుండియుండవలెను. ఆకాలమున సముద్రమునుండి ఓడలు సరాసరి నాగార్జునునికొండవఱకు వచ్చుట కనువుగ నుండునట్లు కృష్ణానది ఇప్పటికన్న వెడల్పుగను, సముద్రము ఇప్పటికన్న దగ్గఱగను నుండియుండవచ్చును. అదియునుగాక ఈ పట్టణమునకును, కృష్ణానదికిని సమీపముననే గల యితర బౌద్ధాధినివేశములగు గోలి, చేజెర్ల, అమరావతి, జగ్గయ్యపేట,

గంటసాల, గుమ్మడిదుఱ్ఱు, బెజవాడ, భట్టిప్రోలు మొదలయినవాటితోను సుకరముగా రాకపోకలు, వ్యాపారము కూడ జరగుచుండియుండవలెను. ఎందువల్లననఁగా, ఈ లోయలో బయలుపడిన స్తంభములు, దూలములు, విగ్రహములు, శిల్పఫలకములు చేయుటలో నుపయోగపడిన పాలఱాతి బండలు స్థానికముగ త్రవ్వి ఎత్తినవియు కావు; కొండల మీఁదినుండి తీసికొనివచ్చినవియు కావు ; అవి నదివెంటనే వచ్చియుండవలెను.

౧౯౨౬ లో ఈ ప్రాంతమున శిథిలమయిన బౌద్ధస్తూపపు దిబ్బయొద్ద ప్రాచీన బ్రాహ్మీశాసనములు గల కొన్ని స్తంభములు కనఁబడుటవలన ఈ స్థలము చాల ప్రాచీనమైన దయియుండునని యూహించి పురాతత్త్వశాఖవారు ఇచ్చట పరిశోధన లారంభించినారు. మొట్టమొదట ఈ ప్రాంతమున ఇట్టి పరిశోధనలు జరిపినవారు యమ్, హమీాద్ ఖురైషి అనువారు. వారక్కడ ఉండి ఒకటి రెండు వారములు మాత్రమే జరిపిన పరిశోధనలకు ఫలితముగ ౧౮ ప్రాచీనశాసనములును, రెండు శిథిలాలయములును, అనేకములమూల్యములగు శిల్పచిత్రములును బయలుపడినవి. వాటిని బట్టి ఇది ప్రాచీన బౌద్ధాధినివేశమని, బౌద్ధకళానిధానమని తేటపడినది.

ఇక్కడ బయలుపడిన శాసనములును, ౧౮౮౨ లో జగ్గయ్యపేఁటలోఁ దొరకిన ప్రాచీన బ్రాహ్మీ శాసనములును కూడ ఇక్ష్వాకువంశ్యభూవరులు వేయించినవి. వాటినిబట్టి

క్రీస్తుశకము మూఁడు, నాలుగు శతాబ్దులలో కృష్ణానదీ ప్రాంతాన ఇక్ష్వాకువంశజులమని చెప్పుకొన్నవారు పరిపాలించుచుండిరని తెలుచున్నది. ఈ శాసనముల ననుసరించియే యిచ్చటి మహాచైత్యమున బుద్ధదాతువు నిక్షిప్తమయినట్లు స్పష్టమయినది. దేశ మరాజకము పాలయినకాలమున ఇచ్చటి మహాస్తూపమును, దానికి సంబంధించిన చిన్న స్తూపములును—నిధినిక్షేపములు వెదకువారివలననో, మఱి యెవరివలననో—నాశనముచేయఁబడినవి. అందువలన నింతవఱకు స్తూప వేదికలు మాత్రమే నిలిచియున్నవి. వాటి పైభాగము లెల్ల నశించిపోయినవి.

సపరివారముగ శంకరాచార్యులవారు ఇక్కడికి వచ్చి బౌద్ధులను తఱిమివేసి రనియు, వారి నిర్మాణములను భగ్నముచేసి రనియు ప్రతీతి: కాని యిది యెంతవఱకు నిజమో తెలియదు. ఆ లోయలో ఈ బౌద్ధనిర్మాణ శిథిలావశేషములు కాన్పించిన ప్రదేశ మంతయు ప్రాచీనకాలమున శంకరాచార్య మతమునకు దాన మిచ్చినదని తెలియుచున్నది. ఇప్పటికి నది తన్మతాధిపతులకే చెందియున్నది. వారి యనుమతితోనే ఇక్కడ పురాతత్వ పరిశోధకశాఖవారు త్రవ్వుపని జరిపియున్నారు.

ఇక్కడ నల్లఱాళ్ళబోడనుకొండమీఁదనున్న ఆలయము చప్టామీఁది శాసనమువలన సింహళద్వీపమునుండి బౌద్ధభిక్షువులు వచ్చి యీ కొండమీఁద నివసించుచుండినట్లును, వా రచట నొక స్తూపమును, సంఘారామమును నిర్మించి

నట్లును, పడుమటిదిశ పొరుగున విజయపురి యను పట్టణ ముండినట్లును తెలియుచున్నది. నల్ల రాళ్ళబోడుకు దగ్గఱగా చాల చిన్న కొండ లున్నవి. వాటి శిఖరాలమీఁద చిన్న స్తూపముల శిథిలశేషములు చూపట్టును. మహాస్తూపమునకు తరువాత ముఖ్యమయిన నిర్మాణము లన్నియు నల్ల రాళ్ళబోడు మీఁదనే యున్నవి. దీనిమీఁద త్రవ్వఁగా రెండుస్తూపములు, ఒక చైత్యాలయము, సంఘారామములు, దానికి సంబంధించిన సున్నము, ఇటికతో కట్టిన గృహములు ఉన్నవి. ఈ నల్ల రాళ్ళబోడే, 'శ్రీపర్వత' మను పేర వ్యవహృతమయినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. 'శ్రీపర్వత' సంఘారామ మున నే మహాయానమత సంస్థాపకులయిన నాగార్జునాచార్యులవారు తమ చరమదశ గడపినట్లు టిబెత్తు బౌద్ధగ్రంథ ములవలనఁ దెలియుచున్నది. ఇచ్చట బుద్ధధాతువు నిక్షిప్త మయి, యిది పవిత్రక్షేత్రమగుటచేతను, నాగార్జునాచార్యుల వారి కిది నివాసస్థలమగుటచేతను దూర దేశములయం దుండి నట్టియు, ద్వీపములయం దుండినట్టియు, బౌద్ధుల కిది గొప్ప యాత్రాస్థల మయ్యెనని యూహింపఁదగియున్నది.

నాగార్జునుని కొండస్తూపము ఇటికతోను సున్నము తోను కట్టిన ఒక మహానిర్మాణము. శాసనములం దిది 'మహా చైత్య' మనుపేరఁ బరగుచున్నది. అండాకృతిగల స్తూప భాగము అయిదడుగుల యెత్తును, ౧౦౨ అడుగుల వ్యాస మునుగల గుండ్రని వేదికమీఁద నిర్మితమైనది. నాశనము కాఁగా ఇప్పటికి మిగిలియున్నదెల్ల ఈ వేదికచుట్టు ప్రదక్షిణము

చేయుటకు పదుమూఁడడుగుల వెడల్పుగల ప్రదక్షిణపథము. దీనిని చుట్టి ప్రాయికముగ అయిదడుగుల యెత్తుగల యిటిక గోడ-ప్రాకారము కలదు. ఈ ప్రాకార రేఖలో నాలుగు వైపుల ఒక్కొక్కటి పదునాలుగడుగుల వెడల్పుగల నాలుగు ద్వారము లున్నవి. వీటి పునాదులుమాత్రమే ఇపుడు మిగిలి యుండుటచేత ఇవి ఎట్లుండెడివో తెలిసికొన సాధ్యము కాదు. మొత్తముమీఁద ఈ నిర్మాణమును బౌద్ధులు ధర్మచక్రము నమూనామీఁద కట్టినట్లు తోఁచుచున్నది. ప్రాకార రేఖ చక్రము ; ప్రదక్షిణమార్గము ఆకులు ; వర్తుల వేదిక చక్రపు నడిగుబ్బ.

ఈ స్తూపము నుత్తరభాగమున త్రవ్వఁగా పగిలి పోయిన ఒక కుండలో రజతకరండమున బుద్ధధాతువు కనిపించినది. ఇది బుద్ధుని దేహమని తలంచుచున్నారు ; ఇది బటాణీ గింజంత పరిమాణముగల యొక చిన్న యెముకముక్క ; దీనిని ముప్పాతిక అంగుళము వ్యాసముగల ఒక బంగారు బరిణెలో పెట్టి మఱల నాబరిణెను బంగారు పువ్వులు ముత్యములు మొదలైనవానితో గలిపి స్తూపాకారముననున్న ఒక రజత కరండమున నుంచి పదిలపఱచినారు. కుండలో నున్నది ఈ రజతకరండమే. దానికి దెబ్బ తగులకుండునట్లు కుండనిండ ఎఱ్ఱమట్టి పోసి గట్టిచేసి, దానిమీఁద మూతిదగ్గఱ స్ఫటికపు బూసలను గ్రుచ్చినారు. ఈ విధముగ భద్రపఱచినను కుండయు, రజతకరండమును భగ్నమయినవి. కొంతకాలము క్రిందట, పూర్వము మృగదావ మనఁబరగిన సారనాథక్షేత్ర

మును నేఁటి బౌద్ధులు 'మూలగంధకుటీవిహారము' నిర్మించి ప్రవేశోత్సవము జరిపినసందర్భమున అచ్చటి బౌద్ధభిక్షుసంఘమునకు మన గవర్నమెంటు పురాతత్వశాఖవారు ఈ మహాచైత్యమున దొరికిన బుద్ధధాతువును దానముచేసినారు. ఈ విధమున ఇప్పటికి రమారమి పదునాఱువందల సంవత్సరములకు పూర్వము ఇక్ష్వాకువంశ్య భూపతుల రాజ్యకాలమున ఇచ్చటి మహాచైత్యమున నిక్షిప్తమయిన బుద్ధభగవానుని ధాతుశకలము నేఁటికిని సార్నాథ్ మూలగంధకుటీవిహారమున పదిలముగ నుండి పూజ లందుకొనుచున్నది.

౧౯౨౭-౨౮, ౧౯౨౮-౨౯ సంవత్సరములలో ఈ ప్రాంతమున జరిగిన త్రవ్వుపనివలన మూఁడు సంఘారామములును, ఆఱు చైత్యాలయములును, అనేకములు స్తూపములును బయలుపడినవి. బౌద్ధభిక్షువులు వసించు ప్రదేశమును సంఘారామ మందురు. సంఘారామములు మూఁటిలో రెండు నల్లఱాళ్ళబోడుమీఁద నున్నవి; మూఁడవది నల్లఱాళ్ల బోడుకు పడుమటగ దాదాపు మైలుదూరమున నది కెదురుగనున్న కొండమీఁద నున్నది.*

ఇచ్చటి స్తూపము లన్నిటిని ఇటికతో కట్టినారు. స్తూపవేదికల ముందుభాగమున వివిధములయిన శిల్పచిత్రములు చెక్కిన శిలాఫలకములను పేర్చి సున్నముతో అతికినారు. సుందరములయిన ఇట్టి శిల్పఫలకములు వందకుపైగా దొరకి

* [పై నాగార్జునుని కొండవివరణము గవర్నమెంటు పురాతత్వశాఖవారి నివేదిక ననుసరించి.]

నవి. ఈ ఫలకములమీఁది శిల్పకళ యంతయు ఇదివఱలో చెప్పినట్లు అమరావతీ కళాసంప్రదాయము ననుసరించినదే. ఇట్టి శిల్పఫలకములే కాక చెక్కడపుఁబనితో ముద్దులు మూట గట్టు శిలాస్తంభములు మొదలయినవికూడ కొన్ని దొరకి నవి. ఈ శిల్పసంపద నంతను అచ్చటనే యొక చిత్రవస్తు ప్రదర్శనశాలలో నుంచి భద్రపఱిచియున్నారు.

సాధారణముగ స్తూపపు ఱాలమీఁద చెక్కు చిత్ర ములు బుద్ధుని జీవితమునకు సంబంధించిన గాథలో, బుద్ధుని పూర్వజన్మములకు సంబంధించిన గాథలో అయియుండును. బుద్ధుని పూర్వజన్మములకు సంబంధించిన గాథలనే జాతకకథ లందురు.

అమరావతీ, నాగార్జునునికొండ స్తూపపు కళా సంప్ర దాయమే జావా (యవద్వీపము) యందలి జగత్ప్రసిద్ధమయిన బోరోబొడోరుస్తూపశిల్పకృతులలో కానవచ్చునని కళాభి జ్ఞులు చెప్పుదురు. అమరావతీ, నాగార్జునునికొండ స్తూపముల యందలి బౌద్ధకళాప్రభావ మొక్క బర్మా, జావా మొదల యిన సమీపస్థ ప్రాగ్దేశ, ద్వీపములయందలి కళమీఁదనే కాక చీనా దేశపు కళమీఁదకూడ నుండెనట్లు ఈ క్రిందిపంక్తుల వలనఁ దెలియుచున్నది :

"If we turn to the sculptures from Nagarjuni-konda we may observe in them essential features of style and composition which correspond to those pointed out in the relief from Non-Hsiang T'ang. The

Nagarjunikonda relief is composed in a similar fashion, though with greater freedom and far more movement in the figures. It is particularly interesting to us as an example of South India Sculpture of the third or fourth century presumably exercised decisive influence on the Buddhist art of Funan, from where it may have been transmitted to China in a somewhat modified form."

పూర్వోదాహృత పంక్తులననుసరించి బౌద్ధయుగము నాఁటి ఆంధ్రకళ ప్రాగ్దేశకళ కెట్టి విశిష్టత కలిగించినదో, దీని ప్రభావ మెంతవఱకు ప్రాఁకినదో సుకరముగా గ్రహింప వచ్చును.



# చీనా, హిందూదేశములు; వాని ప్రాచీనానుబంధము

[చీనా జపాను దేశములకు యుద్ధము చాల తీవ్రముగా జరుగుచున్నది. చీనామీఁద జపాను కత్తి కట్టి దండెత్తుటకు జపాను సామ్రాజ్యకాంక్ష, రష్యా సామ్యవాదభయముతక్క వేఱు కారణములు కనఁబడవు. బలముకలవానిదే రాజ్యమనుసూత్రము జపానుది. తమ తమ రాజ్యములను పెంపొందించుకొనఁ నభిలషించు ప్రతిజాతియు ఈసూత్రమునే ఆధారపఱుచుకొనును; సభ్యత ముదిరినకొలఁది అసలు సూత్రము కనఁబడకుండ పైపూఁతలు పూసి ఏవేవో ధర్మపన్నము లేకరువు పెట్టుచుండును. సామ్రాజ్యవాదదేశములును, జాతులును చేయుపనే యిది. కాని బుద్ధిమంతులైనవారికి పూఁత ఏదో సూత్ర మేదో తెలియకపోదు.

భారతవర్ష గురుపదము నధిష్ఠించి, అఖిలభారతజాతిచేతను గురుదేవుఁడని కొండాడఁబడుచున్న మహర్షి రవీంద్రనాథ టాకూరు తన ఆరోగ్య మింకను చక్కఁబడినదో లేదో వెంటనే లేచి చీనామీఁదికి కత్తి దూయుట అధర్మమని జపానును తర్జించినాఁడు. మేము మీకీ విపత్సమయమున తగినట్లు తోడ్పడలేకున్నామని కాంగ్రెస్ ప్రెసిడెంటు జవహారిలాల్ నెహ్రూ చీనాదేశీయులకు సందేశ మంపినాఁడు. భారతవర్షము చీనాకష్టసమయములో ఎంతో సానుభూతిచూపించుచున్నది;

ఎందువలన ? అన్యాయమును నిరసించుట, ధర్మనిర్ణయము చేయుట భారతవర్షము ప్రాచీనకాలమునుంచి నేర్చిన, అవలంబించుచువచ్చిన నీతి యైనది.]

కడుప్రాచీనకాలముననుండి హిందూదేశము ధర్మపథమవలంబించి ధర్మార్థ్యమై వాసికెక్కినది. ఈ ధర్మాభిరతికతన హిందూదేశ మెప్పుడును విదేశములమీఁద కత్తిదూసి యుండలేదు. ఇప్పటికి రెండువేలేండ్లక్రిందట కూడ భారతవర్షము గౌరవించిన ధర్మ మిదే. 'ఇండికా'యనుగ్రంథమున క్రీస్తుశకము రెండవ శతాబ్దినాఁటి ఏరియాన్ అను విదేశీయుఁడు వ్రాసినాఁడు హిందూదేశ సీమావధుల నతిక్రమించి పరదేశములను జయించుటకు భారతీయుల కీ ధర్మాభిరతియే యడ్డువచ్చుచున్నదని. ఈకారణముననే అంతటి ప్రాచీనకాలముననుండి భారతవర్షము ఆసియాఖండమున కంతకు ధర్మనిర్ణేతగా, ధర్మాధర్మ నిర్ణయముచేయు ధర్మాసనముగా విరాజిల్లుచువచ్చుచున్నది. కేవల మీ ధర్మాభిరతికతముననే ఆసియాఖండదేశముల కొజ్జయై ధర్మోపదేశము చేసి, ధర్మసంస్కృతిపథము చూపి భారతవర్షము వానిని చక్కదిద్దినది.

ఆసియాఖండదేశము లన్నిటిలోను ప్రాచీన భారతవర్షమును శతాబ్దుల, సహస్రాబ్దులతరబడి అంటిపెట్టికొని యుండి భారతవర్ష ధర్మామృతమును గ్రోలి ధర్మసందేశము నవబోధముచేసికొన్నది ప్రధానముగా చీనాదేశము. చీనాకు హిందూదేశమునకు నున్న అనుబంధము ఈనాఁటిది యిప్పటిది కాదు; అతిపురాతనమైనది.

## బుద్ధదేవుని సందేశము :

అప్పటి కింకను హిందూదేశ చరిత్రాకాశమున వెలుఁగురేకలు తోఁచి తూర్పు పాటూరుచున్నదో లేదో - బుద్ధుని యవతారము పరిసమాప్తమయినది. ప్రజలు బుద్ధభగవానుని సందేశము నాకళించుకొని యవబోధము చేసికొనుచున్న దినములవి. క్రమముగా భూపతులును శ్రమణులును గూడ బుద్ధదేవుఁడు బోధించిన ధర్మసూత్రముల ప్రాశస్త్యమును గుర్తెఱింగి వాటిని అఖిలదేశముల ప్రజలకు వినిపించి, మర్త్యలోకములోని దుఃఖమును బాపి, దానిని అమరలోకముగ దిద్దవలెనని పూన్కి వహించిరి. బుద్ధుని ధర్మసందేశము నేల నాలుగుచెఱఁగుల వినిపింపఁజేయుటకు మౌర్యవంశజుఁడయిన అశోకవర్ధన మహీపతి నానాదేశములకు సందేశహరులను బంపెను. పడుమట అటు సిరియాదేశమువఱకు, దక్షిణమున లంకవఱకు, తూర్పున బలి, యవద్వీపములవఱకు బుద్ధభగవానుని సందేశస్రవంతి మందాకినీపూరమువలె వెల్లివిరిసి ప్రవహించినది. ఉత్తరమున హిమాలయమును హిందూకుశ్ పర్వతమును ఆ సందేశతరంగములు ఇంకను ఉత్తరదిశకు పారలిపోకుండ కొంతవఱకు ఆఁకట్టినవి; కాని మానవుఁడు పూర్తిగఁ దలఁచుకొన్నచో ఈ సహజావరోధము లొక లెక్కా ?

ఈ యవరోధములను దాఁటించి బుద్ధ సందేశము నుత్తరదేశములందు ప్రాఁకించిన ఖ్యాతి కుషాణవంశజులకు దక్కినది. కుషాణవంశజులు హిందూదేశము వాయువ్యప్రదేశ

మును వశపఱుచుకొని రాజ్య మేలినవారు. వీరిలో కనిష్క భూపతి విఖ్యాతుఁడు. ఇప్పుడు పెషావరు అని వ్యవహరింపఁ బడుచున్న పురుషపురము ఇతని రాజధాని. ఇతఁడు మహా సాహసముతో హిందూకుశ పర్వత పంక్తిని దాఁటి యార్కండ్, ఖోటాన్, క్యాష్గర్ దేశములను తన బల పరాక్రమములవలన జయించినట్లు చెప్పుదురు. ఈ కుషాణ భూవరునినాఁడు మధ్య ఆసియావఱకు వ్యాపించిన హిందూ సామ్రాజ్యమునకు చీనారాజ్యము పొలిమేరసీమ యైనది. చీనా దేశీయులకును భారతీయులకును సంసర్గ మేర్పడినది.

## రెండవ అశోకవర్ధనుఁడు :

కనిష్కుఁడు మహాబౌద్ధమతాభిమాని. బౌద్ధమునకుఁ జేసిన సేవ ననుసరించి యితనిని రెండవ అశోకవర్ధనుఁ డన వచ్చును. ఇతఁడు పరిపాలించుచుండినకాలమున బౌద్ధమతా వలంబకుల పరిషత్తు ఒకటి సమావేశమైనది. బౌద్ధుల నాదరించి కనిష్కమహారాజు బౌద్ధమున కెక్కువ ప్రోత్సాహము నొసంగెను. బౌద్ధమతచారిత్రమున కనిష్కుని రాజ్యకాలము ఒక స్మరణీయమయిన ప్రకరణము.

కుషాణభూపతు లిచ్చిన యాదర, ప్రోత్సాహముల వలన బౌద్ధభిక్షువులు తమ మతమును మధ్య ఆసియాలో కూడ వ్యాపింపజేయుట కక్కడికి వలసవెళ్ళిరి. ప్రాచ్యపరిశోధక పండితు లీమధ్య, మధ్యఆసియాఖండసీమను వెదకగా అచ్చట క్రీస్తుశకము మొదటి శతాబ్దులనాఁటి బౌద్ధగ్రంథములు భూర్జపత్రములమీఁద హిందూదేశలిపులలో వ్రాసినవి

ఎన్నో దొరకినవి. మధ్య ఆసియాఖండ ప్రాంతమునుంచి బౌద్ధము చీనా దేశములకు వెళ్ళినది.

బౌద్ధము చీనా దేశమునకు ఎప్పుడు వెళ్ళినదో నిశ్చయముగా మనకు తెలియదు. కాని హిందూ దేశమును గుఱించి మొదటిమాఱు చీనా తెలిసికొనుట బౌద్ధమువలననే. అంత వఱకు చీనాసంగతి హిందూ దేశమునకు, హిందూ దేశము సంగతి చీనాకు ఏమియు తెలియదు. హిందూ దేశము మొదట చీనాకు మిత్రునివలె ధర్మోపదేశము చేయుటకు వెళ్ళినది. తరువాత హిందూ దేశ మిచ్చిన ధర్మసందేశము విలువను గుర్తించి చీనా దానిని గురుపీఠముమీఁద నిలిపినది.

## చీనాలో భారతీయ బౌద్ధాచార్యులు:

మధ్య ఆసియానుంచి కట్టలు కట్టలకు బౌద్ధగ్రంథములను, తాము పూజించు బౌద్ధవిగ్రహములను గుఱ్ఱముల మీఁదఁ వేసికొని హాన్ చక్రవర్తి మింగ్ టి కాలములో క్రీస్తుశకము ౬౭ ప్రాంతమున చీనారాజధానిని చేరినవారు కాశ్యపమాతంగుఁడు, ధర్మరత్నుఁడు అను నిరువురు బౌద్ధాచార్యులు. చక్రవర్తి వీ రిరువురికి సాదర మయిన స్వాగతము చెప్పెను. వీరి నిమిత్త మొకచిన్న విహారమును గట్టించెను; ఆ యమూల్యనిక్షేపములు – బౌద్ధ గ్రంథములను, విగ్రహములను–మోసికొనివచ్చిన గుఱ్ఱముజ్ఞాపకార్థము ఆ విహారమునకు శ్వేతాశ్వవిహారమని నామకరణము చేసెను. ఆ యాచార్యులు చీనాచక్రవర్తి యాదరాభిమానములను పొంది ఆబౌద్ధ

గ్రంథములను చీనాభాషలోని కనువదించుటకు మొదలు పెట్టిరి.

కాశ్యపమాతంగుఁడు రచియించిన 'బుద్ధుని నలువది రెండు సూత్రములు' అనుగ్రంథమే చీనాదేశీయుల యుత్తరోత్తర బౌద్ధవిజ్ఞానమునకు పునాది. అటుతరువాత రెండవ, మూఁడవ శతాబ్దులనుండి భారతీయ బౌద్ధాచార్యులు చీనాదేశమునకు వెళ్లుచువచ్చిరి. వెళ్ళినవారు చీనాదేశీయులను బౌద్ధ మతావలంబకులను జేయుటకుమాత్రము ప్రయత్నించియుండలేదు. బౌద్ధ ధర్మప్రశస్తిని చీనాదేశీయులకుఁ దెలుపుట, బౌద్ధగ్రంథములను చీనాభాషలోని కనువదించుటయే వృత్తిగా పెట్టుకొని పనిచేసినారు వారు. హాన్ వంశము (క్రీ. పూ. ౨౦౬ మొదలు క్రీ. శ. ౨౧౮ వఱకు) పతనము నొందునాఁటికి బౌద్ధగ్రంథములు చీనాభాషలోనికి మూఁడు వందల యేఁబదికంటె నెక్కుడుగనే అనూదితములైనవి.

అప్పటికి చీనాదేశమున కన్‌ఫ్యూషియస్ అనుమహనీయుఁడు ప్రవచించిన 'కాన్‌ఫ్యూషియానిజము,'లోసీ యను మహాపురుషుఁడు ప్రతిపాదించిన 'టోయిజము' అను రెండు మతసంప్రదాయములకు బహుళప్రచారముండెను. ఈ రెండు మతములును నికరమైన చీనాగడ్డలో పుట్టి సంపూర్ణాధిపత్యముకొఱకుఁ బోరాడుచుండిన కాలమున చీనాలో ప్రవేశించినది మూఁడవమత సంప్రదాయము బౌద్ధము. చీనాదేశము బౌద్ధము నెట్లాదరించినది?

## బౌద్ధమునకు విశేషప్రచారము :

క్రీస్తుశకము ౨౯౬, ౪౦౯ సంవత్సరముల నడిమికాలమున బౌద్ధము చీనాదేశమున బాగుగ నాటుకొనిపోయినది. బౌద్ధమతసిద్ధాంతములు ప్రజాహృదయమును చూఱగొన్నవి. ఇందుకు భారతీయ బౌద్ధభిక్షువులు చేసిన అవిరళకృషి, స్వార్థత్యాగము – ఇవే కారణములు. క్రీస్తుశకము ౩౪౦ కి పూర్వమే బౌద్ధము చీనాదేశీయుల ప్రధానమత మయినది. మొట్టమొదట అది యాంగెట్సికియాంగ్ నది కుత్తరమున నున్న మండలికరాజ్యములలో ప్రవేశము కలిగించుకొని వాటిని వశపఱచుకొనెను. ఔత్తరాహులయిన మండలికులలో నొకఁడయిన షిచీ లుంగ్ అనునతఁడు బౌద్ధుల కాశ్రయమిచ్చి యాదరించెను. భారతీయ బౌద్ధాచార్యులు ఎంతటి మతప్రచారము కావించినను అతనికాలమువఱకు చీనాదేశీయులు అక్కడి కట్టుబాటుల ననుసరించి బౌద్ధధర్మానుగుణముగ జీవితమును గడపు ఉపాసకులుగమాత్రమే యుండవలసివచ్చెను కాని ఇష్టమున్నవారు పరివ్రాజకులగుటకు వీలులేకపోయెను. నాలుగవశతాబ్ది పూర్వార్థమున నీమండలికుఁడు షిచీ లుంగ్ అట్టి నియమములను రద్దుపఱచి చీనాదేశీయులుకూడ శ్రమణు లగుట కవకాశము కల్పించెను.

చీనాదేశ బౌద్ధమతచారిత్రమున షిచీ లుంగ్ నిర్ణయముతో ఒక నూతనప్రకరణ మారంభమైనది. చీనాబౌద్ధమున ఒక గొప్పమార్పు సంభవించినది. దానికి స్వాతంత్ర్యము చేకూరినది. ఇంతటినుండి బౌద్ధమతమును ప్రచారము చేసిన

వారును, బౌద్ధసంఘమును బరిపాలించినవారును చీనా దేశీయులే. ఇట్లనుటచేత భారతీయబౌద్ధాచార్యులకును, చీనా బౌద్ధశ్రమణులకును సంబంధము తెగిపోయినదని భావింప రాదు. చీనాబౌద్ధమున కుత్సాహము నొడఁగూర్చినదియు, శక్తి నొసఁగినదియు మధ్య ఆసియా భారతీయ బౌద్ధపరి వ్రాజకమండలియే. చీనా దేశీయులు బౌద్ధమును తమది కావించుకొని దానిని వ్యాపింపఁజేయుటకు పూనిక వహించిరి.

## ఖైదియే మతప్రచారకుఁడు :

బౌద్ధమతము నెడల చీనామండలికులును ప్రజలును చూపుచువచ్చిన యాదరాభిమానములకు కాఙ్ ఫ్యూషియను మతస్థులును టావోయిస్ మతస్థులును కడు పుడికి కుమిలిపోవు చుండఁగా, ఎవ రనుకొన్నారు – మధ్య ఆసియాసీమయందలి నగరములు ముట్టడించి యొక చీనా సైన్యాధ్యక్షుఁడు ఖైదీగఁ దీసికొనివచ్చిన భారతీయ బౌద్ధాచార్యుఁడు కుమారజీవుని వలన చీనాబౌద్ధమునకు క్రొత్తచైతన్యమును, క్రొత్తశక్తియుఁ గలుగునని? నాలుగవశతాబ్ది యంత్యకాలమున బంధితుఁడుగ వచ్చిన కుమారజీవుఁడు చీనాకు మహాబౌద్ధాచార్యుఁడై చీనా దేశీయుల ప్రణతు లందుకొన్నాఁడు; మూఁడు వేలమంది చీనా దేశీయుల లతనికి శిష్యులై యతని చరణకమలములను బూజించి యుపదేశము నొందిరి. ఆచార్యకుమారజీవుఁడు ఏఁబది యొకువది గ్రంథములవఱకు చీనాభాషలోని కనువ దించెను. ఇట్లు చీనాభాషలోనికి పరివర్తితములైన గ్రంథము

లకు విశేషప్రచారము కలిగి బౌద్ధము చీనాలో సుస్థిరముగ పాదుకొనిపోయెను.

చీనాదేశమున అమితాభుఁడను పేరుగల బుద్ధునిపూజ హెచ్చినది. బౌద్ధమున గొప్పమార్పు తెచ్చిన మహాయానసంప్రదాయమున బుద్ధులు లెక్కలేనంతమంది గలరు. వీరిలో అమితాభబుద్ధుఁడొకఁడు. ఒక్కొక్క బుద్ధుని కొక్కొక్కస్వర్గము కలదు. అమితాభుఁడు సుఖావతీస్వర్గాధిపతి. తన్ను విశ్వాసముతో భక్తితో నుపాసించువారును, తన పేరు జపించువారును, పంచమహాపాతక సంయుక్తులును— బౌద్ధమతదూషకులు కానిచో— అట్టివారికి సుఖావతీస్వర్గప్రాప్తి కలుగఁజేయుదునని అమితాభబుద్ధుని శపథము; అట్లు చేయనిచో తాను బుద్ధత్వమునే నిరాకరింతునని ఆయన ప్రతిన. చీనాదేశీయుల హృదయము సథికముగ ఆకర్షించిన వాఁడు ఈ భక్తపరాధీనుఁడైన అమితాభబుద్ధదేవుఁడు.

చీనాభాష కనూదితములయిన బౌద్ధగ్రంథముల ప్రచారప్రాబల్యమున చీనాదేశమున నూతన బౌద్ధసంప్రదాయములు వెలసినవి. ఇట్టి సంప్రదాయములలో మొట్టమొదటిదియు, అతి ప్రాచీనమైనదియు పుండరీక సంప్రదాయము; చీనాదేశమున వేఱు తన్ని భారతీయబౌద్ధపల్లరి పూచిన తొలిపూవు. ఈ సంప్రదాయములు బౌద్ధమునకు చీనాలో నాలుగుదెసల చలువపందిళ్లు వైచి పచ్చనితోరణములు కట్టినవి.

## ఇతర విజ్ఞానవ్యాప్తి :

చీనాదేశమున బౌద్ధ మింతటి ప్రచారమునకు వచ్చి చీనాదేశీయుల హృదయముల నాఁకట్టిన కాలమున ఒక్క మతమేనా యచ్చట వృద్ధినొందినది ? భారతీయ బౌద్ధాచార్యులు తమతోఁ గొనిపోయినది ఒక్క మతవిజ్ఞానమును మాత్రమే కాదు; అప్పటివఱకు తమ మాతృదేశమున ప్రబలిన ఇతర విజ్ఞానమునుగూడ చీనాదేశమునకుఁ దీసికొనిపోయి యచ్చట పైరుపెట్టినారు. ఈ కారణమున చీనాదేశమున బౌద్ధము ప్రబలముగ వ్యాప్తిచెందిననాఁడు జ్యోతిషవిజ్ఞానము కూడ ప్రబలినది. హిందూజ్యోతిశ్శాస్త్ర విజ్ఞానము నాధారపఱచుకొని చీనాదేశీయులు తమ జ్యోతిశ్శాస్త్రము నభివృద్ధి చేసికొనిరి. జ్యోతిశ్శాస్త్రమునే గాక భారతీయ బౌద్ధాచార్యులు అంకగణితమునందలి దశమాంశపద్ధతినిక్కూడ చీనాదేశమునఁ బ్రవేశపెట్టిరి. వారు చీనా శబ్దశాస్త్రపరిణామము నకుఁగూడ చాల తోడ్పడిరి.

హాన్ వంశము పతనమునొందిన చాలకాలమువఱకు చీనాలో బౌద్ధమతము నాదరించినవారు ఉత్తరాదిమండలికులే. దక్షిణ చీనాదేశము తన దేశీయమతముల నాదరించి బౌద్ధముమీఁద నప్పుడప్పుడు దండెత్తుచుండెడిది. అప్పటికిని బౌద్ధ మాదాడులకు నిలఁద్రొక్కుకొని నడుమ నడుమ దక్షిణ చీనారాజన్యులను సైతము కూడఁగట్టుకొని యాంగెట్సినది కుభయతీరముల నభివృద్ధిపొందుచునే వచ్చినది. ఈ కాలముననే ఫాహియాన్ అను చీనాదేశీయుఁడు భక్తివినమ్రుఁడై

బుద్ధభగవానుని జన్మదేశమును సందర్శించి భారతీయ బౌద్ధాచార్యులవలననుండి ధర్మవిశేషములను తెలిసికొనఁగోరి హిందూదేశమునకు యాత్ర కావించెను.

## ధ్యాన సంప్రదాయము :

ఈ యాత్రికుఁ డిటు హిందూదేశమునకు వచ్చుచుండఁగా బోధిధర్మపరివ్రాజకాచార్యుఁడు హిందూదేశమున నుండి బౌద్ధగ్రంథములను మూటగట్టుకొనిపోయి యట చీనా దేశమునఁ దన ధ్యానసంప్రదాయమును బ్రచారము కావించెను. చీనా బౌద్ధసంప్రదాయము లన్నిటిలో ఈ ధ్యాన సంప్రదాయమునకే ప్రచార మెక్కువ. దీనిని చీనాదేశమున చాన్ సంప్రదాయ మందురు. ఈ సంప్రదాయమును నెలకొల్పిన బోధిధర్మాచార్యుఁడు దక్షిణ హిందూదేశీయుఁడగుట మనకు గౌరవము. ఈ యాచార్యోత్తముని దక్షిణ హిందూదేశము విస్మరించినది కాని చీనా, జపాను దేశములు మాత్ర మిప్పటికి భక్తితో, ప్రీతితో సంస్మరించుచుండును.

బోధిధర్మాచార్యుఁడు క్రీ. శ. ౫౨౦ లో కాంటన్ పట్టణమున ఓడ దిగినాఁడు. బోధిధర్మాచార్యులవారి కాలమున చీనాదేశమున బౌద్ధము బాగుగా వ్యాపించినది. క్రీ. శ. ౫౩౦ నాఁటికి ఒక్క యుత్తరచీనాదేశముననే పదుమూఁడు వేల బౌద్ధాలయము లుండెనట : ధ్యానసంప్రదాయము చీనాలో బౌద్ధమతవ్యాప్తి నింకను ఎక్కువచేసినది.

కాలక్రమమున బౌద్ధము ఉత్తర చీనాదేశమున క్షీణించి దక్షిణ చీనాదేశమున వర్ధిల్లినది. అప్పటికి చీనా

దేశమున ననేకములుగ వెలసిన బౌద్ధసంప్రదాయములలో దేని కది తనదే సత్యమార్గమని, ఇతరసంప్రదాయములవి సత్యమార్గములు కావని వాదులాట లారంభమైనవి. ఇవ న్నియుఁ జూచి యీ మతసంప్రదాయము లన్నిటను గల ప్రధాన ధర్మవిషయములను క్రోడీకరించి యొక నవీన సంప్ర దాయమును వెలయించినాఁడు చీ కాయ్ అను పరివ్రాజ కాచార్యుఁడు. దీనికి 'టీన్ టాయ్' సంప్రదాయమని పేరు.

'టీన్ టాయ్' సంప్రదాయము చీనాదేశపు చిత్ర కళకు గొప్పజీవముపోసినది. ఈసంప్రదాయము టాంగ్ వంశము వారియుండను వర్ధిల్లుచున్నకాలమున చీనాచిత్రకళకు స్ఫూర్తి యే కాక విశిష్టతకూడ చేపడినది.

టాంగ్ వంశమువారి కాలము (క్రీ. శ. ౬౧౮–౯౦౭) నను, ఈ వంశము పతనమునొందినతరువాతి రెండు శతాబ్దుల లోను చీనాదేశమున బౌద్ధము గొప్పయుచ్ఛదశ నొందినది. ఆకాలమునఁగూడ 'కన్ఫ్యూషియస్' మతము, 'టాయ్' మతము – ఇవి రెండును బౌద్ధముపైఁ గత్తిగట్టుచునేవచ్చినవి. ఆదినములలో ఆయామతముల వృద్ధిపతనములు ఆయాయి చక్రవర్తుల యాదరాభిమానముల ననుసరించి యుండెడివి. 'టాయ్' మతాభిమానియైన వూసంగ్ చక్రవర్తి ౪౬౦౦ ల బౌద్ధవిహారములను, ౪౦,౦౦౦ ఇతర బౌద్ధనిర్మాణములను విధ్వంసముకావించి అనేక బౌద్ధదేవతావిగ్రహములను కరఁ గించివైచి, ౨,౬౦,౦౦౦ మంది బౌద్ధభిక్షుకులను బౌద్ధమత మును విడుచుటకు హింసించెనఁట! ఈవిధమయిన విప్లవ సంక్షోభములలో బౌద్ధమున కొకప్పుడు క్షీణదశ కలిగినను,

మజల నది ఏచక్రవర్తి యాదరాభిమానములనో చూఱగొని విజృంభించుచునేయుండెడిది.

టాంగ్ వంశమువారికాలమున హిందూదేశము చీనా బౌద్ధభిక్షువులకు పవిత్రమైన యాత్రాస్థలమైనది. చీనా దేశీయులైన బౌద్ధు లనేకులు హిందూదేశమునకు వచ్చి తక్షశిల, నాలంద, ధాన్యకటకాది విహారములలోఁ గొంతకాలము వసించి, అచ్చటి ఆచార్యుల సన్నిధిని వివిధభారతీయ బౌద్ధ సంప్రదాయములకుఁ జెందిన గ్రంథముల నధ్యయనముచేసి, వారివలననుండి ధర్మసూక్ష్మము లనేకములను దెలిసికొని, బౌద్ధగ్రంథము లనేకములను దమ భాషలోని కనువాదము సేయుటకు హింధూదేశమునుండి చీనాదేశమునకుఁ దీసికొని పోవుచువచ్చిరి. హిందూదేశచరిత్రపాఠకులకు సుపరిచితులైన యువాన్ చాంగ్, ఇట్సింగ్ ప్రభృతులు ఈ కాలమువారే.

## బౌద్ధగ్రంథ ముద్రణము :

టాంగ్ వంశమువారి పరిపాలనకాలమునాఁటి బౌద్ధము కారణముగా వర్ధిల్లినది – అదికళయైననేమి, పరిశ్రమయైననేమి – 'దిమ్మెల అచ్చుపని.' అచ్చును కనిపెట్టినవారు చీనా దేశీయులు. దానిని మొదట వారు ప్రాయికముగ రక్షరేకులు, తాయెతులవంటివి ముద్రించునిమిత్తము కనిపెట్టియుందురని చెప్పుదురు. బౌద్ధులు తమ విహారములలో ఈ యచ్చుపనిని చక్కఁగా వినియోగమునకుఁదెచ్చిరి. బౌద్ధమతవ్యాప్తి అతిశయించినకొలఁది దేశమున బౌద్ధగ్రంథములకొఱకు తృష్ణ అధికమయినది. ఈ

తృష్ణను తీర్చునిమిత్తము బౌద్ధశ్రమణులు 'దిమ్మల యచ్చు' (Block-printing) పద్ధతిని అభిమానించిరి. సంగ్ వంశమువారి పరిపాలనము (క్రీ. శ. ౯౬౦-౧౨౮౦) ప్రారంభకాలమున, అనఁగా ౯౬౨ ప్రాంతమున బౌద్ధమత వేదగ్రంథములైన 'పిటకము'లు పైని చెప్పిన పద్ధతిని చీనాలో అచ్చుపడినవి, ఈ భౌద్ధ 'పిటక' వాఙ్మయమున ౧౫౨౧ విడిగ్రంథము లున్నవఁట. వీటిని మొత్తము ౧,౩౦,౦౦౦ సంపుటములలో నచ్చువేసిరఁట! మొట్టమొదట కాగితముచేయుట కనిపెట్టిన వారును చీనాదేశీయులే. ఈవిధమున గ్రంథముద్రణము ఆరంభమయినది చీనాదేశమున. అన్ని వేల సంపుటముల మత గ్రంథము నచ్చువేసిన బౌద్ధభిక్షువుల కార్యదీక్షయు, మతాభినిరతియు, ఓపికయు నెంతని కొనియాడఁగలము!

బౌద్ధము క్షీణదశ :

సంగ్ వంశానంతరకాలమున బౌద్ధము పూర్వపు ఔన్నత్యమును గోల్పోయినది. సంగ్ వంశజుల యనంతరము చీనాదేశమును బరిపాలించిన మంగోలు చక్రవర్తులు (క్రీ. శ, ౧౨౮౯-౧౩౬౮) చాలమంది బౌద్ధము నభిమానించి పోషించినను క్రమముగా దానియౌన్నత్యము తఱిఁగి పోయినది. మింగ్ (క్రీ. శ. ౧౩౬౮-౧౬౪౪), మంచూ (క్రీ. శ. ౧౬౪౪-౧౯౧౨) వంశములవారి పరిపాలన కాలమునను, చీనా ప్రజాస్వామ్యప్రభుత్వకాలమునను బౌద్ధము క్షీణదశకు వచ్చినది. అయినను శతాబ్దులతరబడి చీనాజాతిని వశపఱుచుకొని ప్రభుత నెఱపినదగుటచేత బౌద్ధధర్మమేదో

రొకవిధముస చీనా నవీనోద్యమములకుఁ దోడ్పడుచునే యున్నది.

చీనా, హిందూ దేశములకుఁ ద్రెంపరాని యనుబంధమును గల్పించినది బౌద్ధము. బౌద్ధము క్షీణదశనొందుటతో ఈ యుభయ దేశములకును సాంస్కృతికముగ నేడఁబాటు కలిగెను రవీంద్రకవిచంద్రుని చీనాదేశ యాత్రతో మఱల సవి పూర్వపుస్నేహమును చిగురింపఁజేసికొన్నవి. ఈయుభయ దేశములమైత్రియు ఒక నూతన సంస్కృతి సంప్రదాయమునకు పునాదులు వైచునని యాశింతము.



# జావా ద్వీపవాసుల వినోదములు : 'వాయంగ్' ఆటలు

మలయా ద్వీపకల్పమునకు దక్షిణమున సుమత్ర, జావా, బలి మొదలయిన ద్వీపము లెన్నో యున్నవి. ఈ ద్వీపములలోను, బర్మా, అనాం, కంబోడియా, సయాం మొదలయిన దేశములలోను క్రీస్తుశకము మొదటి శతాబ్దులలోనే హిందూనాగరకత వ్యాపించి విస్తరించినది. హిందూదేశమునకును, ఆ దేశములకు ద్వీపములకును వర్తకవ్యాపారము అతి పురాతనకాలముననుండి విరివిగా సాగుచుండెడిది. బౌద్ధభిక్షువులు, హిందువులు ఎందఱో ఆ ప్రదేశములకు తమ మతమును వ్యాపింపఁజేసికొనుటకు వెళ్ళినారు. ఈ విధముగా ఆ ద్వీపములందు హిందువులవలసలు ఏర్పడినవి. వా రచట గుళ్ళు గోపురములు కట్టినారు. బౌద్ధము, శైవము, వైష్ణవము అక్కడ కూడ వ్యాపించినవి. ఆ ద్వీపములలో శివాలయములను, విష్ణ్వాలయములను, స్తూపములనుకూడ చూడవచ్చును. అచ్చటివన్నియు మన దేవతామూర్తులే; మన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులే; మన బుద్ధుఁడు, బోధిసత్త్వులే. అంతయు మన శిల్పమే; భారతీయకళే! అక్కడ వ్యాప్తిలోనికి వచ్చిన కథలన్నియు మన పౌరాణికకథలే. మన ధర్మశాస్త్రము లక్కడికి వెళ్ళినవి; మన రామాయణ, మహాభారతాది ఉద్గ్రంథము లక్కడికి వెళ్ళినవి; మన దేవత లక్కడికి వెళ్ళినారు;

తుదకు మన రాక్షసులుకూడ ఆ ద్వీపవాసులను విడువలేదు. అక్కడకూడ అయోధ్య వెలసినది; ఇంద్రప్రస్థమున్నది; సరయువు ప్రవహించుచున్నది. మాల్యవంతము మొదలయిన పర్వతములుగూడ అక్కడికి రెక్కలు కట్టుకొని యెగిరిపోయినవి. మఱల ఆ ద్వీపసమూహము రెండవ హిందూదేశమయినది. అంతయు భారతీయనాగరికతే; అంతయు హిందూ సంస్కృతే. అచ్చటిరాజులు రాజ్యములు స్థాపింపకపూర్వము మన రామచంద్రుడు ఆ భీకరాటవులలో సంచరించినాడు; మన రావణుడు అచ్చటి తపోవనములను విధ్వంసము చేసినాడు; తుదకు పాండవులుకూడ ఆ భయంకర కాంతారములలో దాగి అజ్ఞాతవాసము చేసినారు. ఈ విధముగా మన పౌరాణికవీరు లందఱు ఆ ద్వీపవాసులకుకూడ జాతీయవీరులయినారు. తరువాతికాలములో ఆద్వీపములలో రాజ్యములు స్థాపించిన భూపతు లందఱుకూడ చంద్రవంశమునకు సంబంధించినవారును, యదువంశమునకు సంబంధించినవారును. హిందువులే వా రందఱును. జావా, బలిద్వీపములు హిందూ దేశపు పెంపుడుబిడ్డలవలె అల్లారుముద్దుగా పెరిగినవి.

రామాయణ, మహాభారతాదులు జావాద్వీపవాసుల ప్రాచీన 'కవి' భాషలోనికి అనూదితములైనవి. 'కవి' భాష అనగా కావ్యభాష. ఈ 'కవి' భాషలోని 'ప్రతి పదిమాటలకు' తొమ్మిదిమాటలు సంస్కృతపదములే. హిందూమతావలంబకులగు రాజులు జావాద్వీపమును పరిపాలించిన కాలములో ఈ 'కవి' భాష గొప్ప ఉచ్చదశలో నుండెడిది.

జావాద్వీపవాసుల ప్రాచీన హిందూ ఉద్గ్రంథము లన్నియు ఈ 'కవి' భాషలోనే ఉన్నవి. 'హిందూ' రాజుల పరిపాలనమున రామాయణ, మహాభారతగాథలను ఆద్వీపములలో పదములుగా పాడెడివారు; ఆటలుగా ఆడెడివారు; పద్యములుగా, గద్యములుగా చదివెడివారు. ఈ కారణముచేత జావా, బలిద్వీపములలో రామాయణవీరులనుగుఱించి కాని, భారతవీరులనుగుఱించి కాని తెలియని పసిపిల్లవాఁడుకూడ లేఁడని చెప్పవచ్చును. రామాయణాదులు ఆద్వీపవాసుల హృదయముల నంతగా ఆకర్షించినవి; అవి వారికి ఒక విధమయిన ఆనందమును, శాంతిని ఇచ్చినవి.

'హిందూ' రాజుల పరిపాలనము ఆద్వీపములలో పదునైదవ శతాబ్దివఱకు సాగినది. పదునైదవ శతాబ్దిలో ఆ ద్వీపములు మహమ్మదీయాధికారమునకు లోఁబడి పోయినవి. అంతేకాదు; ఆ ద్వీపములలోని ప్రజ లందఱును ఇస్లాము మతావలంబకులే యైనారు. ఆద్వీపములు ఇప్పటికి అయిదువందల సంవత్సరములనుండి మహమ్మదీయమతమునకు పట్టుగొమ్మలైనవి. అచ్చట మహమ్మదీయసంస్కృతి స్థిరముగా పాదుకొనిపోయినది. అయినప్పటికి నేఁటికికూడ హిందూసంస్కృతి అచ్చట దిగవిడిచిన ముద్రలను మనము విస్పష్టముగఁ జూడవచ్చును. పురాతన హిందూదేవాలయములు, పురాతన హిందూకళలు మన కింకను అచటఁ గానవచ్చును. జావాద్వీపమునందుకంటెనుగూడ హిందూమత, సంస్కృతిచ్ఛాయలు బలిద్వీపమున ఎక్కువగ నిలిచిపోయి

నవి, బలిద్వీపమునను, జావాద్వీపమునను నేఁటికిని ప్రాచీన హిందూసంప్రదాయములను, ప్రాచీన హిందూ పౌరాణిక గాథలను పోషించి పరిరక్షించుచు వచ్చుచున్నవి ఆ ద్వీప వాసుల 'వాయంగ్' వినోదములు.

జావా, బలిద్వీపవాసుల వినోదములలో ప్రధానముగా చెప్పవలసినది 'వాయంగ్' వినోదములు. 'వాయంగ్' అనఁగా బొమ్మలాట. ప్రజలలో దీనికున్న ఆదరము మఱి ఏ వినోద మునకును లేదు. 'వాయంగ్'లో చాల రకము లున్నవి; అందులో ప్రధానమయిన వేవన :

(౧) 'వాయంగ్ వోంగ్' (Wayang Wong) : ఈ ప్రదర్శనము మన దేశములోని వీథినాటకమువంటిది. ఇందు పాత్రగై కొనువార లందఱును నటకులే. వీరు మన వీథిభాగ వతులవంటివారు. దేశమం దంతట పల్లెపల్లెకు పట్టణపట్టణ మునకు పోయి, వీరు వీథినాటకములను ప్రదర్శించుచుందురు. వీ రాడున వన్నియు రామాయణనాటకములును, మహా భారత నాటకములును; చిత్రవిచిత్రములయిన అందమగు దుస్తులను ధరించి 'కవి' భాషలోని రామాయణ, మహా భారతగాథలను చదువుచు, పాడుచు అభినయింతురు. విచిత్ర మేమన జావాద్వీపమునందలి సుల్తానులు (స్వదేశ సంస్థానాధి పతులు) ఇట్టి వీథిభాగవతులను దమ యాస్థానముల నుంచి, పోషించుచు పండుగ వేళలందును, పర్వసమయములందును, తమ సంస్థానమునకుఁగాని కుటుంబమునకుఁగాని సంబంధించిన యుత్సవావసరములయందును, జావా ద్వీపవిశేషములను

జూడవచ్చిన విదేశీయులైన యాత్రికులు తమ యాత్రాకాలములకు వచ్చునప్పుడును ఈ ప్రదర్శనముల నేర్పాటు చేయుచుందురు. కాని ఇటీవల నీ వీథినాటకములమీఁద మోజు తగ్గిపోవుచున్నది.

(౨) 'వాయంగ్ టోపెంగ్' (Wayang Topeng): ఇది 'చేతమొగము' లను ధరించి చేయు నృత్యము. దేవ, దానవ ముఖములను ధరించి పురాణగాథల నభినయింతురు. బలిద్వీపపు హిందూదేవాలయములలో దేవతోత్సవముల సందర్భమున పూర్వ ముపయోగింపఁబడుచువచ్చిన 'చేతమొగము'ల (Masks) నిప్పటికిని జూడవచ్చును. వీనికిఁగూడ వెనుకటి ప్రజాదరణము తగ్గిపోవుచున్నది. ప్రాచీనకాలమున మన దేశమునఁగూడ దేవాలయములందలి ఉత్సవావసరముల నిట్లు పాత్రధారణచేసి శివ, విష్ణు లీలల నభినయించునాచార ముండెడిది.

(3) మఱొకవిధమయిన వినోదప్రదర్శనము జావానీయుల బొమ్మలాట. ఇది కొయ్యబొమ్మలాటయని, తోలుబొమ్మలాటయని రెండు విధములు.

కొయ్యబొమ్మలాటకు 'వాయంగ్ లిటిక్' (Wayang Klitik) అని పేరు. ఈ కొయ్యబొమ్మ లొక్కొక్కటి పది యంగుళముల యెత్తుండును. వీటికి తెర యక్కఱలేదు. ఈ బొమ్మలకు పాత్రస్వభావమున కనువయినట్లుగా చక్కని రంగులువేసి, వెలగల ఆభరణములు, రంగురంగుల దుస్తులు తొడిగి వాటిని చక్కగ అలంకరింతురు. మన దేశములో

'పెళ్ళాడే బొమ్మా, పెళ్ళాడే బీబీ నాంచారి' అని పాడుచు, కొందఱు బిచ్చగాండ్రు పట్టుకొనివచ్చి యాడించు బొమ్మను చూచినచో, వీటిని ఒకవిధముగా మనము ఊహించుకొనవచ్చును. ఈ నాటకప్రదర్శనములలోని ఇతివృత్తము చరిత్రాత్మకమైనది. జావాద్వీపమునందలి హిందూసామ్రాజ్య వినాశమునకుఁ బూర్వపుచరిత్రలోని శౌర్య, సాహసగాథలకు సంబంధించిన నాటకములను ఈవిధముగా ప్రదర్శించుచుందురు. జావాయందంతట ఇట్టి ప్రదర్శనములు లేని పల్లెయే లేదనవచ్చును. ఈ ప్రదర్శనములు మధ్యజావాద్వీపపు తూర్పు మండలములలో ఎక్కువగా జరగుచుండును. ఇవి దేశీయులకు ప్రాచీన చారిత్రకగాథలను స్మరణకుఁ దెచ్చి వారిహృదయము నుత్తేజపఱచుచుండును.

ఇఁక రెండవదయిన తోలుబొమ్మలాట అచ్చముగా మనదేశమం దున్నదానివంటిదే. వినిపించు కథనుబట్టి ఈ బొమ్మలాట 'వాయంగ్ పూర్వ' (Wayang Purva) అని, 'వాయంగ్ గెడక్' (Wayang Gedok) అని రెండువిధములు. 'వాయంగ్ పూర్వ' అను తోలుబొమ్మలాటలో ఎత్తుకొను కథ లన్నియు పౌరాణికమయినవి; రామాయణ, మహాభారతములకు సంబంధించిన గాథలు. 'వాయంగ్ గెడక్' అను నాటలో ఎత్తుకొనున వన్నియు చరిత్రాత్మక గాథలే.

మొత్తముమీఁద ఈ రెండురకములయిన ఆటలలోను ఉపయోగించెడివి తోలుబొమ్మలే. వీటిని సాధారణముగా బఱ్ఱెతోలుతో చేయుదురు. వీటిని తయారుచేయుట ఒక

ప్రత్యేకవృత్తియే అయినది. తోలును చక్కగా కోసి చదును చేసి పదునుపఱిచి బొమ్మలు చేసి, ఆయాపాత్రల స్వభావము చూచుటతోనే మనసునకు తట్టునట్లు వాటికి స్వభావానుగుణ మయిన రంగులు పూసి, ఆభరణములు దుస్తులు మొదలైనవి చిత్రించి బంగారుమలాము చేసెదరు. ఈ బొమ్మలవి అనేక విచిత్రమయిన రూపములు; కానైతే అవి మానవ, దేవ ప్రతిమలే. అయినను పక్షిముక్కులవలె పొడుగాటి ముక్కుల తోను, మఱియు దీర్ఘములైన చేతులతోను అవి చాలవింత గాను, విచిత్రముగాను, వికృతముగాను ఉండును; కాని యారంగులతోను, దుస్తులతోను, ఆభరణములతోను అతి విస్తరముగ నలంకృతములయినవాటిని చూచినప్పుడు మనకు ఆ వికృతత్వము కాక మనస్సునకు చిత్రమయిన యానంద మును కలిగించు భావ మేదో తట్టుచుండును.

ఈ తోలుబొమ్మలు ఇంతటి వికృతాకృతులతో నుండు టకు కారణముగఁ జెప్పు నొకగాథకూడ కలదు. మహమ్మ దీయులు జావాద్వీపమును పదునైదవశతాబ్దిలో వశపఱుచు కొనుటయేకాక ఇచ్చటి ప్రజలకుఁగూడ ఇస్లాముమత మిచ్చి నారు. ఇస్లాముమతధర్మముదృష్టిని మనుష్య ప్రతిమలను చిత్రించుట కాని, చెక్కుటకాని నింద్యము; నిషేధము. కాని వారా దేశమున ప్రవేశించుసరికి ఈ తోలుబొమ్మల ప్రదర్శన ములు చాల జనరంజకములుగా నున్నవి. క్రొత్తగా ఇస్లాము మతము నవలంబించిన దేశీయుల యీ వినోదములను నశింపఁజేయఁగూడదు; అవి ఇస్లాముమత సిద్ధాంతములకు

భిన్నముగను నుండఁగూడదు. ఈ యుద్దేశముతో జావా ద్వీపమునందలి మొదటి ఇస్లాముమత ప్రవర్తకులలో నొకఁడగు 'సుసూనన్ మోరియా' అదివఱకు మనోహరముగ నుండు నీ బొమ్మలలో ఇప్పుడు కనఁబడు మార్పులు – పొడు గాటి ముక్కులు, సుదీర్ఘములయిన బాహువులు మొదలైనవి – చేసినాఁడఁట! ఇట్టి మార్పులవలన వాటిని కేవలము మనుష్యప్రతిమలక్రింద జమకట్టుకొన వీలు లేదు. కావున ఇస్లాముమత సిద్ధాంతమున కవి భిన్నమయినవి కావు. జావా ద్వీపవాసులు – ప్రతిమలు వికృతముగా నున్నప్పటికి – వాటిని చూచి, ఆయాయి బొమ్మలు స్ఫురింపఁజేయు పాత్రలను స్మరణకుఁ దెచ్చుకొని తమ ప్రాచీన గాథలను విని రహస్యముగ ఆనందించుటకును అవకాశము గలదు. కాన ఇది వారి కొక విధమయిన సంతృప్తి.

ఇది గాథ; కాని ఇది అంత నమ్మఁదగినదిగ తోఁచదు; ఏమన జావాద్వీపపు ప్రాచీన నాణకములమీఁదఁగూడ కొంచె మించుమించుగ ఇట్టి విచిత్రాకృతులు కానఁబడును. కావున ఇస్లాముమతము జావాలో ప్రవేశించుటకు పూర్వమున నుండియు ఇవి ఇట్టి రూపములతోనే యుండియుండుననుట కవకాశము కలదు. ఇంత ఎక్కువ అందవికారమైనవి కాక పోయినను కొంచె మించుమించుగ నిటువంటివే ప్రాచీన శిల్పచిత్రములు కొన్ని బలిద్వీపమునం దున్నవి. దీనినిబట్టి చూడఁగ నీ బొమ్మలాట హిందూదేశముననుండి యచటికి వెళ్ళినను ఈవిధమైనకళ – చర్మపుత్రికారచన–ఆ ద్వీపవాసుల

మనశిప్రవృత్తులనుబట్టి, కళాసంప్రదాయములనుబట్టి, చిత్ర రచనా సమయములనుబట్టి అచట స్వతంత్రముగా వికసించినదే యనియు, మన రామాయణవీరులును, భారత వీరులును ఆ దూరస్థద్వీపములకు వలసపోయి నూతనరూపములు ధరించినా రనియు చెప్పవలసియుండును.

ఈ తోలుబొమ్మలాటలోని ప్రధానాంగము లివి: (౧) తెర ; (౨) దీపము; (3) 'దలాంగ్'; (౪) 'గమేలన్.'

తెరమీఁదనే ఈ తోలుబొమ్మల ఛాయలు పడుచుండుటవలన దీనికి 'ఛాయాక్రీడ' (Shadow Play) అని పేరు వచ్చినది. ఈ తెరకు 'కేలిర్' (Kelir = చేలము?) అని పేరు. ఇది ఆఱడుగుల వెడల్పును, పదునైదడుగుల పొడుగును ఉండి, ఒకకొయ్యచట్రమున బంధితమైయుండును. కొన్ని కొన్నిచోట్ల తెర ఇంతకంటె కొంచెము చిన్నదిగా నుండుట కూడఁ గలదు.

బొమ్మలను ఆడించుటకు, కథ పాడుటకు ప్రధానముగా ఒకఁ డుండును. ఇతఁడే నాయకుఁడు. ఇతనిని 'దలాంగ్' (Dalang) అందురు. ఆట బాగుగా జరగుట, రక్తికట్టుట మొదలైనవి ఇతని నేర్పరితనమునుబట్టి యుండును. బొమ్మలను ఎంతో చాకచక్యముతో ఆడించుచు, నడుమ నడుమ తన ప్రజ్ఞకూడ చూపి, ఆ యా పాత్రల సంవాదమును నడపుచు ప్రేక్షకుల హృదయభావములను గనిపెట్టి వారికి విసుగు కలుగకుండ మధ్యమధ్య హాస్యము చెప్పుచు 'దలాంగ్' బొమ్మలాట కంతకును ప్రాధాన్యము

వహించును. ఎంతో కాలము గురువుదగ్గఱ శుశ్రూషచేసి చక్కగా కావ్యములు వల్లించి, బొమ్మల నాడించుటలో క్రమశిక్షణ పొందినమీఁదకాని ఎవ్వఁడును 'దలాంగ్' కానేరఁడు.

తెర వెనుక కూర్చుండి బొమ్మ లాడించు 'దలాంగ్'కు సరిగా నెత్తిమీఁదనే 'దమరి' (Damar = ప్రమిద ?) అను పేరఁ బరగు దీపము పెద్దది వ్రేలాడుచుండును. ఇది తెర మధ్య భాగమును ఎక్కువగ ప్రకాశవంతము కావించును. తెర మీఁది ఈ ప్రకాశమానమయిన భాగముననే తోలుబొమ్మలు వచ్చి, తమ పాత్రముల నభినయించి కుడివైపునకో ఎడమ వైపునకో నీడలోనికి జాఱిపోవును.

తెర వెనుకప్రక్క క్రిందిభాగమున అరఁటిబోదెల నుంచెదరు. కాళ్ళు చేతులు మొదలైనవి కదల్చుటకు వీలగు నట్లు ఒక్కొక బొమ్మకు రెండుచేతులకు రెండును, శరీరమున కొకటియు చొప్పున మొత్తము మూఁడేసి వెదురు ఊఁచలు బొమ్మలకు దారములతో కట్టియుండును.

ఒక్కొక్కవిధమయిన 'వాయంగ్' వినోదమునకు ఒక్కొక్కవిధమైన జంత్రవాద్యమేళ ముండును. ఈ మేళ మును 'గమేలన్' (Gamelan) అనెదరు. ఆయాఘట్టముల లోని రసమున కనుగుణముగా కలా, మంద్ర, తార స్వనము లతో, వివిధగతులగు లయ, తాళములతో 'గమేలన్' (మేళము) సాగుచుండును. ఈ జంత్రవాద్యకులు 'దలాంగ్' చేరువ నుందురు.

ఊరిలో తోలుబొమ్మలాట అని వేఱే చాటింప నక్కఱలేదు. ప్రదర్శనసమయమునకు ఎక్కడినుండి వచ్చి పడుదురో 'దలాంగ్' రాకపూర్వమే జనము తండోపతండములుగా వచ్చెదరు. మనదేశములోవలెనే అక్కడకూడ తోలుబొమ్మలాట రాత్రి తొమ్మిదిగంటల కారంభమయి, సూర్యోదయమువఱకును సాగుచుండును.

తెర యివతలనుండి, తెర యవతలనుండికూడ ప్రేక్షకులు ఈ యాటను తిలకింతురు. 'దలాంగ్' వైపుననుండి చూచువారికి బొమ్మల రంగులు మొదలైనవి పరిస్ఫుటముగఁ గాన్పించును.

ఆటప్రారంభమున 'దలాంగ్' 'కవి' భాషనుండి కొన్ని పద్యములు చదివి వాటిని ఇప్పటి జావాభాషలోనికి వ్యాఖ్యానముచేయును. పిదప వటపత్రమువంటి ఆకారముగల ఒక బొమ్మ తెర యెక్కును. దానిలో చెట్టుమాను, కొమ్మలు మొదలైనవి మనము గుర్తింపవచ్చును. దీనిని 'కాయన్' (Kayon) అందురు. ఇది పర్వతము, వృక్షము, అడవి, భవనము మొదలయినవాటిని సూచించునందురు. ఇది జీవనవృక్షమునకు సూచనయని విశేషార్థమును చెప్పుదురు. అటు తరువాత కథాసందర్భము ననుసరించి ఒక్కొక్కబొమ్మె తెర యెక్కి తెర దిగుచుండును. అప్పటి కథాఘట్టమున కుపయోగించని బొమ్మలను 'దలాంగ్' కుడి యెడమవైపుల తెర చివరిభాగముల నుంచును. సాధారణముగా 'దలాంగ్' రాక్షసులను, భూతములను, దుష్టపాత్రములను ఎడమవైపు

సను, దేవతలను, మహారాజులను, సత్పాత్రములను కుడి వైపునను ఉంచుచుందురు.

క్రొత్తఘట్టము, క్రొత్తరంగము ఆరంభమైనపు డెల్ల 'దలాంగ్' గంట ప్రయోగించుచుండును.

ఈ తోలుబొమ్మల ఆటలలో సామాన్యముగా వచ్చు ౫౦, ౬౦ మంది పేరులనుగురించి జావాద్వీపమునందలి 'ప్రతి పిల్లవానికిని', 'ప్రతి పెద్దవానికిని' గూడఁ దెలియును. శ్రీరామవనవాసము, జటాయువధ, సీతాపహరణము, సీతాన్వేషణము, లంకాదహనము, రామరావణయుద్ధము మొదలయిన హిందూపౌరాణికగాథ లన్నియు 'కవి'భాష తెలియక పోయినను, తమ తమ మిప్పుడు హిందూమతము కాక పోయినను జావాద్వీపవాసులకు 'హృత్కవిలెలే'. ఇట్లే 'భారతగాథ'లు కూడ జావానీయహృదయమును ఆకర్షించి రంజింపఁజేసినవి.



# బౌద్ధవాఙ్మయము : పరిశోధన

బౌద్ధవాఙ్మయ పరిశోధనోదంతము చాల విచిత్ర మైనది. హిందువులవలెనే బౌద్ధులును తమ మతగ్రంథము లను మతాంతరులకుఁ జూపక కడుజాగ్రత్తతో వానిని పేటిక లలో పెట్టి తమ తమ పుస్తకభాండాగారముల భద్రపఱిచి యుంతురు. హిందూదేశమున బౌద్ధమత మెన్నఁడో యంత రించినదగుటచేత తన్మతగ్రంథము లేవియో, అవి యేభాషలో నున్నవో బౌద్ధాచార్యులకుతప్ప తదితరులకుఁ దెలియనే తెలి యదు. నశించిపోక ఏమూలనైన నాదిగి మెదిగి బౌద్ధమింకను ప్రాణముతో నున్నను, చాలవఱకు అది హిందూమతలక్షణ ముల నవలంబించి, వాడుకకు తన్మతానుకరణమేయై, పేరుకు మాత్రమే బౌద్ధముగ నిలిచిపోయెను. అందువలన ఉన్న మత గ్రంథములైనను సమర్థులును, పండితులు నయిన మతా చార్యులకే కాని తదితరులకు తెలియరాకయుండెను. ఈ కారణమువలన పౌరస్త్యులయిన భారతీయులకే వీటిని గుఱించి తెలియలేదనిన ఇఁక పాశ్చాత్యులయిన యూరోపియ నుల మాట యేల ?

క్రీస్తుశకము పందొమ్మిదవశతాబ్ది ప్రాచ్యవిజ్ఞాన పరి శోధన కారంభయుగము. ఈ యుగారంభమున విజ్ఞానతృష్ణ గల పాశ్చాత్యపండితులును, వారు చూపిన మార్గమునే యనుసరించి కొందఱు ప్రాచ్యపండితులును ఈ ప్రాచ్య

విజ్ఞానరత్నాకరమును మథింపఁజొచ్చిరి. ఈ సందర్భముననే యీ పౌరస్త్య, పాశ్చాత్య పండితులకు బౌద్ధవాఙ్మయోద్ఘాతము తెలియవచ్చినది. అప్పటికయినను బౌద్ధమతగ్రంథములు పాలీభాషలో నున్నవనిమాత్రమే వారికిఁ దెలియును. అవి సంస్కృతభాషనుగూడఁ గలవనుట క్రీ. శ. ౧౮౩౧ - ౧౮౩౨ నడిమికాలమునమాత్రమే తెలియవచ్చినరహస్యము.

ఈ రహస్యము వెల్లడియగుటకు కారణభూతుఁడైన వాఁడు బ్రియన్ హౌటన్ హాడ్జ్‌సన్. ఈతఁడు క్రీ. శ. ౧౮౩౧ లో నేపాలుదేశపు 'బ్రిటిషు రెసిడెంటు'గ నియమితుఁడయ్యెను. ఈ యుద్యోగమును స్వీకరించిననాఁటి నుండియు ఈతఁడు ఆ దేశపు ప్రజల మత, వాఙ్మయములను గుఱించి తెలిసికొనఁ గృషిచేసెను. తత్ఫలితముగ ఈతని కచ్చటి మతాచార్యులతో మైత్రి కలిగెను. వీరిలో బౌద్ధులు చాలమంది గలరు. వీరి విహారములకు, మఠములకుఁ బోయి, యచ్చటి పుస్తకభాండాగారములలోని బౌద్ధగ్రంథములను పరిశోధించి తన్మతాచార్యుల సాహాయ్యమున అఱువది బౌద్ధమతగ్రంథసంపుటములను సంపాదించెను. వాటి నన్నింటిని పరిశీలనార్థము కలకత్తా 'బెంగాల్ ఏషియాటిక్ సొసయిటీ' వారికి పంపెను. కాని యచ్చటి పరిశోధకపండితు లెవ్వరును ఆ గ్రంథములపరిశోధనయం దాసక్తి కలవారుగఁ గాన్పింపక పోవుటచేత మఱి రెండుజతలు ఆ గ్రంథములనే సంపాదించి, ఒకజత లండను 'ఏషియాటిక్ సొసయిటీ' వారికిని, మఱియొక జత పారిస్ (ఫ్రాన్సు) 'సొసయిటీ ఏషియాటిక్' వారికిని

బంపెను. ఇట్లు పంపుటయేకాక అతఁడు తానుగూడ ఆగ్రంథములను బాగుగ పరిశోధించి యచ్చటి బౌద్ధ మతాచారాదులనుగూర్చి తెలిసికొని పత్రికలకు వ్యాసములు వ్రాయుచు వచ్చెను. హాడ్జ్‌సన్ పరిశోధనలవలన ఈ బౌద్ధమత వాఙ్మయము నేపాలుదేశమున క్రీస్తుశకము రెండువందల సంవత్సరములనుండియు నున్నట్లు తెలియవచ్చెను. త్రివిష్టప మనఁబడు తిబెత్తుదేశమున బౌద్ధమతము బాగుగ పాదుకొన్న పిదప క్రీ. శ. ఏడెనిమిది శతాబ్దులలో, ఈ బౌద్ధవాఙ్మయమంతయు తిబెత్తుభాషలోని కనువదింపఁబడెను. చీనాదేశముననుండి ముద్రణయంత్రము తిబెత్తుకు వచ్చినపిదప ఈ గ్రంథము లన్నియు ముద్రితములై ఒక్కొక్క గ్రంథమున కెన్ని ప్రతులు వలసిన అన్ని ప్రతులు దొరుకుచుండెడివి. కాని తిబెత్తు భాష రానిది ఆ గ్రంథముల ప్రయోజన మేమి పరిశోధక పండితులకు ?

సరిగా ఇదేసమయమున దైవికముగ ఆ లోటుకూడఁ దీరెను. హంగరీ (ఆస్ట్రియా)నుండి అలెగ్జాండరు సోమ డి కొరోసీ యను పురాతత్వ పరిశోధనయందాసక్తిగల తద్దేశీయుఁ డొకఁడు మధ్య ఆసియాఖండమున ఎచటనో హంగరీ దేశస్థుల ఆదిమనివాసస్థలము ఉండవలెనని యూహచేసి, దానిని కనిపెట్టవలయునను మహోత్సాహముతోను, ఆశతోను హంగరీనుండి తిబెత్తువఱకు కాలినడకను ప్రయాణము చేసి వచ్చెను. తుద కాతఁ డచ్చటికి వచ్చునప్పటికి దేశమును భాషయుఁగూడఁ గ్రొత్తవగుటచేత స్వప్రయోజనము నిమి

_త్తమే తద్దేశభాషను నేర్చుకొనవలసినవాఁ డయ్యెను. నూతన భాషాధ్యయనవశమునఁ బుట్టిన నూతనోత్సాహ మాతనిని స్వకార్యాచరణోన్ముఖునిగఁ జేయుటకుమాఱుగ అతనిదృష్టిని తద్దేశవాఙ్మయముపైఁ ద్రిప్పెను. తిబెత్తు బౌద్ధవాఙ్మయమును పరిశోధించి లోకమున కందలి సంగతులను దెలుపుభారము ఉత్సాహవశమున అతనిపైఁబడెను. అతఁడు తిబెత్తు బౌద్ధ మత గ్రంథములను చాల పరిశీలించి పరిశోధించెను. తిబెత్తు దేశములోని బౌద్ధగ్రంథములు రెండు గొప్ప గ్రంథ భాండా గారములలోఁ గలవు. వీటిని కంజూర్, తంజూర్ లందురు. కంజూర్ గ్రంథ.భాండాగారమున నూఱు, నూటయెనిమిది సంపుటములు కలవు. ఒక్కొక్క గ్రంథమునకు పాఠభేదముల నొప్పు వేఱువేఱు ప్రతులు కలవు. అసలు గ్రంథములు ౧౦౮౩ వఱకు నున్నవి. ఇంక తంజూర్ గ్రంథ భాండాగార మున రెండువందల ఇరువదియైదు సంపుటములు కలవు. హంగరీ దేశస్థుఁడు క్రొత్తమతవాఙ్మయమును గనిపెట్టితినన్న యుత్సాహమున ఏతద్గ్రంథజాలమును జాలవఱ కవలోడనము జేసినను, దీని నంతను మథించుట ఒక్కనికి తలకుమీఱిన పని; అయినను అతఁడు చేయఁగలిగినంత చేసి తన పరిశోధన ఫలితములను వ్యాసరూపమున పత్రికలలోఁ బ్రకటించెను; కాని గ్రంథముల కనువాదములు చేయఁడయ్యెను. ఇట్టి పని కవకాశము కలుగకపూర్వమే అనతికాలముననే అతఁడు ఏతత్కృష్టతమమైన ప్రాచీనాన్యమత భాషాధ్యయనమునకుఁ జిక్కి యసువులఁ గోలుపోయెను. జ్ఞానతృష్ణ యలసటనుగాని, యపాయమునుగాని యెఱుఁగదుకదా!

నేపాలు దేశమున హాడ్గ్‌సన్ను, తిబెత్తు దేశమున సోమ డి కొరోసీయును బౌద్ధవాఙ్మయ పేటికలను గాలించి యందలి యమూల్య విషయములను లోకమునకు వెల్లడించుచుండి నప్పుడే మంగోలియాలోని బౌద్ధవాఙ్మయమును ష్మిట్ (Schmidt)ను, సింహాళమునందలి బౌద్ధవాఙ్మయమును జార్జి టర్నరును తరుచుచు, తమ పరిశోధన ఫలితములను లోకమునకు వెల్లడించుచువచ్చిరి. హాడ్గ్‌సన్ పారిస్ పంపిన బౌద్ధమత గ్రంథములను యూజీన్ బర్నాఫ్ పరిశోధించి, తన పరిశోధన ఫలితముల నాతఁడుకూడ ఇంచుమించుగ ఈ కాలముననే లోకమునకు వెల్లడిపఱచుచుండెను. ఈవిధమున నేల నాల్గు చెఱఁగులనుండియు బౌద్ధమతవాఙ్మయవిజ్ఞానము నఱదలై ప్రవహింపసాగెను. నాఁటినుండియే, అనఁగా పందొమ్మిదవ శతాబ్ది ప్రథమ పాదాంతముననుండియే లోకమునకు బౌద్ధ మతవాఙ్మయము నిజస్వరూపము వ్యక్తమయ్యెను.

నాలుగు దిశలనుండియుఁ దెలియవచ్చిన బౌద్ధమత వాఙ్మయవిషయక వృత్తాంతము నవలోకింపఁగా బౌద్ధమత గ్రంథములు సంస్కృతమున ఒక్క నేపాలు దేశముననేకాక చీనా, జపాను, తిబెత్తు దేశములలోఁగూడ కలవని వెల్లడి యైనది. చీనా, జపాను, తిబెత్తు దేశములలోని బౌద్ధమతగ్రంథములు సంస్కృతభాష నున్నవి అరుదుగఁ గాన్పించుచున్నను అవి అసలు సంస్కృత బౌద్ధగ్రంథములకు అనువాదములని స్పష్టమయినది. ఈ గ్రంథములవలనఁ దెలియవచ్చిన బౌద్ధ మతమునకు, నేపాళ దేశ బౌద్ధమతగ్రంథముల వలనఁ దెలియ వచ్చిన బౌద్ధమతమునకు అంత వ్యత్యాసము కానరాలేదు.

ఇట్లే మఱియొక విషయముకూడఁ దెలిసినది. సింహళ దేశమునందలి బౌద్ధమతగ్రంథములు పాలీభాషలో నున్నట్లే బర్మా, సయామ్, అనామ్ మొదలైన ఆసియాఖండ దక్షిణ దేశములలోని బౌద్ధమతగ్రంథములును పాలీభాషలోనే కలవు. ఈ పాలీభాషా గ్రంథములవలనఁ దెలియనగు బౌద్ధమతము వ్యత్యాసము లంతగ లేక ఒక్కటియనియే స్పష్టమయ్యెను. అంతియేకాక పాలీగ్రంథ బౌద్ధమతమునకు, సంస్కృతగ్రంథ బౌద్ధమతమునకు చాల వ్యత్యాసము కలదనికూడ సిద్ధాంత మయినది.

ఈ పోలికలను, ఈ వ్యత్యాసములను గమనించి పాశ్చాత్యులైన బౌద్ధవిద్వాంసులు నేపాలు, తిబెత్తు, చీనా, జపానులలో వ్యాపించిన బౌద్ధమతమునకు ఉత్తర బౌద్ధమత మనియు, సింహళము, సయాం, బర్మా, ఆనాం దేశముల లోని బౌద్ధమతమునకు దక్షిణ బౌద్ధమత మనియు పేర్లు పెట్టిరి. కాని ఈ విభాగము సరియైనది కాదని 'టకకుసు' మొదలయిన ప్రాచ్యదేశపండితులు కొందఱు చెప్పియున్నారు; ఏలయన సుమత్ర, జావా ద్వీపములు హిందూదేశమున కాగ్నేయ మున నున్నను అందు వ్యాపించియున్న బౌద్ధమతము సంస్కృత గ్రంథ బౌద్ధమతమును బోలినదే. అందువలన ఇట్టి ప్రాంతిక విభాగము సరియైనది కాదనియే చెప్పఁదగును.

కాని యీ విభాగమువలనఁ గొంత యుపయోగము లేకపోలేదు. దక్షిణబౌద్ధమే ఆదిమబౌద్ధమతము. అశోకుని కాలమున బౌద్ధమతబోధకులు మతవ్యాపనముచేయుటకై

సింహళద్వీపమునకు వెళ్ళియున్నారు. అట్లు వెళ్ళినవారిలో అశోకచక్రవర్తి కుమారుఁడైన 'మహిందుఁ' డొకఁడు. ఇతఁడే 'త్రిపిటకము'లను [బౌద్ధుల వేదములు. ఇవి మూఁడు-(౧) వినయ పిటకము; (౨) సుత్తపిటకము; (3) అభిధమ్మపిటకము], వాటి భాష్యములనఁదగు 'అట్టకథ'లను సింహళమునకుఁ గొనిపోయినట్లును, అక్కడివారి కుపయోగ పడునట్లు 'అట్టకథ'లను సింహళదేశభాషలోనికి పరివర్తించి నట్లును చెప్పుదురు. 'మహిందు'ని సోదరియైన 'సంఘమిత్త'యే సింహళములో మొట్టమొదటిమాఱు బౌద్ధమత మవలంబింపఁ దలఁచిన స్త్రీలను 'భిక్షుణు'లం గావించినట్లు తెలియు చున్నది. 'మహిందు'నిఁతోబాటు 'ఇట్టియ', 'ఉత్తియ', 'భద్ద సాల', 'సుమనులు'కూడ బౌద్ధమతమును వ్యాపింపఁజేయు నిమిత్తము వెళ్ళిరి. ఈ బౌద్ధభిక్షువుల త్యాగదీక్షవలననే, ధర్మనిరతివలననే బౌద్ధమతము సింహళమున వ్యాపించెను. అది అచ్చటినుండియే బర్మా, సయాం, అనామ్ మొదలైన దేశములకుఁ బ్రాఁకెను. ఈ కారణమువలన పాళీగ్రంథ బౌద్ధమతమును (దక్షిణ బౌద్ధమతము) ఒక విధముగ ఆదిమ బౌద్ధమట మనవచ్చును. ఉత్తర బౌద్ధమతమనునది అశోక చక్రవర్తి యనంతర మభివృద్ధిగాంచిన బౌద్ధమతమునకు పేరు.

అశోకుని కాలముననే బౌద్ధులలో బౌద్ధులకు పెక్కు మతవిషయములనుగుఱించి చాల అభిప్రాయభేదము లుండెను. అశోకుఁడు వేఱువేఱు బౌద్ధమతకక్షులవారి నేకీకరించుటకై చాల ప్రయత్నించెను. అశోకుని కాలమున ప్రధానముగ

నుండిన కక్షలు రెండే: స్థవిర, మహాసాంఘిక కక్షలు. మహాసాంఘికులతో సరిపడక స్థవిరులు మగధను విడిచిపెట్టిరి. వీరిలో 'వినయభాణకము'ల (వినయ ప్రాధాన్యము గల మతము) నవలంబించినవారు సింహళమునకుఁ బోయిరి; 'సూత్రభాణకము'ల (ధర్మసూత్ర ప్రాధాన్యముగల మతము) నవలంబించినవారు కాశ్మీర, గాంధార దేశముల కరిగిరి. మొదటి తెగవారికి సింహళమును. రెండవ తెగవారికి కాశ్మీర, గాంధారములును ప్రధానస్థానములైనవి. కాశ్మీర, గాంధార స్థవిరులు చాలకాలమువఱకు బుద్ధభగవానుని ఆదిమసిద్ధాంతములనే అంటిపెట్టుకొనియుండిరి. కాని కాలక్రమమున దేశమున హెచ్చిన 'మహాసాంఘిక' ప్రాబల్యమువలన వారి మతస్వరూపమున మార్పు గలిగెను. వారు క్రమక్రమముగ ఆ సిద్ధాంతములలోని తత్త్వమునుగుఱించియే చర్చ సేయుచు, దానినే బోధింపఁదొడఁగిరి, తత్త్వబోధకు ప్రాధాన్యము కలిగినపిదప ఈ తెగవారికే సర్వాస్తివాదు లనుపేరు వచ్చెను. అందువలననే ఉత్తరబౌద్ధమున కొన్ని ఆదిమబౌద్ధలక్షణములును, మఱికొన్ని వృద్ధిపొందిన బౌద్ధములక్షణములును కలవని చెప్పుదురు. సర్వాస్తివాదుల గ్రంథము లన్నియు సంస్కృతమునఁ గలవు. కాశ్మీర, గాంధార దేశములనుండి బౌద్ధాచార్యులు చీనా, టిబెత్తు దేశముల కరిగి యచ్చట బౌద్ధమును వ్యాపింపఁజేసిరి.

ఈ పై సంగతులవలన చీనా, టిబెత్తు, జపాను దేశములలోని బౌద్ధులకు సంస్కృతమును, సింహళము, బర్మా,

సయాము, అనాములలోని బౌద్ధులకు పాలీయును హిందువు లకు సంస్కృత మెట్లో యట్టి పవిత్రభాషలని తేలుచున్నది. ఉత్తరదేశ బౌద్ధులకు సంస్కృతము పవిత్రమైన సామాన్య భాషయైనను వారిలో పెక్కుశాఖ లుండుటచేత ఒక్కొక్క సంప్రదాయమువారు ఒక్కొక్కభాషను దమ మతగ్రంథము లలో వాడుక చేసినట్లు తెలియవచ్చుచున్నది. ఉత్తరదేశ బౌద్ధుల మతగ్రంథములు కొన్ని గ్రాంథిక (సంస్కృత) భాషను, కొన్ని గాథాభాషను, వేఱొక కొన్ని ప్రాకృతము నను, ఇంక కొన్ని పాలీ భాషలోనుగూడఁ గలవు. క్రీస్తుశకము ఎనిమిదవశతాబ్దిలో నుండిన బౌద్ధభిక్షువగు వినీతదేవుఁ డను గొప్ప విద్వాంసుఁడు తమ మతగ్రంథములకు సర్వాస్తి వాదులు సంస్కృతమును, సమ్మితీయులు అపభ్రంశమును, స్థవిరవాదులు పైశాచిని వాడుచుండినట్లు తెలిపియున్నాఁడు.

క్రీస్తుశకము పందొమ్మిదవశతాబ్ది ప్రథమపాదాంత మున ప్రాచ్య పాశ్చాత్యపండితుల పరిశోధనలవలన బౌద్ధ మతవాఙ్మయోదంతము ఈ రీతిని లోకమునకు వెల్లడియైనది. పైని తెలిపిన విషయము లన్నియు పూర్వోదాహృతులైన విద్వాంసుల వ్రాఁతలవలనఁ దెలియవచ్చినవే. నాఁటినుండి విదేశీయులును స్వదేశీయులునుగూడ బౌద్ధమతవాఙ్మయమును చిలుకుచున్నారు. చిలుకఁగాచిలుకఁగా అందలి కొన్నిసమస్యలు తొలఁగుచున్నవి, మఱికొన్ని ఇదివఱకు కనుఁగొననట్టివి కలుగు చున్నవి. అయినను గత శతాబ్దమునందుకంటె నేఁడు ఈ

బౌద్ధవాఙ్మయమును పరిశోధించువారు మన భారతీయులలోఁ గూడ అనేకులు కలరు.

ఆంధ్రులకు బౌద్ధవాఙ్మయాధ్యయన మత్యంతావశ్యకమైనది. ఒకప్పు డంధ్రదేశము బౌద్ధమతమునకు భారతదేశ మంతటిలో ప్రధానపీఠముగ నుండెను. బౌద్ధాంధ్రదేశ చారిత్రమునకు బౌద్ధవాఙ్మయము అత్యంతోపకారకము. అందువలన ఆంధ్రులు ఏతద్వాఙ్మయమునం దభిమానము వహించి తదధ్యయన, పరిశోధనములకుఁ బూనుకొనుట అవసరము.



# మన ప్రాచీన విద్యాసంస్థలు

మనపూర్వపు విద్యాపద్ధతి ఇప్పటి విద్యాపద్ధతికంటె నుత్తమమైనదయినను గాకపోయినను అశోక, కృష్ణదేవరాయ, శివాజీలవంటి ప్రభు పుంగవులును, యుగంధర, తిమ్మరుసాదులవంటి మంత్రివరేణ్యులును, కాళిదాస, భవభూత్యాదులవంటి కవివతంసులును, నాగార్జున, శంకరాచార్యాదులవంటి మతసంస్కర్తలును విలసిల్లుటకు కారణభూతమై, జాతీయాభ్యుదయమునకును, వాఙ్మయవికాసమునకును, దేశీయపురోభివృద్ధికిని దోడ్పడి హైందవవిజ్ఞానకాంతికిరణములను నలుదెసలఁ బ్రసరింపఁజేసి, భారతజాతి కఖండగౌరవప్రతిష్ఠలను సముపార్జించిపెట్టినదగుటచేత నది సంస్తుతిపాత్రమును, చిరస్మరణార్హమును గాకపోదు. అందువలన రమారమి రెండువేలయేండ్లు మన జాతీయహృదయమును పూర్తిగా వశపఱచుకొని, ఐహికాముష్మికసుఖములకు దారిచూపిన మన పూర్వకాలపు విద్య ఎచ్చటెచ్చట నెట్లెట్లు వర్ధిల్లినదియు తెలిసికొనుట యుక్తము.

మన దేశచారిత్రము బౌద్ధయుగమున ఆరంభమగుచున్నది. బౌద్ధయుగమునకు పూర్వపు విద్యాసంస్థలనుగుఱించి మనకు బాగుగ తెలియదు; కాని వేదకాలమున పరిషత్తులుండెడి వనియు, వానిలో బహుశాస్త్రవేత్తలు, వేదవేదాంగవిదులునయిన విద్వత్ప్రకాండులు సభ్యులుగ నుండువారనియు,

గురువు శిష్యులకి వాగ్రూపముననే విద్య నేర్పుచుండె ననియు, గురువు నేర్పినదానిని శిష్యుఁడు కంఠస్థముచేయువాఁ డనియు మాత్రము మనకు తెలియును. అదియునుంగాక ద్విజులు మాత్రమే విద్య నభ్యసించువారనికూడ మన మెఱుంగుదుము.

## బౌద్ధయుగము :

కాని సర్వవర్ణములవారికి అందుబాటులో నుండని యీ విద్యాపద్ధతికి బౌద్ధయుగమునఁ గొంత మార్పు కలిగెను. ఈ వర్ణ మా వర్ణ మనక యెల్లవర్ణములవారును బౌద్ధమతమున చేరుట కవకాశము కలిగినట్లే బౌద్ధ విద్యాపీఠములలో విద్య నేర్చుకొనుటకుఁగూడ మంచి యవకాశము లేర్పడినవి. ఈ కాలముననే గొప్ప గొప్ప విద్యాపీఠములు వెలసినవి. ఆ విద్యాపీఠములలో భరతఖండమునందలి సర్వవర్ణములవారు మాత్రమేకాక దేశాంతరవాసులుకూడ వచ్చి విద్య నభ్యసించుచుండిరి. ఉత్తర హిందూస్థానమునఁ జేర్వడసిన రక్షశిల, నాలంద, ఓదంతపురి మున్నగు గొప్ప విద్యాపీఠములు ఈ బౌద్ధయుగమున విరాజిల్లినవియే.

దక్షిణాపథమునఁగూడ బౌద్ధయుగమే సమస్తకళలకు నుత్తేజన మిచ్చినకాలము. అయినను అచ్చట నీ కాలమున విలసిల్లిన విద్యాపీఠములనుగుఱించి మనకు ఎక్కువగఁ దెలియరాదు. అజంతాగుహాలలోని చిత్తరువులు, అమరావతి, జగ్గయ్యపేట, నాగార్జునుని కొండలందలి స్తూపనిర్మాణములు — ఈ మొదలగునవియే దక్షిణాపథమున బౌద్ధకాలపు కళాభి

రుచిని దెలుపు గొప్ప యుదాహరణములుగా నిలిచియున్నవి. ధాన్యకటకము, వేఁగి, కాంచీపురము, శ్రీశైలము—ఇవి యీ కాలమున పేరొందిన విద్యాపీఠములని తెలియవచ్చుచున్నది.

శాతవాహనవంశజు లంధ్రదేశమును పరిపాలించుచుండిన కాలమున కృష్ణానదీతీరస్థమయిన ధాన్యకటకము దక్షిణాపథ నగరరాజముల కవతంసమై యలరారినది. ఇప్పుడు దానిని ధరణికోట యందురు. ధాన్యకటకము ప్రతిష్ఠ యంతయు బౌద్ధయుగమునాఁటిదే. అది యనేక బౌద్ధసంఘారామములతో విలసిల్లుచు బౌద్ధులకు క్రీస్తుశకము మొదటి శతాబ్దులందు పవిత్రమయిన మతపీఠముగ నుండెను. బౌద్ధమతస్థులు రెండవ బుద్ధునిగ పరిగణించు ఆర్య నాగార్జునునికాలమున ఈ ధాన్యకటకము విద్యాపీఠమయి మిగుల ప్రసిద్ధికెక్కెను. ఇది బౌద్ధవిద్యకు నిలయమై యుండెడిది, ౭,౨౦౦ ల బౌద్ధభిక్షువుల తోను, ఆఱు కళాశాలలుగల విశ్వవిద్యాలయముతోను తిబెత్తు (త్రివిష్టపము) నందలి 'లాసా'నగరము సమీపమున విలసిల్లుచుండిన 'దాపంగ్' సంఘారామము ఈ ధాన్యకటక సంఘారామము నాదర్శముగఁ గైకొనియే నిర్మింపఁబడినదని తిబెత్తు చరిత్రకారులు తెలుపుచున్నారు. తిబెత్తుభాషను 'దాపంగ్' అనఁగా ధాన్యరాశియని యర్థము. దీని ననుసరించి ఈ ధాన్యకటకముపేరే ఆ సంఘారామమునకుఁ బెట్టి నట్లు స్పష్టము. ధాన్యకటకసంఘారామ విశ్వవిద్యాలయము లనుగూర్చిన వర్ణనములు నాలంద, విక్రమశీల విహారముల

యందలి పుస్తక భాండాగారములలో పదిలపఱుపఁబడియుం డెడివఁట. క్రీస్తుశకము ఏడవశతాబ్దియందు దక్షిణాపథము నకు వచ్చిన యువాన్ చాంగ్ అను చీనాదేశపు బౌద్ధ యాత్రికుఁ డిచట మిక్కిలి రమ్యములైన బౌద్ధనిర్మాణము లను తాను చూచినట్లు తెలిపియున్నాఁడు.

ఇట్లే వేఁగి లేక వేంగికూడ బౌద్ధయుగమున సంఘా రామములతో విరాజిల్లి గొప్ప విద్యాపీఠముగ ప్రసిద్ధికెక్కి నది. ఇచ్చటి యొక సంఘారామమున చాల 'అంతస్తులుగల హర్మ్యములును, సొగసుగా చెక్కిన స్తంభములచే నలం కృతములైన ఇతర గృహములు'ను ఉండినట్లును, 'ఈ యారామముప్రోల నూఱడుగుల యెత్తుగల యొక స్తూప' ముండినట్లును, 'ఇచ్చటి బుద్ధవిగ్రహమును శిల్పి తన నేర్పం తయుఁ జూపి కళ లూరునట్లు' చెక్కినట్లును తెలియుచున్నది. ఈ వేంగీవిద్యాపీఠమునకు శ్రీ దిఙ్నాగాచార్యులవారు అధ్య క్షులుగ నుండిరి.

ఈ కాలముననే దక్షిణాపథమున విలసిల్లిన మఱియొక విద్యాపీఠము కాంచీపురము. ఇది వేద బౌద్ధవిద్యలు రెంటికి నిలయముగ నుండెను. పెక్కు సంఘారామములతో శోభిల్లిన ఈ నగరరాజము బౌద్ధమతము క్షీణించినపిదపఁగూడ వైదిక మతమునకు పట్టుగొమ్మయై కీర్తివహించినది. కాంచీపురము రాజధానిగా పరిపాలించిన పల్లవరాజులు విద్యలను, కళలను కూడ పోషించి శిల్పుల నెక్కువగ నాదరించియున్నారు. ఎంతవఱకు సత్యమోకాని, క్రీస్తుశకము మూఁడవశతాబ్ది

యందు కాశీప్రాంతముననుండి బౌద్ధు లనేకు లిచ్చటికి వచ్చి నట్లేకాక ఈ పల్లవరాజ్యముననుండియే బౌద్ధభిక్షువులు విజ్ఞానజ్యోతిని గొనిపోయి సింహళమునుగూడ ప్రకాశవంత ముగ చేసినట్లును చెప్పెదరు. క్రీస్తుశక మేడవశతాబ్దియందు దక్షిణాపథమునకు వచ్చిన యువాన్ చాంగ్ తాను ధాన్య కటకము మొదలు కాంచీపురమువఱకు ననల్పశిల్పకళా గౌశల ముతో నలరారు పెక్కు దేవాలయములను, బౌద్ధనిర్మాణ ములను జూచినట్లు తెలిపియున్నాఁడు. ఇట్లు బౌద్ధయుగము నను, పల్లవరాజ పరిపాలనమునను కాంచీపురమున విద్యలు చక్కగ వర్ధిల్లినట్లు మన కనేక నిదర్శనములవలన తెలియు చున్నది. వైదికమతము పునరుద్ధారము నొందిన కాలమునఁ గూడ కాంచీపురము గొప్ప విద్యాపీఠముగనుండి గొప్ప 'ఘటికాస్థాన'మని పేర్వడసెను.

బౌద్ధయుగమునందలి గొప్ప సంఘారామములలో శ్రీపర్వత మొకటి. ఇదియే ఇప్పటి నాగార్జునికొండ. ధాన్య కటకసంఘారామము పేరుప్రతిష్ఠలు తగ్గినపిదప ఇక్ష్వాకువంశ నృపతుల యాదరాభిమానములవలన నిది పెంపొంది కీర్తిగాంచి నది. ఇచ్చటి సంఘారామమును గుఱించి వ్రాయుచు డాక్టరు బర్గెస్ ఇట్లు వ్రాయుచున్నాఁడు: 'ఇచ్చటికి వచ్చి నివసింపవల సినదని ఆర్య నాగార్జునుఁడు బౌద్ధభిక్షువుల నాహ్వానించి ఈ సంఘారామమున బౌద్ధమతమునకు సంబంధించిన ముఖ్య గ్రంథములను, వాని వ్యాఖ్యానములను సంపాదించియుంచెను.' ఈ విధమున శ్రీపర్వతసంఘారామము పెద్ద పుస్తకభాండా

గారముతో విలసిల్లిన గొప్ప విద్యాపీఠము. చరమదశలో నాగార్జునాచార్యుని నివాసమై యిది పేరు కెక్కినది.

ఈ పైసంగతులను గమనించినచో బౌద్ధయుగమున సంఘారామములు విద్యానిలయములుగ నుండినట్లు మనకు బోధపడును; బౌద్ధసన్యాసు లీసంఘారామములందు నివసించుచు విద్యాపిపాసార్థులకు విద్యాప్రదానముఁ గావించుచుండువారు.

**హిందూయుగము :**

బౌద్ధయుగమును వదలి తదనంతర హిందూయుగమునకు వచ్చినచో మనకు గొప్ప మార్పు గోచరమగును. బౌద్ధయుగమునందువలె తక్షశిల, నాలందలవంటి విశ్వవిద్యాలయములు మనకుఁ గాన్పింపవు. విద్యయంతయు బౌద్ధయుగమున బౌద్ధభిక్షువుల వశమునందున్నట్లుగనే యీ యుగమున బ్రాహ్మణుల వశమునం దుండెను. బౌద్ధమతమునందలి సర్వమతసమాదరణీయములయిన సిద్ధాంతములను, సర్వజనాదరపాత్రములైన యాకర్షణములను అన్నిటిని తన మతమున పొందుపఱచి దానికి జనరంజకముగ నూతనత్వము నాపాదించి బ్రాహ్మణుఁడు మఱల దేశమున క్రొక్రొత్తతేజము నిచ్చి, తన మతముతోఁ బాటు తన్మతావరణములోనికి వచ్చిన హిందూసంఘమున కంతకును మతగురువే కాక విద్యాగురువు నై యాచార్యత్వము వహించెను. బ్రాహ్మణుఁ డాచార్యుఁడై నేర్పిన యీ వైదికవిద్య కారంభకాల మేదియో, యెప్పు డెవ్వ డేవిధమున విద్య నభ్యసింపవలెనో – ఈ మొద

లగు విషయము లన్నియు సంస్కృతమునను్న ధర్మశాస్త్ర వాఙ్మయమువలన విశదమగుచున్నవి.

## గురుకులములు :

వేదవేదాంగవిదులైన బ్రాహ్మణు లెచ్చట నున్న నచ్చటి కరిగి విద్యార్థులు గురుకులవాసముచేసి విద్య నార్జించు వారు. గురువు శిష్యుని కుమారునిగ భావించి యాదరించు వాఁడు. శిష్యుఁడు తన వినయవిధేయతలచేతను, భక్తిశ్రద్ధల చేతను, సపర్యలచేతను గురువును మెప్పించి అతని మన్నన లకు పాత్రుఁడగువాఁడు. చంద్రుని వెన్నెలవలె గురువును శిష్యుఁ డెల్లప్పుడు ననుసరించియుండువాఁడు, గురుజనపూజ నము, అధ్యయనము తక్క అతనికి వేఱు చింతలు లేవు. ఈవిధమున నిల్లు వదలి, తల్లిదండ్రులను వదలి, గురుకుల వాసముచేసి విద్య పరిపూర్తిగ నేర్వవలయునన్న పండ్రెం డేండ్లు మొదలు నలువదియెనిమిదేండ్ల వఱకు పట్టుచుండెడిది. కులపతులయొద్ద విద్యాభ్యాసము కొందఱు పదునాఱేండ్ల తోనే ముగించువారు.

విద్య పూర్తియైన 'స్నాతకు'లకు కులపతి సదుప దేశముచేసి వారిని దీవించి స్వగృహమునకుఁ బంపువాఁడు. విద్య పూర్తియగునంతవఱకు ఆర్యవిద్యార్థి బ్రహ్మచర్య వ్రతమును బరిపాలించుచుండవలెను. విద్య పూర్తి గావించు కొని విద్యార్థి స్వగృహమునుగూర్చి మరలి వచ్చునపుడు పరిణయయోగ్యయైన కన్య గల గృహస్థు ఆతనిని గౌరవ మర్యాదలతో తన గృహమున కాహ్వానించి తన కూఁతురి

నిచ్చి పరిణయముఁ గావించి కన్యాప్రదానఫలమును సంపాదించుకొని చరితార్థుఁడగువాఁడు. ఇప్పటివలె వరశుల్క, కన్యాశుల్కములు కాని, కన్యాప్రదాతలకు కష్టములు కాని యుండెడివి కావు. ఈ పూర్వపు విద్యాపద్ధతి యంతయు మాఱిపోయినను, గురుకులవాసశ్రమ కాని, కులపతిసంపూజన బాధ కాని యిప్పుడు తప్పిపోయినను, తుదను వేదాధ్యయనమే ఆకాశపుష్ప మగుచున్నను బ్రాహ్మణసంఘమున వివాహకాలమున 'స్నాతకము', కాశీప్రయాణము, వరుని బ్రతిమాలి తోడ్కొనివచ్చి కన్య నొసంగి పెండ్లిసేయుట అను నీ యాచారములుమాత్రము పూర్వపు విద్యాపద్ధతిని జ్ఞాపకము చేయు పరిశిష్టములై బ్రాహ్మణ వివాహపద్ధతిలో నిలిచి యున్నవి.

## వైదికవిద్య:

బౌద్ధయుగానంతరమున వర్ధిల్లిన విద్య యంతయు వైదికవిద్య, అనఁగా కేవలము వేద, శాస్త్రములకు సంబంధించినవిద్య. సాంకేతికవిద్య(Technical Education), అనఁగా వాస్తు శిల్పాది పరిశ్రమలకు సంబంధించిన విద్యను బ్రాహ్మణుఁడితరులకు వదలిపెట్టెను; హేతు, ఆధ్యాత్మిక జ్ఞానములకుఁ దోడ్పడు విద్య కంతకుఁ దా నధికారియై ప్రభుపుంగవుల గౌరవ సమ్మానములకు పాత్రుఁడయ్యెను.

## చతుర్దశవిద్యలు:

ఋగ్యజుస్సామాథర్వణము లనియెడు నాలుగు వేదములు, శిక్షా, వ్యాకరణ, కల్ప, నిరుక్త, జ్యోతిశ్శాస్త్ర,

ఛందశ్శాస్త్రము లనఁబడు నాఱు వేదాంగములు, మీమాంస, న్యాయము అను దర్శనములు, పురాణములు, ధర్మశాస్త్రములు—ఇవి ఆర్యకుమారుఁడు విద్యార్థియై చదువవలసిన విద్యలు : పదునాలుగు.

విద్య లెన్ని యనువిషయమున కొన్ని మతభేదములు కలవు. కొందఱు పదునాలు గనిరి; మఱికొందఱు పదునెనిమిదనిరి; ఇఁకఁ గొందఱు ముప్పదిరెం డనిరి. పై నుడివిన పదునాలుగు విద్యలకు నుపవేదములైన యాయుర్వేద, గాంధర్వవేద, ధనుర్వేద, స్థాపత్యములు (శిల్పము మొదలగు సాంకేతికవిద్యలు) నాల్గింటిని జేర్చిన పదునెనిమిది విద్య లగుచున్నవి. కాలము గడచినకొలఁది వీని సంఖ్య పెరుఁగుచు వచ్చినది. శుక్రుఁడు మొదలగువారు విద్యలను కళలను విడదీసినను కాలక్రమమున కొన్ని విద్యలు కళలలోఁ గలిసిపోయినవి. అయినను చతుష్షష్టికళలు వేఱు, వేదవేదాంగాది విద్యలు వేఱు అను ప్రాచీనవిభాగముమాత్ర మంతరింపలేదు.

ఈ విధముగు వైదికవిద్య ముఖ్యముగ (౧) ఘటికాస్థానములు, (౨) అగ్రహారములు, (౩) దేవాలయములు, (౪) మఠములు అను నాలుగు విధములగు సంస్థలలో పెరిఁగి పెంపుఁగాంచినది.

## ఘటికాస్థానములు :

ఘటికాస్థానములు విద్యాపీఠములని తెలిసినను వీనిని గుఱించిన వివరములుమాత్రము మనకు తెలియవచ్చుటలేదు. ఘటికా స్థానములు ముఖ్యముగా దక్షిణాపథమునందలి

శాసనములందుమాత్రమే పేర్కొనఁబడినవి. వేంగీ చాళుక్య వంశజుఁడైన మొదటి జయసింహవల్లభుని నిడమఱ్ఱుశాసనమున నిట్టి ఘటికాస్థాన మొకటి పేర్కొనఁబడినది. ఈ శాసనము ననుసరించి వేంగీచాళుక్యరాజ్యమున నీ జయసింహవల్లభుని కాలమున (క్రీ. శ. ౬౪౧–౬౭౩) అసనపురమునం దొక ఘటికాస్థాన ముండెననియు, అందు జయసింహవల్లభ మహారాజువలననుండి నిడమఱ్ఱుగ్రామమును దానముగ ప్రతిగ్రహించిన కాటిశర్మపితామహుఁడయిన మండశర్మ 'ఘటికాసామాన్యుఁ' డనియుఁ దెలియుచున్నది. 'ఘటికాసామాన్యుఁ' డనఁగా ఘటికాస్థానమునందలి యొక యధ్యాపకుఁ డనియో, సభ్యుఁ డనియో తలంపవలసియుండును. కాంచీపురముకూడ వేదవిద్య ప్రబలిన దినములలో పేరు మోసిన ఘటికాస్థానముగ నుండెనని యిదివఱకే చెప్పఁబడినది. కదంబవంశ ప్రభువులకు మూలపురుషుఁడైన మయూరశర్మ తన గురువగు వీరశర్మతో పల్లవరాజుల రాజధానియైన కాంచీపురమునకు బయలుదేఱి వెళ్ళెననియు, అతఁడు ప్రవచనమున గొప్ప పండితుఁడు కావలెనను కోరికతో అన్ని ఘటికలకును వెళ్ళి గొప్ప ఆశుతర్కకుఁడు (Debator or disputant) అయ్యెననియు. నొకశాసనము తెలుపుచున్నది. కాంచీపురము నేలిన ఇమ్మడి నరసింహవర్మ యనుపల్లవరాజు బ్రాహ్మణుల ఘటికాస్థానమును నిర్మించెనని వేఱొకశాసనమునఁ గలదు. భరత క్షేత్రమున కలంకారప్రాయమైన కర్ణాటకసీమయందలి కుంతలదేశము 'ధర్మక్కె నెమ్మఁదియుం భోగక్కాగరము మాద ఘటికాస్థాన'మని ధర్మమునకు సహకారములును,

భోగముల కాకరములు నగు ఘటికాస్థానములకు నెలవని మఱియొక శాసనము నుడువుచున్నది. ఈ యుదాహరణముల వలన ఘటికాస్థాన మనఁగా విద్యకును, ధర్మమునకును ఆలవాలమైన విద్యాపీఠ మనియు, నది రాజపోషణమున వర్ధిల్లుట చేత భోగముల కాకర మనియు నూహింప వీలగుచున్నది. ఘటికాశ్రమ మెట్లు నిర్మింపవలసినదియు ఉత్తంకుఁడు సామవేదమున చెప్పినట్లు శాసనములందు వ్రాయఁబడినది. ఇంతకంటె నీ సంస్థను గుఱించిన విశేషములు మనకు తెలియవు.

## అగ్రహారములు :

ఘటికాస్థానములమాట యెటు లున్నను అగ్రహారము పూర్వకాలమున సుప్రసిద్ధమైన విద్యాసంస్థగ నుండెననుట నిర్వివాదాంశము. మానసారమను సుప్రసిద్ధ పురాతన శిల్పశాస్త్రమున, విన్యాసరీతుల ననుసరించి పండ్రెండువిధములైన గ్రామభేదములు పేర్కొనఁబడినవి. అందు అగ్రహార మనునది యొకటి. అది విద్వాంసులైన విప్రవరులకు స్థానము. కామికాగమము ౨౭-వ పటలమున నిది 'మంగల' మనికూడ వర్ణితమైనట్లు మానసార మిట్లు తెలుపుచున్నది :

విప్రై ర్విద్వద్భి రాభోగ్యం మంగలం చేతి కీర్తితం
అగ్రహార స్తదేవోక్తం విప్రేంద్రైః కామికాహ్వయే.

కన్నడదేశమునను, ఆంధ్రదేశమునను అగ్రహార మగ్రహారమే; కాని ద్రవిడదేశమున దానికి మంగల మనియు, చతుర్వేదిమంగల మనియు పేర్లు కలవు. చాళుక్యచోళు

లంధ్రదేశమును పరిపాలించుచుండిన కాలమునఁ గలిగిన ద్రావిడ సంసర్గమువలన నాఁడు మన తెలుఁగుదేశమునఁ గూడ నచ్చుటచ్చట, నరుదుగనైన నొకటి రెండు చతుర్వేదిమంగలముల పేరులు వినఁబడుచున్నవి. ప్రోలునాఁటియందలి వీరచోడ చతుర్వేదిమంగల మిట్టిదే. కాకినాడ పిఠాపురప్రాంతములకు ప్రాచీనకాలమున ప్రోలునాఁడని పేరు.

అగ్రహారము లన్నియు వైదికవిద్య వ్యాపింపఁ జేయుటకై తద్విద్యాభిమానులైన రాజులు, నాయకులు, జమీందారులు మొదలగువారు బ్రాహ్మణుల కొసంగినవియే. సపదక్రమానుక్రమాధీత వేదద్వయులు, సకలోపనిషత్పురాణేతిహాసానేకధర్మశాస్త్రవిదులు, అగ్నిష్టోమయాజులు, యజ్ఞాగమమంత్రార్థతత్త్వజ్ఞులు, యజన యాజన అధ్యయన అధ్యాపనాది షట్కర్మనిరతులు అయిన బ్రాహ్మణులకు రాజులు ఉత్తరాయణ పుణ్యకాలముననో, సూర్య చంద్రగ్రహణముల నిమిత్తముననో, ఇతర పర్వదినముల సందర్భముననో, లేక పట్టబంధసమయముననో గ్రామము నగ్రహారముఁజేసి సర్వకర పరిహారముగ నొసంగువారు. ఆ యగ్రహారమువలన వచ్చు రాఁబడి ననుభవించుచు, విద్యార్థులై వచ్చిన బాలురకు విద్యాప్రదానముఁ గావించుచు, జీవనోపాధినిమిత్తము వేఱుచింతలు లేక బ్రాహ్మణులు సుఖముగా కాలక్షేపముచేయువారు. కొన్నికొన్ని యగ్రహారములందు ప్రత్యేక మిట్టిట్టి విద్యలు నేర్పు నధ్యాపకుల కిన్నిన్ని వృత్తులని కూడ నేర్పాటు లుండెడివి. వీరచోడచతుర్వేదిమంగలమున నట్టి-

విద్యాదివృత్తులను గురించి తెలుపు వీరచోడచతుర్వేది మంగలశాసనమునందలి భాగ మీక్రింద పొందుపఱుపఁబడు చున్నది :

అత్ర వ్యాకరణం వ్యాచక్షాణస్య వృత్త్యర్థం భాగ ఏకః
మీమాంసావ్యాఖ్యాత్రే ద్వౌ
వేదాంతం వ్యాఖ్యాతు రేకః
పురాణం వాచయితు రేకః
వైద్య స్యై కః
అంబష్ఠ స్యైకః
ఋగ్వేద మధ్యాపయితు రేకః
యజుర్వేద మధ్యాపయితు రేకః
సామాని గాపయితు రేకః
రూపావతారం వ్యాచక్షాణ స్యైకః
విషవాదిన ఏకః
జ్యోతిర్విద ఏకః

ఈవిధమున ఋగ్వేద, యజుర్వేద, సామవేదములను, మీమాంసా, వేదాంత, వ్యాకరణ, రూపావతారములను బోధించువారికిమాత్రమే కాక పురాణము చెప్పువానికిని, వైద్యునికిని, శస్త్రవైద్యముచేయు మంగలికిని, విషవైద్యునికిని, జ్యోతిష్కునికినిగూడ నగ్రహారములందు వృత్తు లుండెడివి. పూర్వము గ్రామములు కాని, అగ్రహారములు కాని ఇతర గ్రామములమీఁదను, ఇతరపట్టణములమీఁదను ఆధారపడ కుండ తమ జీవనమును తాము స్వయముగ గడపుకొనుట కేయేవృత్తులవా రావశ్యకమో అట్టివారి కందఱికి వృత్తు లుండెడివి.

అగ్రహారములను ఒకవిధమగు విద్యాపీఠములు (Chartered Universities)అని నుడువవచ్చును. రాజొసంగిన యగ్రహారమునో, వృత్తులనో అనుభవించుచు గురువు చదువు చెప్పువాఁడు; శిష్యుఁడు గురుకులమున చేరి మాధుకరవృత్తిని

జీవించుచు విద్య నేర్చుకొనుచుండువాఁడు. గురువునకు జీవనో పాధినిగురించిన విచార ముండెడిది కాదు. శిష్యునికి భోజనము కొఱకు వెదకికొనవలసిన ప్రయాస ముండెడిది కాదు.

అగ్రహారములు సాధారణముగ ఏకభోగములుగను, బహుభోగములుగను ఉండెడివి. ప్రత్యేక మొక్కని హక్కు భుక్తములలో నుండు నగ్రహారము నేకభోగ మందురు. ఒక్కయగ్రహారముననే పెక్కుమంది బ్రాహ్మణులకు వృత్తు లుండి యది గణభోగ్యమయినచో నట్టిదానిని బహుభోగ మందురు. ఏకభోగమయినను, బహుభోగమైనను అగ్ర హారము ప్రత్యేకము బ్రాహ్మణుల యాశ్రమవాటికి యగుట చేత నందు బ్రాహ్మణేతరులు నివసించుట కవకాశ ముండె డిదికాదు. అధ్యయన అధ్యాపనాది షట్కర్మనిరతులయిన బ్రాహ్మణు లెప్పుడును వ్యవసాయముచేయువారు కాక పోవుటవలన అగ్రహారపు భూములను సేద్యముచేయుటకు కొంత మంది రైతులు కావలసివచ్చువారు. వీరు నివసించుట కగ్ర హారముల నంటి చిన్న పల్లె లుండెడివి. వీనికి పూండ్లని పేరు. 'పూఁడి' పదాంతములైన యిప్పటి గ్రామములలో నన్నియుఁ గాకపోయినను చాలభాగము కొంచె మించుమించుగ నిట్టివే యని నుడువవచ్చును. అగ్రహారమునకు కావలసిన కూర గాయ లన్నియు పూఁడి నామాంచితములయిన పల్లెలలో పండింపఁబడును. ఈ పూండ్లకే సంస్కృతమున గ్రామ గ్రాసపుఁ బల్లె లనియు, గ్రామోపహారము లనియుఁగూడ పేర్లు కలవు. సాధారణముగ రాజు లగ్రహారదానముఁ

గావించునప్పుడే వానితో నట్టి పూండ్లనుగూడ నేర్పఱిచి యిచ్చువారు.

'సర్వకరపరిహారము 'గను, గ్రామగ్రాసనహితము గను మాత్రమే కాక దాతయైన భూతలపతి 'సధాన్య హిరణ్యాదేయము 'గను, 'సదండదశాపరాధము 'గను, 'సోత్పద్యమానవిష్టికము 'గను, 'చాట భట దూత రాజ పురుషాప్రవేశ్యము 'గను అగ్రహారములను దానమొసంగు వాఁడు; అనఁగా దాన మొసంగిన యగ్రహారమునకు పన్ను పర్యాయము లుండెడివి కావు. అగ్రహారమునుండి రాజునకు చెల్లవలసిన ధాన్యరూపమైనట్టియు, ధనరూపమైనట్టియు రాఁబడి ప్రతిగ్రహీతలది. రాజు దానము నొసంగునప్పుడే అగ్రహారమున ప్రజలు చేయు దశాపరాధములను విచారించి దండము (జరిమానా) విధించుటకును, దండించుటకును అధికారస్వామ్యముల నగ్రహారికులకే వదలివేయువాఁడు. రాజునకు చేయఁబడవలసిన వెట్టి, వేములు సయితము దానముతో నగ్రహారికులకే. చెందుచుండును. విద్యార్థుల విద్యాభ్యాసమునకుఁ గాని, అగ్రహార శాంతికిఁ గాని భంగము కలుగకుండుటకై సైనికులు (చాటభటులు–regular or irregular troops) కాని, దూతలు (messengers) కాని, రాజపురుషులు (king's servants) కాని అగ్రహారములలో ప్రవేశింపరా దను నిబంధనముతోనే రాజు అగ్రహారమును దాన మొసంగువాఁడు. అగ్రహారదాననిబంధనములలో నెల్ల ఈనియమమే కడు ముఖ్యమైనది. వ్యవహార, దోష (సివిలు,

క్రిమినలు) విచారణములకగు సర్వాధికార స్వామ్యము లందును ప్రభుత్వముతో నెట్టి సంబంధమును లేక సర్వ తంత్రస్వతంత్రమైయుండు నా యగ్రహారమున విద్యావిధాన నిర్ణయమునఁ గాని, అగ్రహారకార్యనిర్వాహణమునఁ గాని, దోషవ్యవహార విచారణమునఁ గాని బ్రాహ్మణేతరుల కెవ్వరికి నధికారము లేకపోవుటయే కాక వారి కెవ్వరికి బ్రాహ్మణుని యనుమతిమీఁదతక్క నాయగ్రహారమున ప్రవేశించుటకైన హక్కుండెడిది కాదు. ఈ కారణముననే కావచ్చు ముఖ్యముగ పంచమవర్ణమువా రగ్రహారపు వీథులందు నడువరాదను నిబంధనము కలిగినది. పూర్వపు విద్యాపద్ధతి యంతరించినను పాశ్చాత్యనాగరకతాఘాతమున ప్రాచీన బ్రాహ్మణాచారదుర్గములు శిథిలములయినను ఆ నిబంధనము మాత్ర మిప్పటికి నిలిచిపోయినది. ఈ నియమములను, నిబంధనములను బరిశీలించినచో రాజుల కగ్రహారము లన్న నెట్టి గౌరవప్రపత్తు లుండెడివో, విద్యార్థుల విద్యాభ్యాసమునకు భంగము కలుగకుండ రా జెట్టి జాగ్రత తీసికొని, బ్రాహ్మణుని కెట్టి స్వేచ్ఛ నొసంగుచువచ్చెనో తెలియఁగలదు. ఈవిధమున నగ్రహార మొక చిన్నసంస్థానముగ నుండెను. బ్రాహ్మణుఁడు దాని కధిపతియై రాఁగల సంతతివారి భావి భాగ్యోదయము నాకాంక్షించి సంస్కృతిసూత్రములను పురివెట్టుచుండువాఁడు. ఈ కారణముననే ప్రాచీనకాలమున హిందూదేశమున నేయుద్యమము బయలుదేఱినను అది యెల్ల సంస్కృతికో, మతమునకో సంబంధించినదిగ నే

యుండెను. అట్టి యుద్యమము లన్నియు పల్లెటూరిలోనే ప్రభవించి దేశమునంతను కంపింపఁజేయుచువచ్చినవి.

కొన్ని కొన్ని చోట్ల అగ్రహారములను చేసి బ్రాహ్మణులకు దాన మొసంగునప్పుడు అమితవిద్యాభిమానులైన రాజులు నాయకులు మొదలగువారు కొండ అగ్రహారము లందలి బ్రాహ్మణులకు గృహములను కట్టించి యిచ్చుట యటుండ నొక్కొక్కగృహమునకు కావలసిన సర్వవిధము లైన యుపకరణములను, సంబారములనుగూడ నిచ్చుచు వచ్చినట్లును శాసననిదర్శనములు కొన్ని కలవు. ఈక్రింద నుదాహృతమైన శాసనభాగ మట్టిదే.

గృహాన్ విధాయ విపులాన్ వృత్తి వృత్తివిభాగతః
శయ్యోపధానపర్యంకవిచిత్రా స్తరణాసనైః
దేవోపకరణై ర్గోభి ర్గృహోపకరణై స్తథా
శాలితండులముఖ్యైశ్చ ధనధాన్యై ర్గుడై ర్ఘృతైః
తిలాదిసర్వసంభారై స్సంభృతాం స్తాన్ గృహోత్తమాన్
ప్రవేశ్య ద్విజవర్యాంశ్చ పత్నీపుత్రయుతాన్ ముదా
వస్త్ర యుగ్మంచ సౌక్ష్మం క్షౌశేయం రత్నకుండలే
అంగుళీయక ముఖ్యాని కల్పయిత్వా పృథక్ పృథక్
వస్త్రాభరణతాటంకకంఠసూత్రాదిభూషణైః
బ్రాహ్మణాంశ్చ సపత్నీకాన్ పూజయిత్వాతిభక్తితః
సహిరణ్యపయోధారాపూర్వకం ప్రదదౌ నృపః ।

ఈరీతి నగ్రహారము లన్నియు విద్యానిలయములుగ ప్రసిద్ధివహించినట్లును, మన ప్రాచీన విద్యాసంస్థలలో అగ్రహార మగ్రగణ్యముగ నుండినట్లును అంగీకరింపకతీరదు.

## మహాసభలు, పంచాయతీలు :

అగ్రహారములకైననేమి, గ్రామములకైననేమి మహాసభ లుండెడివి. ఈసభలే ఆయాయి అగ్రహార, గ్రామ వ్యవహారములను చక్కఁబెట్టుచుండెడివి. అగ్రహార వ్యవహారములను చక్కఁబెట్టుట కేర్పడినవారికి మహాసభవా రనియు, సభవా రనియు, మహాజను లనియు పే ర్లుండెడివి. ఒక్కొక్క యగ్రహారము వైశాల్యమునుబట్టియు, వ్యవహారమునఁ జూప వలసిన దక్షతనుబట్టియు సభవారిసంఖ్య కొన్ని కొన్ని చోట్ల తక్కువగను, కొన్ని కొన్ని చోట్ల నెక్కువగను ఉండెడిది. ఇట్లే గ్రామవ్యవహారములను జక్కఁబెట్టుట కేర్పడిన సభకు పంచాయతీసభ యని పేరు. అగ్రహారమహాసభలకును, గ్రామపంచాయతీసభలకును గల భేదమునుగుఱించి యిచట వ్రాయుట యప్రస్తుతము.

ప్రత్యేకము విద్యాప్రదానమునిమిత్తము గాని, లేక దేవస్థానములనిమిత్తము కాని చేయఁబడు దానధర్మముల కీ సభవారు ధర్మకర్తృత్వము వహించువారు. విద్యావిషయకమైనట్టి కాని, మఱి యితరధర్మకార్యములకు సంబంధించినట్టి కాని దానధర్మములు కొన్ని కొన్ని చోట్ల ఈసభవారిపరముగనే చేయఁబడుచుండెడివి. అట్టి సందర్భములలో సభవారే దాతయాశయముల కనుగుణముగ నాయాయి ధర్మకార్యములను నిర్వహించుటకు తగిన కట్టుబాటులు చేయుచుండువారు. దక్షిణహిందూదేశమున మన కీవిధమయిన శాసనము లనేకములు కానవచ్చును.

పుదుచ్చేరి సమీపమునఁగల బాహుగ్రామమున నిట్టి శాసన మొకటి కలదు. అది కాంచీపురము రాజధానిగ నేలిన పల్లవరాజు నందివర్మ కుమారుఁడగు నృపతుంగ వర్మ కాలమునాఁటిది : అనఁగా క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్దినాఁటిది. నృపతుంగవర్మ ప్రధాని – కురుకులోద్భవుఁడును బళాలివంశమార్తాండుఁడునగువాఁడు తన ప్రభువు ననుమతితో బాహు గ్రామవిద్యాస్థానమునకు మూఁడు గ్రామములను దానమొసంగి వానిని ఆ గ్రామసభవారి వశముచేసెను. ఊర్మివంశసమాకులమై క్రిందికి దిగుమందాకినీ నది నేవిధముగా ధూర్జటి తన జటలో నిలిపి వహించెనో అట్లే సభవారుకూడ పదునాలుగుగణములతోఁగూడిన విద్యానదిని వశముచేసికొని కాపాడిరని యాశాసనమున నభివర్ణితమైనది.

## దేవాలయములు :

అగ్రహారములకు పిదప పరిగణింపఁదగిన ప్రాచీనవిద్యాసంస్థ దేవాలయము. పూర్వకాలమున దేవాలయముతో సరిపోల్పఁదగిన మహాసంస్థ ఇంచుమించుగ లేదనియే చెప్పవచ్చును. అది మతధర్మముల నుద్బోధించు గురుపీఠము; వేదచోదితవిద్యాప్రదానముఁ గావించు విద్యానిలయము; మతబోధకు లుపన్యాసములుచేయు నుపన్యాసవేదిక; శాస్త్రజ్ఞులు వాక్యార్థముఁ గావించు సభాభవనము; పౌరాణికు లితిహాసములు వినిపించు సత్రశాల; భాగవతోత్తములు పరమేశ్వరారాధనముఁ గావించు పూజామండపము. అట్టిది పూర్వ

కాలపు దేవాలయము. సాధ్యమైనంతవఱకు ప్రాచీన గ్రామ జీవనము కలఁకబాఱకుండ జాగ్రతగ కాపాడుచువచ్చిన మహాసంస్థ యదియే.

దేవాలయము గొప్ప విద్యాసంస్థయై వైదికవిద్యకు గొప్ప యాలంబముగ నుండినట్లు ముఖ్యముగ దక్షిణాపథము నందలి ప్రాచీన శాసనములవలన తెలియవచ్చుచున్నది. పూర్వ కాలమున దేవస్థానములకుఁ జేసిన దానధర్మములలో విద్యా ప్రదానమునకుఁగూడ నేర్పాటు లుండెడివి. మండలేశ్వరులు, సైన్యాధిపతులు, రాజులు, చక్రవర్తులు విద్యాభిమానమును, మతాభిమానమును గలిగి యొకప్పుడు కాకపోయిన మఱి యొకప్పుడైన తాము దేవస్థానములకుచేయు దానధర్మము లలో విద్యాప్రదానమునకుఁగూడ నేర్పాటులు చేయువారు. దానంజేసి దేవస్థానముకూడ విద్యానిలయమై పేరొందఁ గలిగెను. ఇట్టి విద్యావిషయకపు టేర్పాటులు కలిగిన యొక దాన శాసనము దక్షిణార్కాడు మండలమునందలి త్రిభువణి గ్రామమునఁ గానవచ్చుచున్నది. ఇది చోళదేశమును పరిపా లించిన రాజకేసరివర్మాభిధానుఁడగు ప్రథమ రాజాధిరాజు కాలమునాఁటిది (క్రీ. శ. ౧౦౧౮–౧౦౫౦). ఈ రాజు రాజ్యకాలము ముప్పదవయేఁట రాజేంద్రచోళుఁడను నొక చోళ రాజుకుమారుని కారోగ్యాభివృద్ధి యగునట్లుగా సేనాపతియైన రాజేంద్రచోళ మహాబలి బాణరాయ రనునతఁడు 'రాజేంద్ర చోళనుత్తమాగ్ర' మను పేరఁబరగు ధర్మముఁ గావించెను. తద్ధర్మమునకు సంబంధించిన కార్యవివరముల నాచరణము

నకుఁ దెచ్చుటకై ఆ గ్రామమునందలి మహాసభవా రచ్చటి సభామండపమున సమావేశమై సంవత్సరమునకు ౧౨,౦౦౦ కలముల ధాన్యము వచ్చు ౭౨ వేలీల భూమికొని, దేవ హావిర్బల్యర్చనాదులకును, ఉత్సవాదులకును, శ్రీ వైష్ణవ సంతర్పణములకును, తిరువాయ్ మొజ్జి పఠనమునకును సంవత్సరమునకు ౨,౮౭౫ కలముల ధాన్యము నేర్పాటుచేసి, మిగిలిన ధాన్యము నీక్రిందివిధమున వినియోగించిరి :

(౧) ఋగ్వేదాధ్యాపకులు ముగ్గురు, యజుర్వేదాధ్యాపకులు ముగ్గురు, ఛందోగసామాధ్యాపకుఁ డొక్కఁడు, తలవకారసామాధ్యాపకుఁ డొక్కఁడు, అపూర్వ, వాజసనేయ, బోధాయనీయ, సత్యాషాఢ సూత్రాధ్యాపకు లొక్కొక్కరు మొత్తము పండ్రెండుగురికి దినమునకు నాలుగు కలముల ధాన్యము.

(౨) వేదాంతము, వ్యాకరణము, రూపావతారము, శ్రీ భారతము, రామాయణము, మనశాస్త్రము, వైఖానస శాస్త్రము – వీనిని బోధించు నధ్యాపకు లొక్కొక్కరు.

(౩) ఋగ్వేదాధ్యయనపరు లఱువదిమంది. యజుర్వేదాధ్యయనపరు లఱువదిమంది. ఛందోగసామాధ్యయనపరు లిరువదిమంది. ఇతర శాస్త్రాధ్యయనపరు లేఁబదిమంది – మొత్తము నూటతొంబదిమందికి దినమునకు పదునొకండు కలముల, పది కురుణీల, నాలుగు నాళీల ధాన్యమును.

(౪) వేదాంతము, వ్యాకరణము, రూపావతారము – వీని నభ్యసించు నితర విద్యార్థులు డెబ్బదిమందికిని ఏర్పాటు

కావింపఁబడెను. పై విధమున జరిగిన యేర్పాటులనుబట్టి యధ్యాపకులకును, విద్యార్థులకును భోజనాదికములకై వినియోగింపఁబడిన ధాన్యము మొత్తము ౬,౫౭ ౨౫ కలములు. ఈపైని చేయఁబడిన యేర్పాటులవలన నా విద్యాస్థానమునఁ గఱపఁబడుచుండిన విద్యలేవియో, ఏయేవిద్య నెంద ఱెందఱు విద్యార్థులు నేర్చుకొనుచుండిరో, ఏయేవిద్యలు నేర్పుట కెందఱెంద ఱధ్యాపకు లుండిరో మనకు వివరముగ తెలియుచున్నది. విద్యార్థులకు భోజన వసతిగృహములతో నేర్పాటయిన చిన్న విశ్వవిద్యాలయమువంటిది కాదా ఈ త్రిభువణీ దేవస్థాన విద్యాపీఠము ?

ఇట్టిదే మఱియొక శాసనము ఎణ్ణాయిరము గ్రామమునఁ గానవచ్చినది. అది చోళదేశము నేలిన మొదటి రాజేంద్రచోళుని కాలమునాఁటిది (క్రీ. శ. ౧౦౦౩–౧౦౪౫). ఈ యెణ్ణాయిరము గ్రామమునకే రాజరాజచతుర్వేదిమంగలమనియుఁ బేరు. రాజునకు విజయాభ్యుదయములు కలుగునట్లు ఈ చతుర్వేది మంగళము మహాసభవారు 'రాజరాజవిణ్ణగ' రను దేవాలయమున సమావేశమై కొన్ని ధర్మకార్యముల నొనరించిరి. అవి విద్యావిషయకమైనవి. విద్యార్థులకు విద్యాప్రదానముఁ గావించుటకువలసిన ఏర్పాటులు చేయుటయు, నావిధమున విద్య నేర్చుకొను విద్యార్థుల కొఱకు భోజనశాల నేర్పఱుచుటయు నా ధర్మము ముఖ్యోద్దేశము. ఇందున గూర్చిన వివరణములను శాసన మీ రీతిని దెలుపుచున్నది.

(౧) దేవస్థానమున తిరువాయ్ మొళ్లి స్తోత్రమును పఠించుటకు నలువురు నియమితులైరి. వారి కొక్కొక్కరికి భృతిగ కొంత ధాన్య మిచ్చిన ట్లేర్పాటయి యందుకొఱకు కొంతభూమి యొసంగఁబడెను;

(౨) దేవాలయము నంటియుండు మఠమునం దిరువది యైదుగురు శ్రీవైష్ణవులకు భోజనము పెట్టునిమిత్తము కొంత భూమి యొసంగఁబడెను;

(౩) సప్తాహమునంటి యొకానొక యుత్సవము సందర్భమున వేయిమంది వైష్ణవులకును, ఆ యుత్సవము చూచుటకేతెంచిన దాసులకును అన్నప్రదానముఁ గావించుకొఱకు ౬౦ కలముల ధాన్యమును, ౩ కలంజుల బంగారము నొసంగఁబడెను;

(౪) గంగైకొండచోళమండపమునందు ఋగ్వేదాధ్యయనపరులు ౭౫ గురు, ఛందోగసామాధ్యయనపరులు ౨౦ మంది, తలవకారసామాధ్యయనముచేయువారు ౧౦ మంది, వాజసనేయాధ్యయనపరులు ౨౦ మంది, అథర్వ వేదాధ్యయనపరులు ౧౦ మంది, బౌధాయనీయగృహ్యకల్ప గణాధ్యయనపరులు ౧౦ మంది — ఈవిద్యార్థులకు భోజనవసతి కల్పింపఁబడెను;

పై నుడివిన వేదము లభ్యసించు బ్రాహ్మచారులు మొత్తము ౨౩౦ మంది, రూపావతారము నభ్యసించువారు ౪౦ మంది — మొత్తము విద్యార్థుల సంఖ్య ౨౭౦; వీరికంద

జకు నొక్కొక్కరికి దినమునకు ఆఱునాళీల ధాన్య మేర్పాటు గావింపఁబడెను.

పై నుడివిన వీరుగాక వ్యాకరణము నభ్యసించువారు ౨౫ గురు; ప్రాభాకరము నభ్యసించువారు ౩౫ గురు; వేదాంతము నభ్యసించువారు ౧౦ మంది; వెరసి ౭౦ మంది విద్యార్థులు కలరు. వీరి కందఱ కొక్కొక్కరికి దినమునకు ౧ కురుణి, ౨ నాళీల ధాన్యము నియమితమయ్యెను.

వ్యాకరణాధ్యాపకునికి దినమున కొక్కకలము ధాన్యమును, ప్రాభాకరధ్యాపకుని కొక కలము ధాన్యమును, వేదాంతము బోధించువానికి దినమున కొక్కకలము నొక తూని ధాన్యమును ఏర్పాటుచేయఁబడెను.

వేదాధ్యయనమునకై పదిమంది అధ్యాపకులు నియమితులైరి. ఎట్లన, ఋగ్వేదమునకు ముగ్గురు, యజుర్వేదమునకు ముగ్గురు, ఛందోగసామమున కొకరు, తలవకారసామమున కొకరు, వాజసనేయమున కొకరు, బౌధాయనీయ గృహ్యకల్పకారకముల కొకరు.

రూపావతారము బోధించువానికి దినమునకు ౩ కురుణీల ధాన్యము. దినమున కిట్లు 'రాజరాజమరకాలు'తో ముప్పదికలముల ధాన్యము కొలిచి యిచ్చువారు. ఈరీతి నీ విద్యాపీఠమునకు సంవత్సరమునకు ౧౦,౫౦౬ కలములధాన్యము గుచుండెను. అధ్యాయమున కొకకలంజు చొప్పున వ్యాకరణమున నెనిమిదధ్యాయములకు వ్యాకరణాధ్యాపకుని కెనిమిది కలంజుల బంగారమును, అధ్యాయమున కొక కలంజు చొప్పున

పండ్రెండధ్యాయములకును ప్రాభాకరాధ్యాపకునికి పండ్రెండు కలంజుల బంగారమును ఇచ్చువారు. వేదాధ్యాపకులు, రూపావతారము బోధించువారు మొత్తము పదుముగ్గురికి నొక్కొక్కరికి కఱుకలంజుచొప్పున ఆఱునఱుకలంజుల బంగారమును, ఒక్కొక్కరి కఱు కలంజుచొప్పున వ్యాకరణ, మీమాంసాశాస్త్రము లభ్యసించు డెబ్బదిమంది విద్యార్థులకు ౩౫ కలంజుల బంగారమును ఇచ్చుటకు (విద్యార్థి వేతనము) నేర్పాటు కావింపఁబడెను. ప్రాచీనకాలమున దేశీయప్రభువుల పరిపాలనమున ఆర్యవిద్యల కీరీతిని పోషణ, ప్రోత్సాహము లుండెడివి.

మొత్తముమీఁద నీ ధర్మనిర్వాహణమునకుఁ గావలసిన ౬౧ ౧/౩ కలంజుల బంగారమునకును, ధాన్యమునకును దేవస్థానమునకు సంప్రదత్తమయినది ౪౫ వేలీలభూమి.

ఈ విధమైన విద్యాదానశాసనముల నెన్నియైనను చూపవచ్చును. వీరరాజేంద్రచోళదేవుని (క్రీ. శ. ౧౦౬౩—౧౦౬౯) తిరుముక్కూడల్ శాసనముకూడ నిట్టిదే. ఆ శాసనమువలన నీ క్రిందిసంగతులు తెలియుచున్నవి:

తిరుముక్కూడల్ మహావిష్ణ్వాలయమున జననాథ మండప మనుపేర నొక మండపము కలదు. అందు వేద, శాస్త్ర, వ్యాకరణ, రూపావతారములను బోధించు నొక విద్యాస్థానమును, అధ్యయనపరులగు బ్రహ్మచారుల కొక భోజనశాలయు, వైద్యమునిమిత్త మొక వైద్యాలయమును ఉండెను. బ్రహ్మచారులకు భోజనమునకును, ప్రతిశనివారము

నభ్యంగార్థము తైలమునకును, రాత్రులు చదువుకొనుటకు దీపములకై చమురుకును ఏర్పాటు లుండెడివి. ఈ దేవ స్థానమునందలి వైద్యాలయమునకు వీరచోళవైద్యాలయ మని పేరు. అందు వ్యాధిగ్రస్తులనిమిత్తము పదునైదు మంచము లుండెను. వైద్యాలయ పోషణమునకును, రోగ గ్రస్తుల సౌఖ్య సౌకర్యములకొఱకును ప్రత్యేక మీ క్రింది యేర్పాటులు చేయఁబడినవి: (౧) బియ్యము; (౨) వంశ పారంపర్యముగ వైద్యము నభ్యసించు కుటుంబములోని యొక వైద్యుఁడు; (3) ఒక శస్త్రవైద్యుఁడు; (౪) మూలి కలు తీసికొనివచ్చుటకును, వంటచెఱకుఁ గొనివచ్చుటకును, వైద్యాలయమునకు సంబంధించిన తక్కిన పనులు చేయుటకు ఇరువురు సేవకులు; (౫) రోగులకు సపర్యచేయుకొఱ కిరువురు దాసీలు; (౬) భోజనశాల. వైద్యశాలల కొకసేవకుఁడు.

సంవత్సరమునకు సరిపోవు ఈ క్రిందిమందులు వైద్యా లయమున నిలవచేసియుంచువారు: (౧) . . . ఆశాహారీతకి- రెండుపళ్లు; (౨) గోమూత్రహారీతకి - రెండుపళ్లు; (3) దశ మూలహారీతకి - ఒకపడి; (౪) భల్లాతకహారీతకి - ఒకపడి; (౫) గండీరము - ఒకపడి; (౬) బాలాకోరండతైలము - ఒక తూని; (౭) పంచా. . . తైలము - ఒకతూని; (౮) లశు . . . ండతైలము - ఒకతూని; (౯) ఉత్తమ కర్ణాదితైలము - ఒక తూని; (౧౦) . . . ఘృతము - ఒకపదక్కు; (౧౧) బిల్వాది ఘృతము - ఒకపదక్కు; (౧౨) మండూకరవటకము — ౨,౦౦౦; (౧3) త్రివృత్తి - ఒకనాళి (౧౪) విమలై —

౨,౧౧౦; (౧౫) తామ్రమూది–౨,౦౦౦; (౧౬) వజ్రకల్పము – ఒకతూని, ఒకపదక్కు; (౧౭) కల్యాణలవణము– ఒకతూని, ఒకపదక్కు; (౧౮) ఈ మందుల నుపయోగించుటలో నావశ్యకమైన యితర మూలికలు, పురాణసర్పి తయారుచేయుట కాలనేతికిని, రాత్రి యంతయు దీపముపెట్టుటకు నూనెకును నేర్పాటు లుండెను.

పై కొలతలలోను, తూనికలలోను జెప్పిన పడి చెన్నపురి పడి, నాళి, తూని, పదక్కు అనువానికిఁగల పరస్పర సంబంధమును నిశ్చయించుటకు తంజావూరు చోళరాజుల శాసనములు మన కుపకరింపఁగలవు. వాని సాయమున నీ క్రిందిరీతిని మానము కట్టుట కవకాశము కలదు.

| | | | |
|---|---|---|---|
| ౨ అళాకులు | — | ౧ | ఉళక్కు |
| ౨ ఉళక్కులు | — | ౧ | ఉరి |
| ౨ ఉరులు | — | ౧ | నాళి |
| ౧౬ నాళులు | — | ౧ | పదక్కు |
| ౨ పదక్కులు | — | ౧ | తూని |

దీనివలన పదక్కు తూనిలో సగమనియు, ఒక్కొక్క పదక్కుకు ౧౬ నాళు లనియుఁ దేలుచున్నది.

దేవాలయధర్మములు కేవలము హావిర్బల్యర్చనాదుల నిమిత్తమేకాక విద్యావిషయములకుఁగూడ పూర్వ మెట్లు వినియోగపడుచుండెనో పూర్వోక్తశాసనములవలన తెలియఁగలదు. ఇంతటి కట్టుబాటులమీఁద, నంతటి యుదారాశయ

ములతో సంస్థాపితములయిన విద్యాస్థానములు ప్రశంసాపాత్ర ములుకదా! గ్రంథవిస్తరభీతివలనఁగాని లేనిచో ఇంకను ఇట్టి విషయములను తెలుపు శాసనము లనేకములను చూప వచ్చును.

దేవాలయములకు పిదప పేర్కొనఁదగిన విద్యా సంస్థలు మఠములు. బౌద్ధుల సంఘారామములవలెనే జైన మతస్థుల బస్తీలును, జినాలయములును, శైవ వైష్ణవాద మతములకు సంబంధించిన మఠములును ఆయాయి మతముల వ్యాపనమునకుమాత్రమే కాక విద్యాభివృద్ధికిని ఎక్కువగ తోడ్పడినవి. అగ్రహారములు, దేవాలయములవలెనే పూర్వము ఈ మఠములును గొప్ప విద్యాబోధకసంస్థలుగ ప్రసిద్ధికెక్కి యమితప్రయోజన కారులయినవి.

## జైనబస్తీలు :

బౌద్ధమతము దక్షిణాపథమున రూపుమాయుటకుఁగల ప్రబలకారణములలో జైనమత విజృంభణ మొకటి. క్రీస్తు శకము రెండవశతాబ్దినుండి జైనమతము బాగుగ వర్ధిల్లినది. సామంతభద్రుఁడు, అకలంక చంద్రుఁడు, విద్యానందుఁడు, మాణిక్యనంది, ప్రభాచంద్రుఁడు, జినసేనుఁడు, గుణభద్రుఁడు- ఈ మొదలగు విద్వద్వతంసులైన జైనాచార్యులు గొప్ప గొప్ప గ్రంథములు వ్రాసి, రాజాస్థానముల కేగి విమతవాదు లతో ప్రతివాదములు చేసి జైనమతమును దేశమున వ్యాపిం పఁజేసిరి. అందువలన దక్షిణ గాంగవంశజుల కాలమునను, రాష్ట్రకూటనృపతుల కాలమునను, కళచురి ప్రభువుల కాల

మునను జైనము రాజమతమై కీర్తిఁగాంచెను. కన్నడదేశమున 'శ్రవణబెళగొళ' మొదలగు పుణ్యక్షేత్రములు జైనమతవిద్యకు ప్రధానపీఠములయినవి.

తెలుఁగుదేశమునఁగూడ జైనమతము వ్యాపింపక పోలేదు. ఆంధ్రదేశమునందలి ఆయాయి గ్రామములయందు గానవచ్చు జైనవిగ్రహములే ఆ మత మొకప్పు డిచట బాగుగ వ్యాపించె ననుటకు ప్రబలనిదర్శనములుగ నున్నవి. ఆంధ్రదేశము నేలిన పూర్వచాళుక్యప్రభువులు జైన, శైవ మతములు రెంటిని సమానముగ నాదరించినట్లు శాసనప్రమాణము కలదు. (మూఁడవ) విష్ణువర్ధనుఁడు (క్రీ. శ. ౭౧౮—౭౫౨), అమ్మరాజ విజయాదిత్యుఁడు (క్రీ. శ. ౯౪౫—౯౭౦), విమలాదిత్యుఁడు (క్రీ. శ. ౧౦౧౧-౧౦౧౮) ఈ మొదలగు వారందఱు జైనమతము నాదరించి, జినాలయములకు దానములు కావించిరి. జైనమత మంధ్రదేశమునం దంతట వ్యాపించినట్లు నిదర్శనము లున్నను జైనమతపీఠములు కొన్ని మాత్రమే ప్రధాన విద్యాస్థానములుగ నుండినట్లు కన్పట్టును. బెజవాడ (కృష్ణజిల్లా), ధర్మవరము (గుంటూరు), రామతీర్థము (విశాఖపట్టణము), హనుమకొండ (ఓరుగల్లు, దానవులపాడు (కడప)—ఈ మొదలగునవి ఆంధ్రదేశమునందలి ప్రసిద్ధ జైనమతపీఠములుగఁ గన్పట్టును. జైనుల 'పళ్ళి'లు, 'బస్తీ'లు జైనమతవిద్యను వ్యాపింపఁజేయుటకు నెక్కువగ తోడ్పడినవి. జైనబస్తీ చిన్నచిన్న పేటలతోను, పెక్కు జినాలయములతోను గూడిన బ్రాహ్మణాగ్రహారము వంటి

రొక జైనాగ్రహారముగ భావింపవచ్చును. జైనమతస్థులలో యతులకువలెనే యోగినులకుఁగూడ ప్రత్యేకమఠము లుండెడి వని తెలియుచున్నది. ద్రవిడదేశమున చోళరాజధానియైన కావిరిప్పూం బట్టణముననుె, గావేరీతీరమునఁగల యొఱియూరి యందును జైనమఠము లుండెడివి. ఇట్టి జైనమఠములను గుఱించి కాని, అందలి మతవిద్యావిధానముగుఱించి కాని మనకు వివరములు తెలియవు. కాని ప్రతిముఖ్యమఠమును నసంఖ్యములయిన మత గ్రంథములకు నిలయమగుట నది యొక గొప్పగ్రంథభాండాగారమయి వెలయుచుండెడిది. ప్రాచీన గ్రంథాన్వేషకు లనేకులకు తాళపత్ర, భూర్జపత్రా ద్యముద్రిత ప్రాచీన జైనమతగ్రంథము లనేకములు ఇట్టి మఠములయందే దొరకినవి.

## శైవమతములు :

జైనమతమునకు పిదప దక్షిణాపథమున బాగుగ వర్థిల్లిన మతము శైవము. శైవమతము చోళదేశమున 'సనాది'గ నుండినను దాని నా దేశముననే కాక దక్షిణాపథ మంతట నెక్కువగ వ్యాపింపఁజేసినవారు కాలముఖులు, పాశుపతులు అనఁబరగు శైవులు. కాలముఖ, పాశుపతము లనునవి శైవ మతమునందలి రెండు సంప్రదాయములు. క్రీస్తుశకము పది, పదునొకండు, పన్రెండు శతాబ్దులం దీమత మెక్కువగ దేశ పరివ్యాప్తమయ్యెను. అప్పుడు చేది, చోళ, మాళవ దేశాధి పతులును, పశ్చిమచాళుక్య, పూర్వచాళుక్య, కాకతీయాది రాజవంశజులునుగూడ ఈ మతము నవలంబించి, దీని కెక్కువ

యాదర, ప్రోత్సాహముల నొసంగిరి. శైవమతవిజృంభణము ప్రథమదశలో కాలముఖాచార్యులు దేశమున ప్రబలి పెక్కు దేవస్థానములకు స్థానపతులుగ నుండి మతమును, విద్యను వ్యాపింపఁజేసిరి. వీరు మొదట కాశ్మీర దేశముననుండి వచ్చినవారని కొన్ని శాసనములు తెలుపుచున్నవి. గంగాతీరమున నుండి వచ్చినవారని మఱికొన్ని గాథలు కలవు. ఎట్లయిననేమి, వీరు ఆర్యదేశ, మధ్యదేశ, గౌడదేశవాసు లనియు, ఉత్తరాపథముననుండి వచ్చినవారనియు స్పష్టమగుచున్నది. సాధారణముగ నీ కాలముఖ, పాశుపతాచార్యనామములు పండిత, శివపండిత, శక్తి, శివ, రాసి పదాంతములుగఁ గాన వచ్చును: ఉదా: విశ్వేశ్వరపండిత, ఈశానశివపండిత, వామశక్తి, జ్ఞానశివ, నాగరాసి. సాధారణముగ పాశుపతులు పండిత, శివపదాంచితులు. మంచన పండితుఁడు, శ్రీపతి పండితుఁడు, మల్లికార్జునపండితుఁడు - వీర లెల్లరు పాశుపత శైవులే. ఇందువలననే మల్లికార్జున పండితారాధ్యులు తన 'శివతత్త్వసారము'న 'పశుపతి'మతమునే యుద్ఘాటించెను.

ఆంధ్రదేశమున శైవమతమునకు పూర్వచాళుక్యులును, కాకతీయులును ఎక్కువ ప్రోత్సాహాదరములను చూపి దాని కాలంబమై నిలిచిరి. పూర్వ చాళుక్యుల కాలమున పాశుపత, కాలముఖములు రెండు నున్నను కాకతీయుల కాలముననే పాశుపతము ఎక్కువగ జనాదరమును గడించి పేరు మోసినది.

ఇంతవఱకుఁ బ్రకటితమైన యంధ్ర దేశ శాసనములలో మొట్టమొదటి మాఱు పాశుపతులప్రస్తావము ఇమ్మడి చాళుక్య విష్ణువర్ధనుని శాసనములలోను, కాలముఖుల ప్రస్తావము చాళుక్య అమ్మరాజ విజయాదిత్యుని శాసనములలోను కలదు. శాసనములలో కాలముఖులు కాలాముఖు లనియు వ్యవహృతులైరి. ఈ శాసనములలోని పాశుపతులును, కాలాముఖులును వేదవేదాంగాది సర్వవిద్యాసంపన్నులు; విద్యాప్రదానముఁ గావించుటలో దీక్షాకంకణము కట్టినవారు. వీరిని 'శిష్యచాతకవర్షాగమము'లని కన్నడశాసనము లభివర్ణించుచున్నవి. వీరి వక్కాణ కన్నడశాసనములం దిట్లు కలదు :

'యమ నియమ స్వాధ్యాయ ధ్యాన ధారణ మౌనానుష్ఠాన జప సమాధి శీల గుణ సంపన్నరుం, విబుధజన ప్రసన్నరుం, సకలసుకవినికురుంబాధారరుం, అన్నదాన సువర్ణదాన కన్యాదాన గోదాన భూదాన అభయ భైషజ్యానేకదానవినోదరుం, లాకుళాగమాభరణరుం, సమస్త శాస్త్రాగమ విచారాచారచతురరుం...'

కాలముఖులును, పాశుపతులునుగూడ మఠముల ద్వారముననే తమ మతమును, విద్యనుగూడ వ్యాపింపఁ జేసిరి. శైవమత విజృంభణకాలమున శైవమఠములు దేశమున నెల్లెడల వలవలె నల్లుకొనినవి.

కన్నడ, ద్రమిళ, ఆంధ్ర దేశములం దాకాలమున విద్యాప్రదానముఁ గావించు పెక్కు శైవమఠములు మొలక

త్తెను. ఆంధ్రదేశమున శ్రీశైలము, కాళేశ్వరము, భీమేశ్వరము మొదలగునవి శైవులకు ప్రధాన పుణ్యక్షేత్రములు.

క్రీస్తుశకము పదునొకండవ, పండ్రెండవ శతాబ్దులలో పాశుపతశైవసంతానమునకు ప్రధానమైనది భాగీరథీ నర్మదా నదులకు మధ్యనుండు డాహలదేశమునందలి గోళకీమఠము. తెలుఁగుదేశమున పెక్కుమఠములు కట్టించినవారీ మఠమునకు సంబంధించిన యాచార్యులే. ఈ గోళకీమఠ శాఖలు కన్నడదేశమునను ద్రమిళదేశమునను గూడ నుండెను. ప్రధాన గోళకీమఠశాఖలు తెలుఁగుదేశమున కడపమండలములోని పుష్పగిరియందును, కర్నూలుమండలమున త్రిపురాంతకమందును, గుంటూరుమండలమున మందారము (మందడము) నందును వెలసినవి. ఈ గోళకి క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దినుండి దక్షిణాపథమునందెల్ల మిక్కిలి ముఖ్యమైన మతవిద్యాసంస్థగ నుండినట్లు శాసనములవలనఁ దెలియవచ్చును.

విశ్వేశ్వరగోళకి : ఆంధ్రదేశమున పదుమూఁడవ శతాబ్దిలో గుంటూరుమండలమునందలి మందారమునంగల విశ్వేశ్వరగోళకి సుప్రసిద్ధమైన శైవమఠము. దానిని నెలకొల్పిన శివాచార్యుఁడు కాకతీయ గణపతిదేవచక్రవర్తికి చిన్మయదీక్ష నొసంగిన రాజగురువగు విశ్వేశ్వరశివమహాముని. గణపతిదేవచక్రవర్తి కూఁతురైన రుద్రమదేవి యానుకృతికి శాలివాహనశకము ౧౧౮౩ న దుర్మతినామసంవత్సర చైత్ర బహుళ శుక్రవారమునాఁడు వెలఁగపూఁడిసహితముగ

మందార గ్రామమును దానముచేసెను. విశ్వేశ్వరశివమహాముని ఆ దానమును పరిగ్రహించి యచ్చట నొకవిశ్వేశ్వరాలయమును, మఠమును, బ్రాహ్మణుఁడు మొదలు చండాలుని పర్యంతము వర్ణవివక్ష లేకుండ నిరతాన్నప్రదానముఁ గావించుట కొకసత్రమును గట్టించి, బ్రాహ్మణులను రావించి వారికి వృత్తులు, నివేశనములు నిప్పించి యాగ్రామములోని మఠమునకు విశ్వేశ్వరగోళకీయని పేరిడెను. వెలగపూఁడి సహితమైన మందారగ్రామమున నలువది ద్రావిడ బ్రాహ్మణ కుటుంబముల కొక్కొక్క కుటుంబమునకు రెండుపుట్ల భూమి చొప్పున నీయఁగా మిగిలినదానిని మూఁడుభాగములు చేసి, యం దొకభాగము విశ్వేశ్వరస్వామికిని, మఱియొకభాగము విద్యార్థులకును, శుద్ధశైవమఠమునకును, మూఁడవభాగమును ప్రసూత్యారోగ్యశాలకును (Maternity Hospital), విప్రసత్రమునకును నిచ్చివేసి, ఋగ్యజుస్సామవేదములు అధ్యయనము చేయించు మువ్వు రధ్యాపకులను, పదవాక్య ప్రమాణము (Logic), సాహిత్యము (Literature), ఆగమములు బోధించుట కయిదుగురు వ్యాఖ్యాతలను, వైద్యు నొకనిని, గణకుఁడు కాయస్థు నొకనిని నియమించెను.

ఈ పైనుడివిన పదిమందికి నొక్కొక్కరికి రెండుపుట్ల భూమి నొసంగెను. పై వారితోఁబాటు, దేవాలయమున పదిమంది నర్తకులును, ముఖరీద్వయసంయుక్తులగు నెనమండ్రు మార్దంగికులును, ఒక కాశ్మీరదేశపు గాయకుఁడును, పదునలుగురు గాయినులును, 'కరడా' వాద్యమునందును నాట్యము

నందును నేర్పరులైనవా రాఱుగురును నియమితులైరి. వీరికి వృత్తు లేర్పాటుచేయఁబడెను. అంతియేకాక, చాతుర్వర్ణ్య సముద్భూతులైనట్టియు, జటాధారులైనట్టియు, గ్రామ సంరక్షణము నభిలషించి బీజచ్ఛేద, శిరచ్ఛేద, కుక్షిభేదాది కర్మలం జేసికొనునట్టియు చోళదేశాగతులైన 'వీరభద్రు' లను పేరంబరగు గ్రామరక్షకులు పదిమందికిని, గ్రామ భటు లును శివభక్తులు నగు నీరముష్టు లిరువదిమందికిని, బంగా రము, రాగి, మంగలిపని, కాసె, మేదరి, కమ్మరి, కుమ్మరి పనులు, వడ్రంగముచేయు గ్రామభటులును, వాస్తుశాస్త్రజ్ఞు లును అగు పదిమందికిని వృత్తు లొసంగఁబడెను. విశ్వేశ్వర గోళకీయందు కేవలము విద్యాప్రదానముమాత్రమే కాక ప్రసూత్యారోగ్యశాలకూడ నేర్పాటు చేయఁబడినది. ఇది యెంతయు ప్రశంసింపఁదగినవిషయముకదా!

కన్నడదేశమునందలి బెళగామిలోని కోడియమఠ నామాంతరమునంబరగు కేదారేశ్వరాలయము సుప్రసిద్ధ విద్యాస్థానము. ఈ విద్యాస్థానమున వేదవేదాంగములును, కుమార పాణిని శాకటాయనుల వ్యాకరణశాస్త్రములును, న్యాయ వైశేషిక మీమాంసా సాంఖ్యాది దర్శనములును, లకులీశపాతంజల్యాది యోగశాస్త్రములును, కావ్య నాటక ధర్మశాస్త్రేతిహాసాదులును బోధించువారు. ఆనాఁడు వైదిక విద్యాప్రదానము గావించు మఠములలో వైద్యశాలలుకూడ నుండినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. పూర్వోక్త మగు కోడియమఠము 'నానానాథరోగిజనరోగభైషజ్య స్థానము' (దిక్కులేని రోగులకు చికిత్సచేయు వైద్యశాల)

అని పేర్వడసినది. ఇట్టి మతములు శ్రీశైలమున (౧) భిక్షా వృత్తిమతము; (౨) అనుసుమతము; (౩) కలుమతము; (౪) సారంగమతము; (౫) గణమతము అని యైదుండెడివి. వీనిలో భిక్షావృత్తిమతము విద్యావ్యాపనము చేయుటయే కాక కవి జనముల నాదరించికూడ కీర్తికెక్కినది.

## వైష్ణవమతములు :

వైష్ణవమతోద్ధరణమునకై శ్రీమద్రామానుజాచార్యులకు పూర్వమే నాథముని, పుండరీకాక్షులు, యామునాచార్యులు మొదలగువారు కృషిచేయుచుండినను రామానుజాచార్యులవారు మతరంగమున కవతరించుటతోఁగాని శ్రీవైష్ణవమునకు బలము కలుగలేదు. ఆచార్యులవా రామతమును సరియైన మార్గమునకుఁ దెచ్చి దక్షిణాపథ రాజన్యులను కొందఱిని వశపఱచుకొని వారికి వైష్ణవమత మిప్పించినపిదప నుండి క్రమక్రమముగా నా మతము పురికొని తీఁగసాగెను. శ్రీ రామానుజాచార్యులవారికిఁ దరువాత వేదాంత దేశికులు, మనవాళమహాముని మొదలగువా రాదుకొని దానిని చక్కఁగా వ్యాపింపఁజేయ చాల కృషిచేసిరి. అయినను కర్ణాటాధీశుఁడైన శ్రీ కృష్ణదేవరాయల కాలముననుండిగాని యంధ్ర దేశమున వైష్ణవమతము బాగుగ విజృంభింపలేదు. కృష్ణదేవరాయలు మొదలు కర్ణాటాధీశులైన అచ్యుతదేవరాయలు, సదాశివరాయలు, వేంకటపతిరాయలు, శ్రీ రంగదేవరాయలు మొదలగువారి యాదర ప్రోత్సాహములవలన వైష్ణవము దక్షిణదేశమున నులుకులిడుచు నభివృద్ధిగాంచెను.

క్రీస్తుశకము పదునొకండు, పండ్రెండు, పదుమూఁడు శతాబ్దము లందు శైవమతము ఎట్లు చోళ, చాళుక్య, కాకతీయాది రాజవంశముల యాశ్రయమున విజృంభించెనో యట్లే వైష్ణవ మును పదునాలు, పదునేడు శతాబ్దులలో విజయనగరాధీశ్వ రులు కర్ణాట భూపతుల కాలమున రాజమతమై జనాదరము నొందెను. కందాళమువారు, తాళ్లపాకమువారు మొదలగు సుప్రసిద్ధ వైష్ణవాచార్యుల కుటుంబములు ప్రముఖత వహించి వైష్ణవమతోద్ధారమునకై నడుముకట్టి పనిచేసినవి. శ్రీ తిరుమల తాతాచార్యులవారు, తిరుమల శ్రీనివాసాచార్యుల వారు, కందాళం అప్పలాచార్యులవారు, కందాళం భావనా చార్యులవారు, కందాళం దొడ్డయాచార్యులవారు, తాళ్ళ పాకం తిరుమలాచార్యులవారు, పరవస్తు ముమ్మడి వరదా చార్యులవారు, కోటికన్యాదానం తాతాచార్యులవా రనఁ బడు ఏటూరి తిరుమల కుమార తాతాచార్యులవారు, పరాం కుశ వణ్ శఠగోపజీయంగారు - ఈమొదలైన విద్యద్వరేణ్యులు వైదమార్గప్రతిష్ఠాపనాచార్యులును, ఉభయవేదాంతప్రవర్తకు లునై విజయనగర కర్ణాటాధీశుల కాలమున ప్రసిద్ధులైరి. గాఢమైన వీరి మతాభిమానమువలనను, కార్యదీక్షవలననే వైష్ణవము రాజమతమై పెంపుచెందఁగలిగెను. శ్రీకృష్ణ దేవరాయలనాఁడు విజృంభింప మొదలిడిన యీ మతము వీరప్రతాప శ్రీరంగ దేవరాయల కాలమునాఁటి కత్యుచ్ఛ దశకు వచ్చెను. ఆ కాలమున కర్ణాటాధీశులే కాక వారి సామంతులును సేనాపతులునుగూడ నీ మతము నవ లంబించి దాని నాదరించిరి. ఆంధ్రదేశమునందలి జమీాన్

దారు తెల్లపు (శ్రీ)వైష్ణవము నవలంబించిన దీకాలముననే. తన్మతాచార్యుల గాఢదీక్షయు, మతాభిమానమును అప్పటి నుండి యిప్పటివఱకు తెలుఁగుదేశముపై చెక్కు-చెదరక యుండునట్లు తమ ముద్రల నచ్చొత్తినవి.

(శ్రీ) రామానుజాచార్యులవారు మేలుకోటలో స్థాపించిన యతిరాజమఠము, మన్నారు కోవెలయందలి వైష్ణవమఠమైన శెండలంగారమామునీ, అహోబలమఠము, పరకాల మఠము – ఇవి యన్నియు వైష్ణవమఠములు.

ఇవికాక వ్యాసరాయమఠము, శృంగేరీమఠము మొదలగు ద్వైతాద్వైతాదిమఠములును కలవు. కాని శైవమఠములనుగూర్చివలె వీనిని గుఱించిన విశేషములు శాసనములవలన బాగుగ తెలియవచ్చుట లేదు. ఈ మఠము లన్నియు నాయాయి మతములను దేశమున సుస్థిరముగ పాదుకొలుపుటకుమాత్రమే కాక వైదికవిద్యాప్రదానముఁ గావించి గొప్ప గొప్ప విద్వాంసులను, కవులను తయారుచేయుటకును ఎక్కు-వగఁ దోడ్పడినవి.

• పూర్వోక్తములయిన మన ప్రాచీన విద్యాసంస్థలను గుఱించియు, విద్యాపద్ధతినిగుఱించియు గాఢముగ యోజించినచో పల్లెటూరిజీవన మెంత నిరాడంబరముగ నుండెనో, యీ సంస్థలు నాపద్ధతియు నంత నిరాడంబరముగ నుండెడివని స్పష్టము కాఁగలదు. పెద్ద పెద్ద కళాశాల లక్కఱలేదు; కూర్చుండుటకు పెద్ద పెద్ద కుర్చీలు కాని, బల్లలు కాని యక్కఱలేదు. పవిత్రమైన భక్తిభావముతోను, త్యాగశక్తితోను నిండి నిబిడీకృతమైయుండు దేవాలయములును, మఠములును విద్యాస్థానములు. చక్కని పంట పైరులతోను,

తోటలతోను ప్రకృతికి కంఠాభరణములవలెనుండు సగ్రహార ములే గొప్పవిద్యాపీఠములు. అందు నిత్యము విద్యార్థులకు గురుజనపూజనము, పరమేశ్వరారాధనము, సజ్జనసాంగత్యము. గురువును శిష్యుడు ఛాయవలె ననుసరింపవలసినదే; తండ్రివలె శుశ్రూష చేయవలసినదే; దైవమువలె పూజింపవలసినదే. అచ్చట పారలౌకికజ్ఞానము నొసంగి గురువు ఆచార్యుఁ డగుచున్నాడు; విద్యార్థిని కన్నకొడుకువలె నాదరించి తండ్రి యగుచున్నాఁడు: ఐహిక జీవితము నెట్లు గడపవలెనో తెలిపి దేశికుఁ డగుచున్నాఁడు. భక్తి ప్రేమములే వారికిఁగల యను బంధములు; గురువృద్ధజన మార్గానుసరణమే వారి రాచబాట; స్వధర్మనిర్వహణమే వారి కార్యదీక్ష; సనాతనధర్మసంరక్షణమే వారి నిరంతరకృషి. పడిపోయినది ఎప్పుడో రాజమార్గము. విజ్ఞానజ్యోతి దేశమున వెలిఁగించి త్రోవచూపినవారు ఆర్య మహర్షులు. అంతే, నిరాతంకముగ, నిరాడంబరముగ అంతిములేని కాలవాహినివలె విద్యాతంతువు సాగిపోవలసినదే. గురువుననుండి శిష్యుఁడు, శిష్యునినుండి గురువు, గురువులో శిష్యుఁడు, శిష్యునిలో గురువు తయారైన కాల మది. భావి ఫలప్రాప్తికి వర్తమానకాలమున బీజములు నాటఁబడుచుండెను. భూతకాలపు ప్రతిభావిభూతులు భావికాలమున ఇనుమడించిన కాంతితో తెఱలి తేజరిల్లుచువచ్చినవి. ఒక్కటే మార్గము; ఒక్కటేమాదిరి చక్రపరిభ్రమణము; బింబమునకు ప్రతిబింబము; అంతే. మార్పు లేదు; క్రొత్త కూర్పు లేదు. ఆ కాలము వేఱు; ఈ కాలము వేఱు; కాని ఇదికూడ ఆ గత కాలపు పరిణామమే కదా!

# ప్రాచీన వృత్తివిద్యావిధానము

పూర్వము వేదములు, శాస్త్రములు మొదలగునష్టాదశ విద్యలును బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను ద్విజుల యధీనమున నుండెను. మిగిలిన విద్యలు, అనఁగా కమ్మరము, కుమ్మరము, కంచరము, నగలు నాణెములు చేయుట, ఇండ్లు మిద్దెలు మేడలు కట్టుట, వంతెనలు కట్టుట, దేవాలయములు గోపురములు నిర్మించుట, రథములు బండ్లు చేయుట – ఈ మొదలగున వన్నియు విశ్వబ్రాహ్మణవశమున నుండి వారి పారిశ్రామికవిద్యల కధికారులుగ నుండిరి.

## వృత్తివిద్య, కులములు :

ఒక్కొక్కవృత్తి నవలంబించువారు కుల మనుపేర నొక్కొక్క సంఘముగ నేర్పడిరి. ఇప్పటి కులములలో ననేకములు సాధారణముగ వృత్తుల ననుసరించి యేర్పడినవే. ఒక్కొక్కకులమువారు ఒక్కొక్క విద్యను కాపాడి పోషించుచువచ్చిరి. అందువలన నీవిద్యలకు కులవిద్య లనియు, వేలు వేలు వృత్తులకు సంబంధించినవగుటచేత వృత్తివిద్య లనియు పేరు. ఈ విధమైన విద్యనే ఇప్పుడు సాంకేతికవిద్య (Technical education) అనుచున్నారు.

వృత్తివిద్యను నేర్పుటకు పూర్వము మన దేశమున నిప్పటివలె కళాశాలలు కాని, విద్యాలయములు కాని యుండెడివి కావు. వృత్తివిద్యా నిపుణులైన వృద్ధులు వారి

కర్మశాల (Work shops) లందే వారి వారి కులములందలి బాలకులకు విద్యాప్రదానముఁ గావించువారు. అందువలన నట్టిబాలురు నేర్చువిద్య అనుభవయుక్తమైనదగుటచేత వారికిని, సంఘమునకు నుపయోగపడునట్టిదిగ నుండెను. వృత్తివిద్య నేర్చుకొను విద్యార్థి తన వినయవిధేయతలవల నను, విద్యయందలి భక్తి శ్రద్ధలవలనను తన గురువు మనస్సు రంజించి ఆతనిని మెప్పించినచో అతని వివేకమును, శ్రద్ధను, ఆసక్తిని పరీక్షించి ఆతఁడా విద్యార్థికి వృత్తివిజ్ఞానరహస్య ముల నుపదేశముచేయువాఁడు. అందువలన వృత్తివిద్యాభి మాని దీక్ష వహించి యొడలు వంచి వినయవిధేయతలతో పని చేసి తన గురువును మెప్పింపఁ జూచువాఁడు. విద్యార్థి ఏమాత్రము విద్య నేర్చుకొనినను అది స్వానుభవపూర్వకముగఁ బడసినదగుటచేత జీవయాత్ర సుఖముగఁ గడపుకొనుట కత నికి తోడ్పడుచుండెను. ఏవృత్తియందైననుసరే నిపుణులైనవా రెచ్చట నున్న నచ్చటి కేగి విద్యార్థులు విద్య నేర్చుకొను చుండువారు. విద్య తండ్రియొద్ద కొడుకు నేర్చుకొనినను, అన్నయొద్ద తమ్ముఁడు నేర్చుకొనినను నేర్చుకొనునంతకాలము విద్యార్థి బంధుభావమునుగాక గురుశిష్యభావమునే పాటించు వాఁడు. అందువలన కర్మాగారములలో పనిచేసినందులకు తండ్రి కొడుకునకును, అన్న తమ్మునికిని వేతన మొసంగు వాఁడు. శాల విడిచినపిదప ఉభయులును ఆప్తబంధువులే. హిందువులది సమష్టి కుటుంబము గనుక కర్మశాలలో తండ్రి యిచ్చిన జీతము కొడుకును, అన్న యిచ్చిన వేతనము తమ్ముఁడును ఇంటికి వచ్చినపిదప కుటుంబధర్మము ననుసరించి

వారి వారికి నిచ్చివేయువారు. ఈవిధమున వృత్తివిద్య లన్నియు పూర్వము తండ్రివలననుండి కొడుకునకును, అన్న వలననుండి తమ్మునకును వంశపారంపర్యముగ వచ్చుచుండెను. ఏకులమున కాకులమువారు తమ కులవిద్యనే కాని యితరము లను నేర్చుకొనరా దనుకట్టుబా టుండెడిది. తమకులవిద్యను విడిచి అన్యకులవిద్యను చేపట్టుట కులద్రోహముగ పరిగ ణింపఁబడుచువచ్చెను. స్వధర్మమే శ్రేయో దాయకము : పరధర్మము భయావహము : ఆచరణాయోగ్యము. ఇట్టి నమ్మకము ప్రబలముగ వ్యాపించి యుండుటయే

వెలివిద్య లెన్నియైనను
గులవిద్యకు సాటి రావు కుంభినిలోసన్
వెలకాంత లెంద ఱున్నను
గులకాంతకు సాటి రారు గువ్వల చెన్నా !

మున్నగు పద్యములు పుట్టుటకు కారణమయినది. ఇట్లు ఆయాయి కులములవారు తమ తమ కులముల కేర్పడిన విద్యలను, ప్రాణతుల్యముగ నెంచి పోషించుచువచ్చిరి. అట్టి పారిశ్రామికకులజుల కుటీరములే వృత్తి విద్యాలయములుగ నేర్పడినవి. అవి గొప్ప పారిశ్రామికనిలయములై పేరు గాంచి దేశైశ్వర్యమును పెంపొందించినవి. నేటివలె భౌతిక శాస్త్ర విజ్ఞానము వికసింపని ఆ 'మోటు' దినములలోనే ప్రపంచ మంతటఁ బేరువడిన వస్తుజాలమును తయారుచేసి హిందూ దేశ పారిశ్రామికుఁడు ఖండాంతరులవలనఁగూడ సంస్తుతు లను బొంది, పల్లెటూరియందలి తన చిన్నకుటీరము ముందు

తన వృత్తి విద్యానైపుణ్యమునకు దర్పసూచకముగ విజయ స్తంభమును ప్రతిష్ఠించి కీర్తిపతాకము నెగురవైచినాఁడు.

వృత్తు లెన్నో మనదేశమున సాధారణముగ కుటీర పరిశ్రమ లన్ని కలవు. వీనిని నడపునది జీవములేని యంత్రములు కాక బుద్ధివైభవమును, ప్రతిభాసంపదయుఁగల దివ్యచైతన్యాంశసంభవుఁడగు మానవుఁ డగుటవలన అవి పారిశ్రామికకళలై పరిఢవిల్లినవి. హిందూదేశపరిశ్రమలనుగుఱించి యిచట వ్రాయుట అనవసరము.

### కులసభలు, నిధులు :

స్వధర్మసంరక్షణమునకై ఈ కులములకు కులసభలును, పంచాయతులు నుండెడివి. హిందూధర్మశాస్త్రములుకూడ ఆయా కులములకు సంబంధించిన వివాదములను పరిష్కరించుపద్ధతి కులసభలకే వదలిపెట్టి వానిని గౌరవించినవి. పూర్వపు ధర్మశాస్త్రకారులకు ఈ వృత్తులయం దెంతటి గౌరవము కలదో ఈ విధమైన ధర్మశాస్త్రనిబంధనములను గాంచినఁ దెలియఁగలదు.

కులసభలుమాత్రమే కాక ప్రత్యేకము ఇప్పటి 'బ్యాంకు'లవంటి కొన్నినిధు లుండెడివి. రాజులు మొదలగు ధనాఢ్యు లాయాలు కులములవారు తయారుచేసిన పారిశ్రామిక సంపద కొని యెవరికైన దానముచేయఁదలఁచినప్పుడు ఆ దాన మనువర్షము నా చంద్రార్కస్థాయిగ సాగుచుండుట కయి తాము దానము చేయఁదలంచినదానివిలువకు సరిపోయిన వడ్డీనొసంగు మూలధనమును ఆ కులమువారి నిధి

కొనసంగువారు. ఈ పద్ధతివలన రెండు లాభములు కలుగుచుండెను; (౧) ధర్మము అచంద్రార్కస్థాయిగ సాగుట; (౨) మూలధనమువలన నా పరిశ్రమ అభివృద్ధిఁగాంచుట. ఈవిధమైన నిధులు, నిబంధనములు క్రీస్తుశకారంభకాలముననే, అనఁగా ఆంధ్రభూపతులు పరిపాలించునాఁటికే కలవు. అప్పటికే ఆయాయి వృత్తి సంఘములు (Trade unions) చక్కని వికాసమునొందిఁ అభివృద్ధిఁ గాంచినవి.

ప్రతివృత్తియు చాల గౌరవప్రదమైనదిగ నెన్నఁబడుచుండెను. ప్రాచీన హిందూగ్రామవ్యవస్థను పరిశీలించినచో ప్రతివృత్తికి నుచితస్థాన ముండినట్లు సువ్యక్త మగును. కృషిజీవనాధారముగాఁగల జాతియగుటచేత హిందువులు ముఖ్యముగ నూటికి తొంబదితొమ్మిదివంతున గ్రామములందే నివసించువారు. హిందూసంఘ పరిపాలనమునకేమి, మఱియితర విషయమునకేమి పూర్వము - పూర్వమే యననేల, ఇప్పటికిని - గ్రామమే ప్రాతిపదిక. హిందూదేశమునంతను కంపింపఁజేయఁజాలు ఏ విజ్ఞాన సంచలనము కలిగినను అది గ్రామముననుండియే ప్రాదుర్భవించుచుండెను. ఏ సంస్కర్త కాని, ఏ రాజకీయతంత్రజ్ఞుఁడు కాని పూర్వము ప్రకృతి యొడిలోని పాలబుగ్గల పల్లెటూరిని లాలింపఁగలిగెనా, అతఁడు హిందూదేశమునంతను నూటాడింపఁగల బలమును సంపాదించినాఁడన్నమాటయే. పూర్వ మిట్టి మహాసంస్థయు, హిందూసంఘ మహాదుర్గమునునైన గ్రామమున 'కులపతి'యైన పారిశ్రామికుఁ డుచితస్థానమును సంపాదించెను.

## వైదికవిద్య, వృత్తివిద్య :

బ్రాహ్మణుఁడు తన వశమున నున్న వేదవిజ్ఞానమును ప్రజల కొసంగినను పారిశ్రామికుఁడు లేనిచో నిలువ నీడ యేది? భోజనాదికము లమర్చుకొనుట కుపకరణములును సాధనములు నుండునా? పారిశ్రామిక విజ్ఞానము లేనిచో ఆధ్యాత్మికవిజ్ఞానముండియు సంఘ మభివృద్ధినొందఁజాలదు. ఆధ్యాత్మికదృష్టి లేని పారిశ్రామికవిజ్ఞానము అపాయకరము. ఆధ్యాత్మిక, పారిశ్రామికవిజ్ఞానములం దేది కొఱవడినను రెండవదానికి ప్రశస్తి లేదు. పారిశ్రామికవిజ్ఞానము సుందరమును, హృదయాకర్షకమునైన ఆధిభౌతిక నాగరికతను సృష్టించుచుండ ఆధ్యాత్మికవిజ్ఞానము దానికి దివ్యగుణమును తేజస్సు నొసంగి ప్రాణముపోయుచున్నది. భారతీయనాగరికత యంతయు పల్లెటూరి పారిశ్రామికుని చిన్ని కుటీరమునుండియు, నిరాడంబరజీవియు వేదవిద్యాసంపన్నుఁడునైన బ్రాహ్మణుని పర్ణశాలనుండియు పెరిఁగి పెంపుఁగాంచినది. ఈ రెండువిధములైన విభాగములకుఁగల యన్యోన్య సంబంధమును గుర్తించినది గనుకనే మన ప్రాచీనగ్రామ మీరెంటికి నుచితస్థాన మొసంగి యైక్యత సమకూర్చినది. ప్రాచీన గ్రామవ్యవస్థయందు వేదవిద్యాసంపన్నుఁ డైన బ్రాహ్మణుని కెట్టి ప్రాముఖ్యము గలదో వృత్తి విద్యానిపుణుఁడైన పారిశ్రామికునికి నట్టి ప్రాముఖ్యమే కలదు. ప్రాచీన గ్రామ మీ రెండువిధములైన విజ్ఞానమును సమన్వయముచేసి నేఁటి పారిశ్రామికసమస్యను, దానికి సంబంధించిన యితరములైన చిక్కులను 'ఆధునికనాగరికత'

కనులు తెఱవకమునుపే చక్కగ పరిష్కరించింది. పారిశ్రామికునికి గ్రామవ్యవస్థలో 'వృత్తి' రూపమున స్థాన ముండుట వలన వృత్తివిద్య కెట్టి యాదరణ ముండెడిదో తెలియఁగలదు. పూర్వము బ్రాహ్మణుఁడు, పారిశ్రామికుఁడు ఏ రిరువురును హిందూసంఘమునకు రెండు నేత్రములవలె నుండి పరస్పరము సహానుభూతిని గలిగియుండుట నేర్చుకొని, ఆధ్యాత్మికవిద్య కధికారులై ఉన్నతాదర్శములను జూపి మానవునియందలి దివ్యసంపదను దోహదముచేసి యొక్కరును, ఆధిభౌతికవిద్యాచార్యులై సౌందర్యరసపరిప్లుతములగు కళారచనములను గావించి జీవితమును సౌఖ్యానందసంభరితము గావించి మఱి యొక్కరును సంఘమును నడిపించి దేశమును పరిపాలించు వారు.

## 'భటవృత్తి' మాన్యములు, గ్రామవ్యవస్థ :

ప్రతిగ్రామమునకు కమ్మరి, వడ్రంగి, కంసాలి మొదలగువారి కందఱకు 'వృత్తు'లను పేర వృత్తిమాన్యము లుండెడివి. గ్రామము ఏర్పాటగునప్పుడే ఈ వృత్తు లేర్పడుచుండెడివి. గ్రామజీవనము పరిపూర్ణమయి సరళముగ నడచిపోవుట కవసరమైన యన్నివృత్తులవారు నుండుటవలననే పూర్వ మొక గ్రామ మింకొకగ్రామముమీఁద నాధారపడవలసిన యావశ్యకము లేకపోయెను. గ్రామమున కా యాయి వృత్తులవారు భటులుగ నుండి సంఘశరీరమును కాపాడువారు. కావుననే వారి కేర్పడిన మాన్యములకు 'భటవృత్తిమాన్యము' లనియు, 'జాతికట్టుమాన్యము' లనియు పేరు కలిగెను. పూర్వము

గ్రామమే కాక యందలి దేవస్థానముకూడ వారికి మాన్యము లిచ్చి గౌరవించి పోషించుచుండెడిది. దక్షిణదేశమున నేమాత్రము ప్రసిద్ధికెక్కిన దేవాలయమునకైనను కుమ్మరి, కమ్మరి, కాసె (తాపీపనివాఁడు), వడ్రంగి, స్వర్ణకారుఁడు మొదలగు వారెల్లరు నుండువారు. ఇట్లు మహాసంస్థయైన గ్రామమును, అందలి ఉపసంస్థయైన దేవస్థానమునుగూడ గొప్ప పారిశ్రామిక పోషణాగారములుగ నుండుటయేకాక ఆయాయివృత్తుల వారు వారి వారి విద్యలలో నారితేరుటకును, వారికి చేయి తిరుగుటకును ప్రాథమిక శిక్షణశాలలుగఁగూడ నుండెడివి.

ఆయాయి వృత్తులవారు వారి వారి వృత్తివిద్యల యందు నిపుణులగుటకు గ్రామవ్యవస్థ ఈవిధమున నవకాశ మిచ్చుచుండ ధనికులు, సామంతమండలేశ్వరులు, రాజులు మొదలగువారు నూతులు త్రవ్వించియు, గుళ్లు గోపురములు చెఱువులు కట్టించియు, తమ పనితనముఁ జూపుటకు పని వాండ్ర కవకాశ మిచ్చి వారి నాదరించువారు. కర్మకరుఁ డతని పనితనము చూపి తన స్వామిని మెప్పించినచో అతఁడు తద్వృత్తివిద్యావిశారదునకు కొంతభూమి దాన మొసఁగు వాఁడు. ఇట్లు పూర్వము పారిశ్రామికకళానిపుణులైన విద్యావంతులకు కళాభిరుచిగలవారు బహుమానరూపముగ భూమి నొసంగి యిచ్చిన దానశాసనము లనేకములు కాన్పించుచున్నవి. ఇట్లు మాన్యముల నొసంగి యాదరించుటయె కాక వారి పనితనమును మెచ్చుకొని కళాప్రియులైన ప్రభువులు సాంఘికముగ వెనుకఁబడియుండువారికి కొన్నికొన్ని స్వాతం

త్ర్యమర్యాదలనుగూడ నొసంగి క్రమక్రమముగ సంఘమున వారి పరపతియు, గౌరవమర్యాదలును హెచ్చునట్లు చేయు వారు. ప్రాచీన శాసనావళిని గాంచినచో మన కిట్టి శాసనములు కొన్ని కానఁబడును. ఇట్టి నృత్తి విద్యావిశారదుల వలన ఆయాయి కులములకు హిందూసంఘమున గౌరవము హెచ్చుచువచ్చెను. ఆయాయి కులములకు మూలస్తంభముల వలె నుండిన విద్యావంతులు దేశమును సౌభాగ్యవంతముగ దిద్దుటకై తమ మేధాశక్తిని, ప్రతిభాసంపదను వినియోగించు వారు.

## పంచాణమువారు, వారి పనితనము :

లలితములైన పారిశ్రామికకళలను పోషించి, కాంపాడి దేశమునకు సౌభాగ్య సౌందర్యముల నొడఁగూర్చినవారు ఈ పారిశ్రామికజాతులవారే. వీరిలో 'పంచాణము' వారు అనఁబడు విశ్వకర్మవంశజులు ముఖ్యులు. బ్రహ్మ కుమారుఁడైన విశ్వకర్మకు అయిదుగురు కొడుకులు కలరు. వారైదుగురు (౧) కమ్మరము, (౨) వడ్రంగము, (౩) కంచరము, (౪) శిల్పము, (౫) స్వర్ణకారకము (కుందనపుఁబని) అను నయిదు వృత్తులకు కారకులైరి. ఈ యైదువృత్తులవారికి "ఐద్దాయు' లనియు పేరు. వీరు తమపేర్ల చివర 'ఆచారి' పదమును జేర్చు కొందురు. వల్లభోజు, బసవోజు, వేమోజు అని 'ఓజు' పదాంచితనామములు పూర్వకాలపు శాసనములలో వీరికి తఱచుగఁ గన్పట్టును; తామ్రశాసనములనుగూడ వీరే చెక్కువారు. కళింగగాంగవంశజుఁడగు మూఁడవ వజ్రహస్తనృపతి దాన

శాసనముల యుత్కీర్ణకులలో మహోక్షశాలులు మేంటోజు, నూకమోజు, వల్లేనోజు అనువారు కలరు. ఉపాధ్యాయుడని యర్థమిచ్చు నొజ్జరూపాంతరమైన ఓజపదమే ఓజుగా మాఱినది.

గుంటూరు మండలమునందలి పల్నాడు తాలూకా మాచెర్ల గ్రామమున ఆదిత్యేశ్వరాలయమునందున్న శాసనములలోఁ గొన్ని యీ విశ్వకర్మకులజుల ప్రశస్తిని తెలుపుచున్నవి. ఆ శాసనములందు పేరెన్నికఁ గన్న విశ్వకర్మవంశోద్భవులైన కొందఱాచార్యులు పేర్కొనఁబడియున్నారు. వారు శివలింగములను మలఁచుటలోను, విగ్రహములను చెక్కుటలోను, చతుర్విధప్రాసాదాదులను నిర్మించుటలోను, వాస్తుశాస్త్రమునకు సంబంధించిన జ్ఞానమునందును ప్రజ్ఞావంతులని సంస్తుతింపఁబడిరి. మఱియొక శాసనము వీరిని 'దశక్రియా'పరిజ్ఞాతలని పొగడుచున్నది. నగర, గ్రామ, దుర్గ నిర్మాణములు, జలనిర్గమనాగమనాది నిర్మాణములు, దేవాలయ గోపుర తటాకాది నిర్మాణములు మొదలగువానియందు వీరు ప్రవీణులై దేశముకళాసంపదను పెంపొందఁజేసిరి. ఎల్లోరాగుహాలలోని కైలాస సౌధాదులు, మామళ్ళపురము (మహామల్లపురము – మహాబలిపురము) నందలి ధర్మరాజాదుల శిల్పరథాదులు, సాంచీమున్నగు స్తూపరాజములు– ఇవి యవి యననేల, పోయినది పోను ఇప్పటివఱకు దేశమునందు నిలిచియున్న శిల్పకళాసంపద యంతయు ఈ 'పంచాణమువారు' తమ పోషణ, రక్షణముల క్రిందికి వచ్చిన కళనెంత భద్రముగ కాపాడి, దాని నెంత చక్కగ వినియోగ

మునకు తెచ్చిరో వెల్లడించు మహోత్కృష్ట నిదర్శనముగ నున్నది. ఇప్పటికి నీ పైనుడివిన నిర్మాణములందలి శిల్పకళా కౌశలమును జూచి, యానందించి తలయూఁపనివాఁడు లేఁడు. అట్టిది ప్రాచీనార్య సంప్రదాయమున పెరిఁగి కులవిద్యాపారంగతులయిన విశ్వకర్మకులజుల యద్భుత కళాకౌశలము :

## శిల్పకళాగౌరవము, చారిత్రకోదాహరణములు :

సిద్ధహస్తులైన యిట్టి శిల్పాచార్యులను స్వమతస్థులే కాక మతాంతరులయిన శత్రువులుకూడ గౌరవించి యాదరించుచుండువారు. హిందూదేశైశ్వర్యము నపహరించుటకై పెక్కుతడవలు దండయాత్రలు సలిపిన సుల్తాను ఘజనీ మహమ్మదు హిందూవిగ్రహముల నేవగించుకొనినను వానిని మలఁచుటలోను, వానికొఱకు ఆలయములను నిర్మించుటలోను హిందూశిల్పులు చూపిన కళానైపుణ్యమునకు ఆశ్చర్యవిముగ్ధుఁడగుచుండువాఁడు. మథురానగరమును ముట్టడించినపిదప ఆ నగరము ఘనతను, ఆనగరమునందలి భవనముల గొప్పతనమును పొగడుచు సుల్తాను ఘజనీనగరమునందలి యతని ప్రతినిధి కుత్తరము వ్రాసినట్లు మహమ్మదీయ చరిత్రకారుఁడయిన ఫెరిష్టా తెలిపియున్నాఁడు. 'మహమ్మదులవారి మతమువలెనే సుస్థిరమైన దివ్యభవనసహస్రము లిచట గలవు. ఎన్నియో లక్షలకొలఁది దీనారములను వ్యయపఱిచిననేకాని యీనగరమింతటి మహోన్నతస్థితికి వచ్చియుండుట యసంభవము. ఇంతే కాదు; ఇంకొక రెండువందల సంవత్సరములకైనను మఱల నిట్టినగరమును నిర్మించుటకుఁ గాదు' అని సుల్తాను

ముహమ్మదు వ్రాసెనఁట. సుల్తాను ఘజనీకి మరలి వెళ్ళినప్పుడు ౫౩,౦౦౦ మంది హిందువులను ఖైదీలుగఁ గొనిపోయెను. వీరిలో చాలమంది శిల్పులు, వృత్తివిద్యానిపుణులు నుండి యుందురనుటకు సందియము లేదు; ఏలయన, గాంధార దేశము లోని సుల్తాన్ ముహమ్మదు రాజధానియైన ఘజనీయం దున్నన్ని ప్రాసాదములు, దివ్యభవనములు, జలాశయములు, కేళీగృహములు, మండపములు మొదలగునవి ప్రాగ్దేశనగర రాజములందు వేనియందును గానరా వనియు, వీని నన్నిటిని నిర్మించినవారు హైందవ శిల్పులే యనియు తెలియుచున్నది. క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్ది కడపట తైమూరు హిందూదేశమునకు దండెత్తివచ్చి ఢిల్లీ నగరమున లక్షల కొలఁది జనులను దారుణవధ పాలుచేసి, పిదప చాలమందిని ఖైదులుగ పట్టుకొనెను. వారిలో శిల్పులు మొదలగు కళాచతురు లెందఱుండిరో లెక్కవేయించి, వారిని తనరాజధానియైన 'సమర్కాండు'కుఁ గొనిపోయి, వారిలో చాల ప్రవీణులయినవారిని కొందఱిని అచ్చట నొక మసీదు కట్టించుటకు దనయాస్థానమునఁ దనయాశ్రయమున నుంచుకొని, మిగిలినవారి నందఱిని తన సామంతరాజులకు, అమీరులకు నొప్పగించి, వారి పోషణభారము వారిపై మోపెనఁట. ఈవిధమున నెన్ని యుదాహరణములనయిన నొసంగవచ్చును. మహమ్మదీయులు హిందువులకు కడుం గడు శత్రువులై మతవిషయకదృష్టిని పగఁబూని హిందూ విగ్రహములను, హిందూదేవాలయములను భగ్నముచేయుచువచ్చినను కళాకుశలుర శిల్పకౌశలమును మెచ్చకపోలేదు;

మెచ్చి వారి నాదరింపకపోలేదు. ఇంత యేల, శత్రురాజులు హిందూదేశముపై దండెత్తివచ్చినప్పుడు వారి శిల్పకళారచనములను జూచి ముగ్ధులై అట్టి శిల్పవిద్యావాచస్పతులను వారి దేశములకుఁ గొనిపోయి వారికి గౌరవసమ్మానము లొసంగి కళను గౌరవించియున్నారు. అందువలన హైందవశిల్పకళ దేశదేశములకు బ్రాఁకి అచ్చటచ్చట వలసల నేర్పాటుచేసికొనెను. తుదకు అత్యంతరమణీయమైనదని పేర్వడసిన బాగ్దాదునగరమును కట్టినదికూడ హైందవశిల్పులే యని కొందఱు చరిత్ర పరిశోధకుల యభిప్రాయము.

## దేశీయప్రభువుల కళాభిమానము :

శత్రురాజులమాట యటులుండ దేశీయులైన మహారాజులుకూడ కళల నాదరించి రనుటకు పెక్కు నిదర్శనములు కలవు. అట్టి వొకటి రెండు నుడివినఁ జాలును. 'అశోకవర్ధనుని కాలమున శిల్పు లొకవిధముగ రాజు కొలువులోనివారుగనే పరిగణింపఁబడుచుండిరి. చేతులు పోఁగొట్టి కాని, కళ్లు పోఁగొట్టి కాని......వృత్తివిద్యావిశారదుని శక్తిసామర్థ్యములను కుంటుపఱచినవారికి శిక్ష, శిరశ్ఖండనమే. నౌకానిర్మాతలు, కవచ నిర్మాతలు వేతనములను బడయు రాజసేవకులుగ నుండిరి; వారు రాజునకే కాని యితరులకు పని చేయఁగూడ దనునిర్బంధ ముండినట్లు చెప్పుదురు. వద్రంగులు, కమ్మరులు మొదలగువారిక్షేమమును రాజే ప్రత్యేకము కనుఁగొనుచు వారిపని పరిశీలించుచుండువాఁడు.' ఢిల్లీ పాదుషాయైన అక్బరు కొలువులో పెక్కురు కళాచతురులు, వృత్తి

విద్యానిపుణులు నుండి రనియు, వారిరచనములలో అత్యు త్తమములయినవానికి ప్రత్యేకబహుమానముల నొసంగి షాదుషా వారిని గౌరవించువాఁడనియు అతని మంత్రియఁయిన 'అబుల్ ఫజల్' 'అయిన అక్బరీ' అను గ్రంథమ్మున వ్రాసి యున్నాఁడు.

కర్ణాటసార్వభౌముఁడైన కృష్ణదేవరాయఁలు ఉదయ గిరి దుర్గముపై దండెత్తివెళ్ళి దానిని పరిపాలించుచుండిన గజపతి సామంతులను జయించి యాకోటలోని యొక దేవా లయముననున్న యత్యంతసుందరమైన బాలకృష్ణవిగ్రహ మును పెల్లగించి నిజరాజధానియైన విజయనగరమునకుఁ గొని పోయి యచట నొకసుందరదేవాలయమున దానిని ప్రతి ష్ఠించినట్లు చారిత్రకాధారము కలదు.

ఈ పైనొసంగిన యుదాహరణములను బరిశీలించినచో దేశీయులయిననేమి, విదేశీయులయిననేమి ప్రభువులగువారు ఇట్టి విద్యావంతులను ఆదరించి గౌరవించి, శిల్పమును పోషించువా రనియు, పరరాజులు దేశమును జయించినప్పుడు చతురులైన శిల్పాచార్యులను, తద్విరచితములైన కాళాకావ్య రచనములను తమ దేశమునకుఁ గొనిపోయి తాము జయిం చిన దేశమును సౌందర్యరహితమైన శుష్కజనపదముఁ గావించి, రాజులను పరాభవించువారనియు తెలియుచున్నది.

**ఉపసంహారము :**

ఈ పైనుడివిన విషయము లన్నియు హైందవు లయిన నేమి, హైందవేతరులైననేమి పూర్వులకుఁగల కళాభిరతిని

సహస్రకంఠముల నుచ్చైస్స్వనమున నుద్ఘోషించుచున్నవి. ఆరితేరి సిద్ధహస్తులైన శిల్పులు, స్థపతులు మొదలగు కళాకోవిదులు దేశమునకు కీర్తితెచ్చు నలంకారములు. వారే దేశసంపద, లలితకళాసంపద, శిల్పకళావిజ్ఞానములేని దేశము దేశమే కాదని మన పూర్వులు భావించియుండినట్లు పూర్వోక్త విషయములవలన విశదమగుచున్నది. తుదకు పదునాఱు, పదునేడు, పదునెనిమిది శతాబ్దులందు తంజావూరు మధురానగరములు రాజధానులుగ పరిపాలించిన నాయకరాజులుకూడ సుప్రసిద్ధులైన శిల్పాచారుల్యులను పోషించి కళలను వృత్తివిద్యలను ఆదరించి రనుటకు వారి కాలమున నిర్మింపఁబడిన గొప్పగొప్ప దేవాలయాది నిర్మాణములే తార్కాణము. విజయనగరాధిపతుల కాలమునను తంజావూరు మధుర నాయకరాజుల కాలమునను హిందూ దేవాలయశిల్పము అత్యంతోన్నతస్థితికి వచ్చినది. ప్రజ్ఞాఢ్యులయిన యాకాలపు శిల్పుల రచనములు నేఁటికిని చెక్కు చెదరక చూపఱకు వాని రచనామాధుర్యమునకు ఆశ్చర్యమును, నేఁటి కళాహైన్యమునకు విషాదమును గలిగించుచున్నవి.

ఈ సంగతుల నన్నిఁటినిబట్టి చూడఁగా పూర్వము ప్రభువరేణ్యులు అగ్రహారముల నొసంగి వైదికవిద్యాపారంగతుల నెట్లాదరించిరో, బహుకళాకావ్యరచనములు కావించిన వృత్తివిద్యా విశారదులనుగూడ నట్లు సమానముగనే బహూకరించిరని స్పష్టపడఁగలదు. వేదశాస్త్రపారంగతుఁ

డయిన ఛాందస బ్రాహ్మణుని హస్తమున మతవిద్య క్షేత్రి యాధ్యాత్మికపు తీర్పు కలిగెనో అట్లే కుటీరవాసియు, నిగు పేదయు, నమాయకుఁడునైన పారిశ్రామికుని హస్తలాఘవ మున వృత్తివిద్యయు కళాకుసుమముగ వికసించి దశదిశలఁ దన నెత్తావిని విరజల్లి సర్వజనానందకారియై విరాజిల్లెను. అంతటి యౌన్నత్యదశనందిన యీ రెండువిధములగు విజ్ఞాన వల్లరులకు గ్రామమే యాలవాలము; ప్రాథమికాలంబము. పల్లెటూరి పారిశ్రామికుఁడు తన కర్మశాలలో వెలిఁగించిన ఈ విజ్ఞానరత్నదీపము దేశాంతరములనుగూడ ప్రకాశవంత ముఁజేసి, సౌందర్యరససృష్టికి పరమావధి యయినది. అట్టిది మన పూర్వపు వృత్తివిద్య; అంతటి నిరాడంబరమైనది తద్విద్యావిధానము; అంతటి యుత్కృష్టమైనది దానిఫలితము.



# సింహావలోకనము

పరిశోధనవలనఁ దెలియవచ్చిన విషయములను జన సామాన్యమునకుఁ దెలియఁజేయవలెనను సంకల్పముతో ఈ చారిత్రకవ్యాసములు వ్రాయఁబడినవి. విషయము ప్రధాన ముగ సంస్కృతికి సంబంధించినది. యుద్ధవివరములు, వంశాను క్రమవర్ణనములు మొదలయిన కేవల చారిత్రక విషయములు ప్రజల కెక్కువ యుపయోగకరములును కావు; వారి హృద యమున కెక్కువగను రుచింపవు. అదియునుగాక మన పూర్వులు సంస్కృతికే అధికప్రాముఖ్యము నొసంగి దాని నాదరించిరి.

ప్రాచీనకాలమున రాజాస్థానములలోని విద్యామండప ములు వేదవేదాంగవిదులయిన విద్వాంసులతో, కవులతో, కళామర్మవిదులయిన శిల్పులతో, చిత్రకారులతో కిటకిట లాడుచుండెడివి. విద్యావినోదములు, శాస్త్రచర్చలు, మత వివాదములు, పురాణకాలక్షేపములు, ధర్మోపదేశములు, తత్వజిజ్ఞాసలు మొదలయినవాటితో రాజవిద్యామండపము మహానందకరముగ నుండెడిది. ఈ చర్చలలోని యంశము లను, వినోదపాత్రములయిన విశేషములను, జీవితము నొడి దొడుకులు లేకుండ నడిపించు ధర్మరహస్యములను అనేకవిధ ముల, అనేకమార్గముల సమర్థులయినవారు ప్రజలకుఁ దెలియఁజెప్పి వారి చిత్తసంస్కారమునకును, ఉన్నతికిని కారణభూతు లగుచువచ్చిరి. ప్రజలు పాశ్చాత్యదేశముల

యందు రాజకీయముల నాధారముచేసికొని యభ్యున్నతి నంది యుండ ప్రాచ్యదేశమయిన మన భారతఖండమున సంస్కృతి నౌకఁ జేపట్టి సంసారసాగరమును తరించుచువచ్చిరి. అందు వలననే ప్రతీచి ఆధిభౌతికసంపదకు సూత్రములు పేనఁగా ప్రాచి ఆధ్యాత్మికవిభూతిని సంతరించుకొని అభ్యుదయము నొందుచువచ్చినది.

సంస్కృతిప్రధానమైన రాజ్యము (Culture-state) మనది. ప్రాచీనకాలమున మనదేశమును బరిపాలించిన భూపతులు — సూర్యవంశజులు, చంద్రవంశజులు అయిన క్షత్రియులు కానీ, తదన్యులు కానీ – అందఱును వివిధశాస్త్ర కళాకోవిదులయిన విద్వత్ప్రకాండులే. రాజకీయవిప్లవాది ఝంఝూమారుతములు ఎన్ని ప్రచండవేగముతో వీచి దేశమును సంక్షోభింపఁజేసినను సంఘములక్ష్యము ప్రధానముగ సంస్కృతిమీఁదనే యుండెడిది. ప్రతి విప్లవమును, ప్రతి పరివర్తిపమును మన సంస్కృతితరంగణికి దోహద మిచ్చి వర్ధిల్లఁజేయుచువచ్చెనే కాని దానిని శుష్కింపఁ జేయలేదు. దేశీయములు, విదేశీయములు అయిన వివిధ జాతులతోను, వివిధ కులములతోను సంకులమయిన యీ భారతఖండమున మన పూర్వులు ధర్మసంస్కృతిని రాచ బాటను చేసి, సమరసభావమును పెంపొందించి యైక్యతను సాధించినారు. హిమాచలము మొదలు కన్యాకుమారివఱకుఁ గల దేశమంతయు ఏకైకసంస్కృతి నిబద్ధమయినది. తమ నాఁటి పరిస్థితులను జక్కఁగ అవబోధము కావించుకొని,

ఆనాఁటి రాజకీయ, సాంఘిక పరిస్థితుల ననుశీలించి దేశీయు లందఱు పొంది పొసఁగి యభ్యుదయము నొందుట కానాఁటి విషమసమస్యలకు మనపూర్వులు చేసిన పరిష్కార మది. ఆ లక్ష్యమునే దృక్పథమున నుంచుకొని మనసంఘ మింతవఱకు సాగిపోవుచున్నది. ఎప్పు డేయవాంతరము సంభవించినను, ఏ విపదంబుధి యడ్డమయినను సంస్కృతిసూత్రముల సూఁతగాఁ గొనియే, సంస్కృతినౌక నాధారము చేసికొనియే ప్రాచీన భారతీయసంఘము వాటిని తరించుచువచ్చినది. కాఁగా సంస్కృతిచారిత్రమే భారతీయచారిత్రము.

ప్రాచీనభారతీయసంస్కృతివిన్యాసము మొదటి వ్యాసమున విశదీకరింపఁబడినది. ప్రాచీన భారతఖండము వేర్వేఱు దెసలఁ దన సంస్కృతిని వ్యాపింపఁజేసి, సందేశమును వినిపించి అనేకప్రాచ్యదేశముల యభ్యుదయమునకు కారణమయినది: భారత సంస్కృతికి ప్రాగ్దేశము పంటపొలము లయినవి. భారతీయ సంస్కృతిచ్ఛాయలు కొన్ని మాత్రమే — అందు నను ప్రధానముగ బౌద్ధయుగమునకు సంబంధించినవిమాత్రమే —ఇందు ప్రదర్శితములైనవి. ఇవియైనను కడుపరిమితములు.

బౌద్ధయుగమునాఁటి హిందూదేశ చారిత్రము అతి ప్రశస్తమయినది, కీర్తిమహితమయినది. బౌద్ధము మొట్ట మొదట శీలప్రధానమయిన మతముగ రేకెత్తి, భారతీయుల నడవడికకు ఒప్పులు దిద్ది, వారికి శీలసంపత్తి నొడఁగూర్చినది. ప్రజాహృదయమును బాగుగ రంజింపఁజేసి ఆకర్షించినదగుట చేత బౌద్ధము వ్యాపించిన కాలముననే ప్రజాసామాన్యమున

ఎక్కువ సంస్కారము కలిగినది. ఈ సంస్కారము ఒక్క శిల్పవిషయముననే కాక అనేకవిషయములందు అభివ్యక్తమయినది. అది బహుముఖము. ఏలయన, భారతీయ శిల్ప, చిత్రలేఖన, సంగీతాది లలితకళలకు బౌద్ధయుగము దాదియైనది. కావున, బౌద్ధము ప్రజాసామాన్యమునకు చిత్తసంస్కారము కలిగించి జీవితము నందగింపఁజేసికొనఁగల శక్తినిగూడ ప్రసాదించినది. జనులలో సౌందర్యపిపాస, సౌందర్యరసదృష్టి హెచ్చినది. ఈ కారణమున బౌద్ధయుగము నాఁటి హిందూదేశము అనుపదమును లావణ్యమధురమును, రసోదంచితప్రభాభాసురమును అయిన ప్రశస్తకలామందిరమయి అభినుతి కెక్కినది. భారతీయజీవితము రసగ్రహణ పారీణమై, సకల కలాకలాపాంచితమై దివ్యసౌందర్యక్షేత్రమయినది; జనసంఘము సాధువై దివ్యగుణసంపన్నమయి, సభ్యతామహితమయినది. బౌద్ధము భారతదేశమునకు తీర్చిన తీర్పు ఇది. భారతీయహృదయము కరుణా, సౌందర్యరస తరంగితము కాఁగా భారతీయుని గేహము కలానిధానమయి అందలి ప్రతి స్వల్పవస్తువునుగూడ లావణ్యాధిదేవత నుపాసించి అందచందముల నొడిచికొని నయనానందకరమైనది.

బౌద్ధయుగ భారతదేశము బహుముఖ కార్యకలాప బంధురము. భారతీయ బౌద్ధభిక్షువులు మతప్రచారకులై విదేశములయందును, దూరద్వీపములందును బుద్ధుని ధర్మ సందేశమును వినిపించి వాటిని బౌద్ధారామ విహారసుందరములు కావించిరి. వాణిజ్య వ్యాపార నిపుణులైన వైశ్యులు

సాహసికులైన సాంయాత్రికులై భారతావనిని సకలధనకనక వస్తువాహన సమృద్ధముఁ జేసిరి. విశ్వకర్మకులజులు బౌద్ధ పౌరాణిక దేవహర్మ్యరచనాకలాచతురులై, సిద్ధహస్తులైన శిల్పులుగ ప్రతీతి కెక్కిరి. మన దేశమునకును, ఇతర దేశముల కును సాగిన వాణిజ్య వ్యాపారమార్గము ననుసరించి మన సంస్కృతికి సభ్యతలుకూడ అన్యదేశములకు ప్రాఁకి యచట విశిష్టత చేకూర్చుకొని క్రొత్తరూపముతో, క్రొత్త తేజముతో వెలుఁగొందినవి. ఇందుకు జావాద్వీపవాసుల వినోదములే తార్కాణము.

భారతదేశమున కిరుగు పొరుగుల నున్న దేశములు బౌద్ధము నాదరించి బుద్ధభగవానుని పాదములకుఁ బ్రణమిల్లి యామహాత్ముని సందేశమును శిరోవతంసము కావించు కొన్నవి; నాఁటినుండి తద్దేశవాసులకు బుద్ధపదాంకిత మయిన భారతదేశము పవిత్రమయిన బౌద్ధక్షేత్రమయి యాత్రాస్థల మయినది. పలుదేశములనుండి, పలు ద్వీపములనుండి బౌద్ధయాత్రికు లీ భారతావనిని సందర్శించి, బౌద్ధవిహారములందుఁ గొంతకాలము వసించి భారతీయ బౌద్ధాచార్యులకు శుశ్రూషఁ నెఱపి బౌద్ధవేదము నధ్యయనము చేసి, బౌద్ధధర్మ రహస్యములను గుర్తెఱింగి, బౌద్ధగ్రంథము లనేకములను వ్రాసికొని తమ దేశములకుఁ గొనిపోవుచువచ్చిరి. ఇట్టి దేశములలో తొలుదొల్త పేర్కొనఁ దగినది చీనాదేశము. చీనా భారతదేశములకుఁగల సంబంధము అతిపురాతనమైనది. భారత బౌద్ధమునకు చీనాదేశమున దొర

కీన యాదరమును, అచ్చట దాని వృద్ధి పతనములును 'చీనా-హిందూదేశములు : వాని ప్రాచీనానుబంధము' అను వ్యాసమున దిఙ్మాత్రముగ సూచితమయినవి. భారతదేశమునుండి చీనాకు వెళ్లిన బౌద్ధగ్రంథము లనేకములు చీనాభాషలోనికి పరివర్తితములైనవి. చీనాదేశము గొప్ప బౌద్ధగ్రంథ భాండాగారమయి, తన యిరుగు పొరుగు దేశములకు బౌద్ధమత విజ్ఞానము నందిచ్చి, యవి కాలక్రమమున బౌద్ధమత ప్రవిష్టములగుటకు కారణభూతమయినది. తుదకు నేఁడు బౌద్ధమునకు జన్మభూమియైన యీ భారతభూమిని లభింపని బౌద్ధగ్రంథము లనేకములు చీనా తిబెత్తు దేశములలో ఆ యా యి దేశభాషలలోనికి పరివర్తితములై దొరకుచున్నవి. ఈ సందర్భమున తిబెత్తు దేశమునందలి తంజూర్, కంజూర్ లను బౌద్ధగ్రంథ భాండాగారములు స్మరింపఁదగినవి. భారతదేశ బౌద్ధమునకు సంబంధించిన ప్రాచీన గ్రంథరాజము లనేకములు తిబెత్తుభాషలోని కనూదితములైన విపుడు బయలు పడుచున్నవి. వీనికి మాతృకలైన సంస్కృతగ్రంథము లిపుడు కలవగుటవలన బౌద్ధవిద్వాంసు లిపుడు తిబెత్తుభాష నేర్చుకొని వానిని సంస్కృతభాషలోనికి తిరుగ ననువదించుచున్నారు. ఈ విధముగ మహాయాన సంప్రదాయస్థాపకుడైన నాగార్జునాచార్యులవారి గ్రంథములు కొన్ని యిపుడు మనకు లభించుచున్నవి. భారతదేశము తన శిష్యదేశములనుండి మఱల తన మూలగ్రంథసంపత్తిని సేకరించుకొనుచున్నది.

బౌద్ధయుగపు వెలుగు ప్రసరించిననాఁటినుంచియే ఆంధ్ర దేశ చరిత్రము మనకు దృగ్గోచరమగుచున్నది. భారతఖండము నందలి యుత్తరాపథ దేశములనువలెనె మన యంధ్రదేశ మునుగూడ ప్రకాశవంతము కావించిన మతరాజము బౌద్ధము. మన దేశచరిత్రకు ఆరంభములు గోచరించునాఁటికే కృష్ణా, గోదావరీతీరములు బౌద్ధవిహార, స్తూపాలంకృతములై విరాజిల్లుచుండెను. ఆంధ్రదేశములోని ధాన్యకటకము, (శ్రీ) పర్వతము (నాగార్జునుని కొండ), భట్టిప్రోలు, రామిరెడ్డిపల్లి, చినగంజాము, పెదగంజాము, వేదాద్రి, రాజాద్రి, బుద్ధాం, గంటసాల మొదలైనవి సుప్రసిద్ధ బౌద్ధక్షేత్రములై భారతీయ బౌద్ధులకు సేవ్యములైన పుణ్యభూములై తనర్చినవి. ఈప్రదేశము లిప్పటికిని బౌద్ధయుగ సభ్యతను సూచించు శిథిలావశేషములను బహిర్గతము సేయుచు. తత్సభ్యతప్రశస్తిని దెలుపు సూచికలై వెలయుచున్నవి.

బౌద్ధయుగమునాఁటి యంధదేశము జగద్గేయమయిన కీర్తిని గడించుకొన్నది. ఆ యుగమునారంభమున ఆంధ్రదేశమును బరిపాలించిన మహీపతులు ఆంధ్ర - సాతవాహనులు రాజ్యాధికారమును చేతఁ జిక్కఁబట్టి దాక్షిణాత్యసభ్యతకు పునాదులు వేసినారు ; ఆంధ్రసభ్యతకు, ఆంధ్ర సంస్కృతికి ఒక రూప మిచ్చినారు. నాసిక, కార్లా, కన్హేరీలయందలి గుహాలును, సాంచీస్తూప తోరణరాజములును, అమరావతీ స్తూపశిల్పాలంకారములును ఆంధ్ర-సాతవాహలకీర్తి పతాక యందు లాంఛనములై వెలుఁగొందుచున్నవి. జగనన్నోన్నహాన

ముఖ్యమైన ఆదిమకాలపు ఆంధ్రశిల్పకృతు లనేకములు ఆంధ్ర — సాతవాహన భూపతుల పోషణాభిమానముల వలన వెలసినవే. తాము వర్ణాశ్రమాచారధర్మపరిపాలకులైన వైదికాచార నిరతులైనను ఆంధ్ర — సాతవాహన వసుమతీశ్వరులు తమ కాలమున ఆంధ్రదేశమున ప్రబలముగ వ్యాప్తిఁగాంచిన బౌద్ధము నెక్కువగ అభిమానించి యాదరించి, దాక్షిణాత్యుల, అందునను ఆంధ్రదేశీయుల కళాభిరతికిని, విజ్ఞానవ్యాప్తికిని జాలఁ దోడ్పడిరి; వేద, బౌద్ధమతములు రెంటిని సరిసమానముగ నాదరించి తమ మతసహిష్ణుతను వెల్లడించిరి. ఈ జనపతులు పరిపాలించిననాఁడు ఆంధ్రశిల్పి భారతదేశమంతటిలో శిల్పాచార్యపట్టభద్రుఁడయి అద్వితీయపదము నాక్రమించి యఖండప్రతిష్ఠను సమార్జించుకొన్నాఁడు; శిల్పకళయందు క్రొత్తదారులు తీసి క్రొత్త పోకడలు పోయి ఆనాఁడు దేశమున పాటమరించుచుండిన వేఱు వేఱు సంప్రదాయములను జాతీయతకు భంగము కలుగనివడువున చక్కఁగ సమన్వయించి మేళనముచేసి ఒక క్రొత్త భారతీయ కళాసంప్రదాయమునకు ఆచార్యపాదుఁడై, ప్రతిష్ఠాపకుఁడై అమరత్వసిద్ధినొందినాఁడు. భారతీయ కలాసంప్రదాయములలోని యంధ్రసంప్రదాయమునకు అమరావతీరీతి యనియు, అమరావతీ సంప్రదాయ మనియు పేరు. అమరావతిఆంధ్ర సంప్రదాయపు ఛాయలు ప్రాగ్దేశపు, ప్రాగ్ద్వీపపు కళావిస్ఫారణమునఁగూడఁ జూపట్టును.

ఒక్క కళావిషయముననే కాక మత, విద్యావిషయములయందుఁగూడ బౌద్ధాంధ్రదేశము ఆచార్యత్వము సంపాదించుకొన్నది. ఆంధ్రదేశము మౌర్యవంశభూపతుల పరిపాలనమునననంతరమున భారతదేశమంతటికి కేంద్రమహాబౌద్ధపీఠమయి విరాజిల్లినది. భారతీయ బౌద్ధ చారిత్రములో బౌద్ధాంధ్రచరిత్రము ఒక విశిష్టమయిన ప్రకరణము. ఆచారములలో, సంప్రదాయములలో, బౌద్ధధర్మసూత్రవ్యాఖ్యానచాతుర్యములో, స్తూపశిల్పాలంకారరచనావిజ్ఞానములో ఆంధ్రదేశ బౌద్ధులు విశిష్టతను జూపినారు. గ్రుడ్డిగ ప్రాంత నెన్నడును అనుకరింపలేదు; ప్రతిభా విశిష్టముకాని వ్యాఖ్యానములను వారు వ్రాయలేదు. ఆంధ్రదేశ బౌద్ధులవలన ఉత్తరదేశ బౌద్ధసంప్రదాయము దక్షిణదేశ బౌద్ధసంప్రదాయము అని భారతీయ బౌద్ధమున విశిష్టమయిన రెండు సంప్రదాయము లేర్పడినవి. దక్షిణదేశ బౌద్ధసంప్రదాయము ఆంధ్రసంప్రదాయము. బుద్ధఘోషాచార్యులవారు త్రిపిటకములకు వ్యాఖ్య వ్రాయుసందర్భమున పలుమాఱులు అంధ్ర (అంధక) బౌద్ధసంప్రదాయమును ప్రస్తావించుచువచ్చిరి. వారు ప్రమాణముగ గ్రహించిన ప్రాచీనార్థకథలలో (అర్థకథయన బౌద్ధవ్యాఖ్యాగ్రంథము) అంధ్రార్థకథ యొకటి. ఈగ్రంథ మిపుడు కానవచ్చుటలేదు.

ఆంధ్రదేశమున బౌద్ధము ముమ్మరముగ వ్యాపించిన కాలమున బౌద్ధాచార్యోత్తము లనేకులు ఈ యంధ్రభూతలమును దమ పదాంకములచేత బునీతము కావించిరి. ఇట్టి

వారిలో నాగార్జునాచార్యులవారు, ఆర్యదేవాచార్యులవారు, దిఙ్నాగాచార్యులవారు ప్రముఖులు. నాగార్జునాచార్యుఁడు భారతీయ బౌద్ధమున అఖండపరివర్తనముఁ దీసికొనివచ్చిన యసాధారణమనీషి, అద్వితీయప్రతిభాసంపన్నుఁడు. ఈయన జన్మస్థలమునుగుఱించి వివాదము లున్నను తనజీవితమునుత్తర భాగము నంధ్రదేశమున శ్రీపర్వతమునఁ గడపెననుటలో ప్రాచ్యపరిశోధకపండితు లెల్లరు నేకాభిప్రాయులే. నాగార్జు నాచార్యులవారికి నివాసభూమియగుటనే కావచ్చును, 'శ్రీ పర్వత' సానుప్రదేశమునకు నాగార్జునునికొండ యని పేరు కలిగినది. నాగార్జునాచార్యులవారికి సంబంధించిన గాథ లనేకములు టిబెత్తుదేశ బౌద్ధగ్రంథములందుఁ గలవు.

నాగార్జునాచార్యుల వారికిఁ బిదప ప్రసిద్ధుఁడయిన వాఁడు ఆర్యదేవుఁడు. నాగార్జున, ఆర్యదేవులు మహాయాన బౌద్ధసంప్రదాయ మూలస్తంభములు. దిఙ్నాగాచార్యులవారు వసుబంధువు శిష్యులు. ఈయన వేంగీ విహారమున నుండినట్లు టిబెత్తుదేశమందలి బౌద్ధగ్రంథములవలనఁ దెలియుచున్నది.

మన ప్రాచీన విద్యాసంస్థలు, ప్రాచీన వృత్తి విద్యా విధానము అను వ్యాసములు బౌద్ధయుగమును తదనంతరకాలపు పౌరాణిక హిందూయుగముతోఁ గలుపు కొలికిపూసలు; ఈవ్యాసములతో ఈ గ్రంథము ముగియుచున్నది.



